# ఉక్కు పాదం

(మొదటి భాగం)

## జాక్ లండన్



అనువాదం :

"ధనకుధరం"



'నగారా' ప్రచురణాలయం,

గుంటూరు-1.

# పరిచయం

ధనిక తత్వానికి, జాక్ లండన్ పెట్టిన శక్తిమంతమైన పేరు 'ఉక్కుపాదం.' ఈ పేరుతో ఈ గ్రంథం 1907 లో ప్రచురించబడింది. ఎప్పుడో ఒకనాడు-అదృష్టం త్వరగా కలిసి వస్తే-ధనికులకూ, సామాన్య ప్రజాసందోహానికీ జరగబోయే పోరాటాన్ని ఈ గ్రంథంలో మన కళ్ళకు కట్టించాడు ఈ గ్రంథ కర్త. ప్రజానీకంలో నిగూఢమైన ప్రత్యేకశక్తిసామర్థ్యాల్ని దర్శించ గల ప్రతిభ, భవిష్యత్పరిణామాన్ని గుర్తించకల్గిన ఉపజ్ఞ, జాక్ లండన్‌కు ఉంది. ఈనాడు మన కళ్ళ ఎదుట సాక్షాత్కరిస్తున్న సంఘటనలు రేపు ఏరూపాన్ని స్వీకరిస్తాయో గ్రహించకల్గిన దైవజ్ఞుడు. ఈ 'ఉక్కుపాదం'లో మనకందరికీ సాక్షాత్కారం చేయించిన ఆ భయంకరనాటకం ఇంకా వాస్తవికంగా ప్రదర్శితం కాలేదు. మార్క్సుయొక్క ఈ అమెరికన్ శిష్యుడి జోస్యం ఏనాడు ఫలిస్తుందో చెప్పలేం.

జాక్ లండన్ విప్లవాత్మక సామ్యవాది. సత్యసాక్షాత్కారంచేసి, భవిష్యత్తును దర్శించే, విజ్ఞానఖనీ, సహృదయుడూ, ధైర్యవంతుడూ ఐనవ్యక్తి ఈ గ్రంథంలో మనకు కనిపిస్తాడు. ఈయనపేరు 'ఎర్నెస్టు ఎవర్‌హార్డ్.' గ్రంథకర్త మాదిరిగానే ఈయనా కార్మిక వర్గానికి సంబంధించిన కష్టజీవి.

జీవితంతో మేధశ్శక్తితో నిమగ్నమైన ఏవ్యక్తి, లోకమంతా దద్దరిల్లిపోయేటట్లుగా ఏభై గ్రంథ సంపుటాలు వ్రాసి, యువకునిగా కీర్తిశేషుడైనాడో, ఆవ్యక్తి ఒక సామాన్య కర్షకుని పుత్రుడై, పది సంవత్సరాల ప్రాయంనుంచే జీవనోపాధికోసం పత్రికల మ్మడం సాగించాడన్న విషయం మీరు తెలుసుకోవాలి.

ఎర్నెస్టు ఎవర్‌హార్డ్ ధైర్యశాలి. జ్ఞాని. స్థైర్యవంతుడు. ఆర్ద్రహృదయుడు. సరిగ్గా ఇవే లక్షణాలుగలవాడు గ్రంథకర్తకూడా. గ్రంథకర్త తనకూ తను సృష్టించిన పాత్రకూ గల బింబ ప్రతిబింబ సారూప్యతా సంపూర్ణతకోసం, తన భార్యమాదిరిగానే, ప్రజ్ఞా స్థైర్యాలు గల ప్రియురాల్ని ప్రసాదించాడు. లేబరు పార్టీలో బలహీనతా చిహ్నాలు గోచరించగానే, జాక్ లండన్, తన భార్యయైన 'చార్మియన్ కిట్రెడ్జిలండన్'తో సహా బైటికివచ్చి, ఆమెను యథార్థ సోషలిష్టువాదినిగా మార్చివేసినట్లే, ఈ గ్రంథంలోని నాయకుడుగూడా తన ప్రియురాల్ని సోషలిష్టువాదినిగా మార్చేస్తాడు.

ఈ గ్రంథంలో చిత్రించబడిన రెండు తిరుగుబాట్లను నేనిప్పుడు పాఠకునికి పరిచయం చేయబోతున్నా. ఆ తిరుగుబాట్లు దారుణాతిదారుణాలు. వాటికి దోహదమిచ్చే వాళ్ళ పథకాల్లో ఎంతో ద్రోహబుద్ధిని రేకెత్తిస్తాయ్. వాటిని కార్యరూపంలో పెట్టిన విధానంలో క్రౌర్యాన్ని ప్రేరేపిస్తాయ్. అమెరికాలోగాని, యూరప్‌లోగాని, ఆఖరికి ఫ్రాన్సులోగాని ఇటువంటివి సాధ్యమేనా? అని ప్రతివ్యక్తికీ సందేహం కలిగిస్తాయ్. అభాగ్య జీవుల్ని అణగద్రొక్కడానికి పెట్టుబడిదారి

ముతా ఎంత దారుణానికైనా ఒడిగడ్తుందని, 1871 పారిస్ కమ్యూన్‌ను అణచివేయడానికి అమానుషంగా ప్రవర్తించిన జూన్ దినాల భీకరహత్యాకాండ, అక్షరాలా నిరూపించింది. ఈ దృశ్యమే నా స్మృతి పథంలో సాక్షాత్కారం చేయకపోతే నామటుకు నేనూ ఇటువంటి ఘాతుకచర్యలు జరుగుతై అని నమ్మేవాణ్ణికాదు. యూరప్‌లోగానీయండి, అమెరికాలోగానీ యండి, ప్రతిదేశంలోని కార్మికవర్గాన్ని అణగద్రొక్కడానికి ఉక్కుపాదం ఉవ్విళ్ళూరింది.

ఇటలీ, స్పెయిన్ దేశాల్లోమాదిరిగా ఫ్రాన్సులోనూ ప్రస్తుతానికి సోషలిజం ఉక్కుపాదాన్ని చూచి భయపడే అగత్యంకూడాలేని బలహీనస్థితిలో ఉంది. ఎందుకంటే, అత్యంత బలహీనులకు బలహీనత ఒక రక్షణ. అసలే నుగ్గు నుగ్గైపోయిన పార్టీని మరింతగా త్రొక్కివేయడానికి ఏ ఉక్కుపాదమూ అనవసరశ్రమ తీసుకోదు. సోషలిష్టుపార్టీ క్షీణతకు కారణం ఏమిటి? ఫ్రాన్సులో అల్పసంఖ్యాకంగా ఉన్న కార్మికవర్గాన్ని నేలమట్టం చేయడానికి ఆట్టేకాలం పట్టదు. మధ్యతరగతిలోని క్రింది వర్గాలవాళ్ళపై అతిదారుణంగా ప్రవర్తించి వాళ్ళనోళ్ళు నొక్కేసి, సర్వస్వాన్ని నిలువుదోపిడీచేసిన యుద్ధం అనేక కారణాలవల్ల, పెద్దపెద్ద పారిశ్రామిక సంస్థల్లో యుద్ధ పరికరాలైన మారణాయుధాల్ని ఉత్పత్తిజేస్తూ, యుద్ధం పూర్తయినా తనకు ఈనాడు వచ్చే కూలీలో పెద్దగా తగ్గిపోయేదేదీ లేకుండా జీవనోపాధిచేస్తున్న కార్మికులపట్ల మాత్రం అంత దారుణంగా ప్రవర్తించలేదు. నాటి ప్రభుత్వ హేమాహేమీలంతా ఆ పరిస్థితిని నిలబెట్టారు! ఉన్నతాధికారవర్గాలతో సన్నిహితత్వం

ఉన్న సంపన్న పారిశ్రామికాధినేతలు సునాయాసంగా సృష్టించ గల కాగితాల కట్టలేగా ఇంతకూ వేతనాలంటే. మరందుకే కార్మికుడు తనకు ఉన్నంతలో జీవయాత్ర సాగించాడు. దేనికీ కూడా ఆశ్చర్యచకితుడు కానంతగా అతడు లక్షోపలక్షలు అబద్ధాలు విన్నాడు. సోషలిస్టుపార్టీ సరిగ్గా ఈ సమయాన్నే విచ్ఛిన్నమై దుమ్ములో కలిసిపోవడం సాగించింది. సోషలిజానికిది ఘోర పరాజయం! మరణాలూ గాయాలూ లేకుండా సమకూడిన పరాజయమిది? ఇటువంటి దుస్థితి ఎట్లా ఏర్పడింది? బ్రహ్మాండమైన సోషలిస్టుపార్టీ శక్తి సామర్థ్యాలన్నీ నిద్రాణ దశలో ఎందుకున్నయ్? ఈ పరిస్థితుల్ని విశదీకరించడానికి నేనిచ్చిన కారణాలు సమర్థాలు కావు. దీనికంతా ప్రధానకారణం యుద్ధం.

కానీ ఏదో ఒకనాడు పెట్టుబడికీ – కార్మికవర్గానికీ పోరాటం పునః ప్రారంభమౌతుంది. జాక్ లండన్ భవిష్య ద్దర్శనంతో చిత్రించిన శాన్‌ఫ్రాన్సిస్కో, చికాగోల వర్ణనాతీతమైన భయంకర విప్లవదినాల్ని అప్పుడు మనం చూస్తాం. ఆ విప్లవం త్వరగా జరిగినా లేక ఆలస్యంగా జరిగినా ఆ సమయంలో, సోషలిజం ఉక్కుపాదంచే మట్టగించబడి, రక్తప్రవాహంలో ముంచివేయబడుతుందని నమ్మడానికి కారణంలేదు.

1907లో జాక్ లండన్ భయంకరమైన నిరాశావాదని గగ్గోలుపెట్టారు. నిష్కల్మషులైన సోషలిస్టులుసైతం పార్టీ వ్యక్తుల్లో భయాన్ని చొప్పిస్తున్నాడని అతణ్ణి నిందించారు. వాళ్లు పప్పులో కాలేశారు. అనన్యసాధారణమైన భవిష్యద్దర్శనా శక్తి సంపన్నులకు, దానివల్ల రాబోయే ప్రమాదాల్ని విశ

దీకరించడం విధ్యుక్తధర్మం. జారెస్ మహాశయుడు ఈ క్రింది విష యాల్ని అనేక పర్యాయాలు చెపుతుండగా విన్నట్లు గుర్తుంది.

"మనం ఎదిరించి పోరాడవలసిన వర్గాల శక్తి సామ ర్థ్యాల్ని తగినంతగా మనవాళ్లు గుర్తించలేదు. వాళ్లు బల వంతులు. వాళ్లు పరమ పవిత్రులుగా చెప్పబడుతున్నారు. వాళ్ళ మతాచార్యులు, ఫ్యాక్టరీ నైతిక సూత్రాలింగనంకోసం, చర్చి నైతికధర్మాలకు తిలోదకాలు ఇచ్చారు. వాళ్ళకు ప్రమాదం కలిగితే ఒక్క-మాటమీద సంఘం వాళ్ళను రక్షించ డానికి సిద్ధమౌతుంది." మన లోపాల్నీ, అజాగ్రత్తల్నీ ప్రతి బింబించే భవిష్యద్దర్పణాన్ని మనముందు ఉంచే విషయంలో జాక్ లండన్ ఎంత సక్రమంగా ప్రవర్తించాడో, ఆయనా అట్లాగే ప్రవర్తించాడు.

భవిష్యత్తుకు భంగం కలిగించుకోవద్దు! అది మనది. ధనికతత్వం నశిస్తుంది! దాని బలంలోనే దాని శిథిల చిహ్నాల్ని ఇప్పటికే మనం గమనిస్తున్నాం. మతా తత్త్వ ప్రభుత్వాలు నాశనంకాక తప్పవు కాబట్టి, ఇదీ నశిస్తుంది. ఇది అధర్మ యుతమైంది కనుకనే నశిస్తుంది. బానిస విధానమూ, రాచరిక దాస్యం నశించినట్లుగానే, గర్వంతో వళ్ళుబలిసి అధికార శిఖ రాగ్రాలనుంచి ఒక్క-సారి అధఃపతనం చెంది ఇదీ నశిస్తుంది. ఇప్పుడు సైతం దాన్ని జాగ్రత్తగా పరికించిన వ్యక్తికి దాని వార్ధక్య బలహీనత గోచరిస్తుంది. ప్రపంచంలోని దేశదేశాల వాణిజ్యవేత్తలంతా ఆకాంక్షించిన ఈ యుద్ధం-కేవల స్వప్ర యోజనార్థం ధనికతత్వం సృష్టించిన ఈ యుద్ధం,-ధనికతత్వం ఇంకా అత్యధిక సంపదకోసం అఱ్ఱులుచాచిన ఈ యుద్ధం-అంత

జాతీయ అల్పసంఖ్యాక నిరంకుశ ప్రభుత్వం కూకటి వేళ్ళతో సహా కూలిపోయేటట్లుగా విస్తృతమై అపరిమిత వినాశనాన్ని కలిగించింది. శిథిలమైన యూరపు ఖండంలో అది కుప్పకూలి పోయే దుర్దినం సమీపిస్తోంది.

ఏ విధమైన పోరాటం లేకుండా అల్పసంఖ్యాక ప్రభుత్వం అకస్మాత్తుగా నశిస్తుందని చెప్పలేను. అది పెనుగులాడుతుంది. దాని ఆఖరి యుద్ధం బహుశా దీర్ఘకాలం సాగవచ్చు. జయాపజయాలు పరస్పర అధీనాలు కావచ్చు. ఓ కార్మికవర్గ వారసులారా! ఓ భావియుగ ప్రజలారా! ఓ భవిష్యద్దిన సంతానమా! పోరాడండి! మీ ఆశయసాధనా విజయంలో మీకు సంశయాన్ని కలిగించే ప్రాతికూల్య పరిస్థితులు ప్రారంభమైనప్పుడు, మళ్ళీ గుండెధైర్యం తెచ్చుకొని ఉత్తముడైన ఎవర్‌హార్ట్‌తో మీ కంఠాలు మేళవించి ఇట్లా చెప్పండి!

"ఈసారి విఫలత్వమొందాం! కానీ ఈ అపజయం శాశ్వతం కాదు! మనం చాలా నేర్చుకొన్నాం. అనుభవపూర్వకమైన విజ్ఞానంతో క్రమశిక్షణతో మరెంత బలిష్టమై రేపు మళ్ళీ ఉద్యమం తలెత్తుతుంది."

అనటోల్ ఫ్రాన్స్.

# ౧

గ్రీష్మ మందానిలం ఎత్తుఅరణ్యాన్ని గిలిగింతలు పెడ్తోంది. మధుర స్వరంతో. సెలయేటినీరు పాచిపట్టిన రాళ్ళమీదగా జలజలా ప్రవహిస్తోంది. రంగురంగుల సీతాకోకచిలకలు వినీలాకాశవిహారం సాగిస్తున్నయ్. తేనెటీగల ఝుంకారం మందమందంగా ధ్వనిస్తోంది. ఈ ప్రశాంత వాతావరణంలో కూర్చున్న నాకేమీ పాలుపోవడంలేదు. నాలో అశాంతి దౌడు తీస్తోంది. ఊలుకూ పలుకూ లేని ఈ నిర్జీవ నిశ్చలవాతావరణమే నా ఆదుర్దాకు ముఖ్యకారణం. ఇదేదో అసహజంగా ఉన్నట్లు తోచిందినాకు. ప్రపంచమంతా నిశ్చలంగాఉంది. అయితే ఇది తుఫానుకు ముందుండే నిశ్చలతమాత్రమే. ముంచుకువచ్చే తుఫానుదాడికేదైనా విద్రోహం కలుగుతుందేమోనని నా పంచేంద్రియాలూ పహరాచేస్తున్నయ్. తగినశక్తి పుంజుకోకముందే ఆ తుఫాను రాకుండాఉంటే ఎంత బాగుంటుంది! సర్వసన్నాహంలేందే అది సాగిరాకుండాఉంటే!

నేను ఆందోళనపడ్తున్నానంటే అందులో ఏమీ ఆశ్చర్యంలేదు. నేను ఆలోచిస్తా; ఇంకా ఆలోచిస్తా; ఆలోచించకుండా అసలుండలేను. ఈ శాంతీ, నిశ్చలతా నన్నణచిపెట్టినంతకాలం నేను జీవితంతో పెనేసుకోని ఉంటా. రేపోమాపో బ్రద్దలుకాబోయే ఆ భయంకరమైన మృత్యువునూ, సర్వనాశనాన్నిగూర్చి చెప్పకుండాఉండలేను. అణగారిపోయిన అనాథ జీవుల ఆర్తారవాలు నాచెవుల్లో ధ్వనిస్తున్నయ్. ముక్కలుముక్కలుగా నరికివేయబడి నజ్జునజ్జైపోయిన సుందర సుకుమారదేహాలూ, దురహంకారుల శరీరాలనుంచి హింసాత్మకంగా బలవంతంగా బైటికీడ్చివేయబడి భగవంతుడికి

బలిగా నివేదింపబడ్డ జీర్ణాత్మలూ, పూర్వంమాదిరిగానే ఇప్పుడూ నాకళ్ళకు కట్టినట్లు కన్పిస్తున్నయ్. ఈ భూమ్మీద శాశ్వతశాంతి సౌఖ్యాలు సంపాదించడానికి నిర్భాగ్యులమైన మనం, రాత్రింబవళ్ళూ హత్యల్లో నాశనంతో సతమతమౌతూనే జీవితలక్ష్యాన్ని సాధించుకోగల్గుతాం.

ఇక ఇప్పుడు నేను ఒంటిరిదాన్ని. రాబోయేదాన్నిగూర్చి ఆలోచించని సమయంలో, నిన్న మొన్నటిదాకా ఉండి ఈనాడు కనుమరుగైపోయిన నా ప్రియవిహంగాన్నిగూర్చి ఆలోచిస్తా. ఆ విహంగం బలిష్టాలైన తన రెక్కల్తో జాజ్వల్యమానంగా ప్రకాశించే మానవస్వేచ్ఛా భాస్కరుని వైపు విసుగూ విరామంలేకుండా ప్రయాణంసాగించింది. ఈనాడాయన, తన కృషిఫలితమైన ఆ అద్భుతదశను ప్రత్యక్షంగా చూచుకోడానికి నోచుకోకపోయినా, నేనుమాత్రం దానికోసమని గోళ్ళుగిల్లుకుంటూ ఊరకే కూర్చోలేను. ఆయనవయస్సంతా దానికే ధారాదత్తంచేసాడు. దానికోసమే ఆయన తనజీవితాన్ని బలిదానంచేసాడు. ఆయన స్వయంకృషిఅది. ఆయనే దానికి నాయకుడు.

ఆ అద్భుత దశకోసమని తహతహతో ఎదురుచూచే ఈ సమయంలోనే నా ప్రియభర్తనుగూర్చి వ్రాస్తా. ఇప్పటికింకా బ్రతికున్న వాళ్ళందర్లోకీ ఆ వ్యక్తిగంభీరపాత్రకు సరైన స్వరూపాన్ని వ్యగలదాన్ని నే నొకతనే. అటువంటి మహోదాత్తమైన వ్యక్తిని సంపూర్ణంగా చిత్రించడం సాధ్యమైన విషయంగ దు. ఆయనది మహత్తరమైన హృదయం. నాలో అవ్యాజానురాగం పెంపొందినకొద్దీ, భవిష్యదభ్యుదయ అరుణారుణ భాస్కరబింబాన్ని చూచుకోడానికి నోచుకోలేకపోయాడే అనే నేను ముఖ్యంగా బాధపడ్డా. మన మా మహోజ్జ్వల ప్రభాతాన్ని తప్పకుండా చూస్తాం. ఆయన దృఢ విశ్వాసంతో ఆ నవోదయానికి గట్టిపునాదులు వేసాడు. కొద్దిరోజుల్లో,

ఆ ఉక్కుపాదం అనాధజీవుల ఆక్రోశమహాగ్నిజ్వాలల్లో హారతి కర్పూరం లాగా హరించుకుపోవాలి! ఉక్కుపాదం ఊడిపెట్టుకుపోయిందన్న శుభ వార్త తెలియగానే ప్రపంచ శ్రామికవర్గం ఒక్కసారి విజృంభిస్తుంది. ప్రపంచ చరిత్రలో ఇటువంటి మహత్తరమైన విషయం మరేదీలేదు. కార్మికశక్తి తప్పకుండా సుసంఘటితమౌతుంది. ఎన్నడూ కనివిని ఎరుగని బ్రహ్మాండమైన అంతర్జాతీయవిప్లవం వస్తుంది.

ముంచుకువస్తున్న ఆ తుఫానుతోనే నేను నిమగ్నురాలనై ఉన్నా. రాత్రింబవళ్లూ నేను దానితోనే ఇంతకాలం జీవించడంచేత అది నా మనస్సులో బాగా హత్తుకుపోయింది. ఆమాటకేవస్తే నేను దాన్నిగూర్చి ఆలోచించకుండా నా భర్తనుగూర్చి ఆలోచించలేను. దానికాయన జీవం. ఆ రెంటిలో దేనికది విడమర్చి ప్రత్యేకంగా ఆలోచించడం నా కెట్లా సాధ్యమౌతుంది?

ఇంతకుముందు చెప్పినట్లుగా ఆయనపాత్రకు సంబంధించిన విశేషాలు నేనొక్కదాన్నే చెప్పగలను. స్వేచ్ఛకోసం ఆయన చాలా కష్టనష్టాలకు గురై పోరాడాడన్నవిషయం అందరికీ తెలిసిందే. కానీ, ఆయన దాని కోసం ఎటువంటి భగీరథప్రయత్నంచేసాడో, ఎటువంటి దుర్భరబాధలనుభవించాడో నాకుమాత్రమే విపులంగా తెలుసు. ఎందుకంటే, తహతహతో కూడిన ఈఇరవైసం: వత్సరాలకాలం నేనూ ఆయనతోపాటు నీడగా వదిలిపెట్టకుండా సంచరించా. ఆయనలో ఎంతసహనశక్తివుందో నాకు తెలుసు. విసుగూ విరామంలేని ఆయనకృషి నేనెరుగుదును. రెణ్ణాళ్లక్రితమే తన జీవితాన్ని దీక్షతో ఏ మహత్తరసాధనంకోసం ఆహుతిచేశాడో దాన్ని నేను గుర్తించా.

ఎర్నెస్టు ఎవర్‌హార్డు, నా జీవితంలో ఎట్లాప్రవేశించాడో, ఆయన్ని మొదటిసారిగా యెట్లా కలుసుకున్నానో, ఆయనలో నేను భాగస్వామిని

అయ్యేదాకా ఆయన ఎట్లా అభివృద్ధి చెందాడో, ఆయన నాలో అద్భుత పరిణామాన్ని ఎట్లా తీసుకురాగల్గాడో మొదలైన విషయాలన్నీ సరళంగా వ్రాయడానికీ, చెప్పడానికీ ప్రయత్నిస్తా. వ్యక్తిగతంగా నాకూ ఆయనకూ సంబంధించిన కొన్ని రహస్యమధురానుభూతులు మినహా, ఈ విధంగా నాకళ్ళల్లోనుంచి మీరాయన్ని దర్శించి, ఆయన్ని నేను అర్థంచేసుకొన్నట్లు గానే మీరూ అర్థం చేసుకోండి.

1912 వ సంవత్సరం ఫిబ్రివరిలో 'బర్క్లీ'లోఉన్న మా ఇంట్లో ఓం ప్రథమంగా ఆయన్ని కలుసుకోవడం తటస్థించింది. ఆరోజు మానాన్న ఒక విందు ఏర్పాటుచేసి ఆహ్వానించిన అతిథుల్లో ఆయనా ఒకడు. మొదట్లో ఆయనమీద సదభిప్రాయం కలిగిందని చెప్పలేను. నేనూ మానాన్నా అతిథులరాకకోసమని తలుపావట్లో వేచిఉన్నప్పుడు ఆయనావచ్చాడు. ఆయన్ని చూట్టంతోటే హంసల్లోకి కొంగవచ్చిందేమిరా అనుకొన్నా. నిజానికి ఆరాత్రి మానాన్న ఏర్పాటుచేసినవిందు ప్రత్యేకంగా మతగురువులకు సంబంధించిం. తక్కిన మతగురువులమధ్యలో ఆయన అతకలేదు.

మొదటివిషయం ఆయనవేసుకొన్నదుస్తు లాయనకే సరిపడలేదు. చాలీచాలని నల్లని రెడీమేడ్‌సూటొకటి వేసుకొన్నాడు. నిజానికీ ఏ రెడీ మేడ్ దుస్తులూ ఆయనకు సరిపడవులెండి! ఆయన కండరాలమీదఉన్న గుడ్డ ఉబ్బెత్తుగా పైకి తోసుకువస్తోంది. ఎత్తైన ఆయన మూపురంమీది కోటు ముడతలుపడి డొంకచిక్కులుగాఉంది. ఆయనమెడ ఒక మల్లయుద్ధ ప్రవీణుని మెడలాగా చాలా బలిష్టంగా ఉంది. ఓహో! పూర్వం గుజ్జపు నాడాలుకొట్టుకొని బ్రతికిన ఈ సాంఘికతత్వవేత్తనా మా నాన్న వెతికి లంకించుకువచ్చింది అనుకొన్నా. ఆ ఉబ్బెత్తు కండరాల్తో, ఆ వృషభస్కంధంతో ఆయన నిజంగా అట్లాగే ఉన్నాడు. వెంటనే ఆయనొక అసా

ధారణవ్యక్తికిక్రింద జమకట్టా. శ్రామికవర్గంలో ఆయన, సంగీతంచేత మొత్తం ప్రపంచాన్ని ఉఱ్ఱూతలూగించిన నీగ్రో గాయకుడైన 'బ్లైండుటాంమ్' వంటి వాడని నిశ్చయించుకున్నా.

ఇక ఆయన నాతో కరస్పర్శచేసిన విధానానికివద్దాం. ఆయన చేతిలో నా చేయి ఉక్కిరిబిక్కిరై నలిగిపోయిందంటే నమ్మండి! ఆయన తన నల్లని కళ్ళతో నావేపు కొట్టవచ్చినట్లు చూచాడు. ఆ చూపుల్లో ఎంత నిబ్బరమున్నది! అనుకొన్నా. నేను వస్తుతా నాకుదగ్గ పరిసరాల్లో మాత్రమే సంచరించే స్వభావంకలదాన్ని. పైగా నా కప్పటికి నా ధనిక వర్గానికి సంబంధించిన డాబూ దర్పాలమీద బాగా మమకారం ఉండేది. నా వర్గానికి సంబంధించినవ్యక్తుల్లో అటువంటిదర్పం ఉంటే ఏమాత్రం క్షమార్హమైన విషయంగాదు. ఆయన చూపుల్లోనుంచి నా చూపులు తప్పించుకోకుండా ఉండలేకపోయా. ఇంతలోకే ఆయన్ను తప్పించుకోని బిషప్ మూర్‌హౌస్‌ను ఆహ్వానించడానికి నా దృష్టిమరల్చి, అప్పటికా గండాన్ని గడిచి ఎట్లాగో బైటపడ్డా. బిషప్ మూర్‌హౌస్ అంటే నాకు తగనిఅపేక్ష. మధ్యవయస్సువాడు. మంచి హృదయంగల వ్యక్తి. ఆషామాషీరకంగాదు. చాలా నిదానస్థుడు. అపర క్రీస్తుమాదిరిగా చాలా ప్రశాంతమైనమూర్తి. బాగా చదువుకున్నవాడు గూడా.

కానీ, అహంకారమని నేననుకొన్న ఎర్నెస్టు ఎవర్‌హార్డులోని ఈ ధైర్యమే, ఆయన నిజస్వరూపాన్ని వ్యక్తంచేసే ప్రధానకీలకం. డాబూ దర్పంలేని స్వభావం. తాను చెప్పదలచుకొన్నదేదో నిర్భయంగా కటాపెటీగా చేప్పేస్తాడు. అర్థంపర్థంలేని అనవసరమైన మర్యాదల్లో ఉక్కిరిబిక్కిరై వ్యర్థకాలక్షేపంచేసే మనిషికాదు. "నిన్ను చూస్తే నాకెంతో ఆనందంగాఉంది. నా కానందం గల్గించేదాన్ని నేనెందుకు నిరుత్సాహం

చేయకూడదు ?" అని ఆయన చాలసేపటికి నాతో అన్నాడు. మొగమాటం గిగమోటం లేకుండా అనదలచుకొన్న మాట మొగానే సూటిగా అనేవాడని ఇదివరకే చెప్పానుగదూ. సహజంగా ఆయన కులీనుడు (Aristocrat) ఐనప్పటికీ సామాన్యుడుగానే జీవిస్తున్నాడు. ఆయనలో ఏదో మానవాతీతమైన శక్తి ఒకటుంది. దానికితోడు ప్రజాతంత్రవాదంతో ఆయన హృదయం జాజ్వల్యంగా ప్రకాశిస్తోంది.

నా కాయనమీద ఏర్పడ్డ దురభిప్రాయానికితోడు, తక్కిన అతిథుల్ని కలుసుకొందామనే ఉత్సాహంలో, శ్రామికవర్గ తాత్త్వికుడైన ఆయన్ని పూర్తిగా మరచిపోయా. భోజనాలసమయంలో తక్కిన మతగురువులంతా ఒకరితర్వాత ఒకరుగా మాట్లాడుకుపోతూంటే, వాళ్ళ సంభాషణల్ని ఆలకిస్తూన్న ఆయన కళ్ళల్లోని మెరుపునుమాత్రం ఒకటి రెండుసార్లు కాబోలు చూసా. ఆయన్లో హాస్యంఉందని గ్రహించా. ఆయన ధరించిన దుస్తుల్ని గూర్చి ఏమీ పట్టించుకోలేదు. కాలం పరుగెత్తుకుపోతోంది. భోజనాలు కూడా పూర్తికావస్తున్నయ్. శ్రామికులూ—శ్రామికులకూ, చర్చికీ గల సంబంధాలు — చర్చి శ్రామికుల కింతకు మునుపేంచేసింది ?— ఇప్పుడేం చేస్తున్నదీ మొదలైన విషయాలమీద తక్కిన మతగురువులంతా అంతూ పొంతూ లేకుండా మాట్లాడుకుపోతూంటే, ఆయన ఒక్కసారైనా పెదవి విప్పిన పాపాన పోలేదు. ఇంతసేపూ ఒక్కమాటైనా మాట్లాడకుండా ఎర్నెస్టు మూగమొద్దులాగా కూర్చున్నందుకు మానాన్నలో బైలుదేరిన తహతహను నే గుర్తించా. కొంచెం అవకాశం చిక్కగానే మానాన్న ఎర్నెస్టునుకూడా ఏదన్నా మాట్లాడమని కోరాడు. ఆయన వెంటనే భుజాలెగరేసి, "ఆఁ నే చెప్పేదేముంది!" అంటూ మళ్ళీ తినడం ప్రారంభించాడు.

మా నాన్న అంతంతమాత్రానికి వదలిపెట్టేరకంగాదు. కొంచెం సేపైన తర్వాత, "ఇదుగో! వీరు ఎర్నెస్టు ఎవర్‌హార్డ్! శ్రామిక వర్గానికి చెందిన వ్యక్తి. ఇందాకటినుంచీ మీరు మాట్లాడుతున్న విషయాన్ని, వీరు కొత్త దృక్పథంలోంచి, చక్కగా హాయిగా మాట్లాడగలవారు." అన్నాడు.

వెంటనే తక్కినవాళ్ళల్లో ఆయన చెప్పేది వినాలనే కుతూహలం పర వళ్ళు తొక్కింది. ఆయన దృక్పథాన్ని వివరించమని పట్టు బట్టారు. నిజంగా ఆయనమీద వాళ్ళకు చెప్పరాని ఆసక్తి, అభిమానం కలిగాయ్. తనపై వాళ్ళకు కలిగిన అభిమానాన్ని గుర్తించిన ఎర్నెస్టు తనలో తాను పొంగిపోవడాన్ని నేను పసిబట్టా. మెల్లగా తన్ను తానొకసారి చూసు కొన్నాడు. ఆయన కళ్ళల్లో విరిసిన చిరునవ్వు వెన్నెల్ని దర్శించా.

"మతగురువులైన మీతో వాదించే సాంప్రదాయమేమిటో నాకు బొత్తిగా తెలియదు." అని ప్రారంభించి మాట్లాడ్దామా, వద్దా అనే సందిగ్ధంతో, వినయంగా కొంచెం తటపటాయించాడు.

"ఊఁ! చెప్పండీ!" అని వాళ్ళు వత్తిడి చేసారు.

"నిజం ఎవరిలో ఉన్నా మాకభ్యంతరంలేదు. ఆ నిజంమాత్రం నిష్కపటంగా ఉండాలి" అని డా॥ హామర్‌ఫీల్డు ఒక చిన్న సవరణతో సహా మాట్లాడాడు.

"ఐతే, నిజంవేరూ నిష్కపటంవేరూ అంటారన్నమాట మీరు." అని ఎర్నెస్టు పక్కున నవ్వాడు.

డా॥ హామర్‌ఫీల్డు గుక్కతిప్పుకోని "మేమంతా పొరపాటు పడుండవచ్చులే! అబ్బాయ్! మేమంతా..." అని సమాధానం చెప్పా డోల్లాగో.

వెంటనే ఎర్నెస్టు రీతిలో మార్పువచ్చింది. ఆయన తమాం మారి పోయాడు.

“ అట్లాయితే మంచిది. మీరంతా పప్పులో కాలేసారంటూనే నా సంభాషణ ప్రారంభిస్తా. అనుమతించండి. మీకు శ్రామిక వర్గాన్ని గురించి ముక్కా మొగంకూడా తెలియదు. మీ ఆలోచనావిధానం ఎంత ప్రమాదకర మైందో, ఎంత వ్యర్థమైందో, మీ సాంఘిక శాస్త్రంకూడా అంత ప్రమాద భూయిష్టమైంది. అది ఎందుకూ పనికిరాని వట్టి చెత్త. ” అన్నాడాయన.

ఆయన చెప్పిన విషయానికన్నా, చెప్పిన విధానం గమనార్హమైంది. ఆయన కంఠధ్వనికి ఉత్తేజితురాలినైపోయా. ఆయన నేత్రాలమాదిరిగానే ఆయన వాక్కూ గంభీరమైంది. మేఘగర్జనలాగావున్న ఆయన కంఠ స్వరానికి ఉలిక్కిపడ్డా. అప్పటిదాకా మన్నుదిన్న పాముల్లాగా మత్తుగా వున్నవాళ్ళు వీపుచరిచినట్లైంది. ఒక్కసారిగా వాళ్ళందరూ నిద్రమైకం నుంచి తెప్పరిల్లి, ఉత్తేజితులయ్యారు.

“ మా ఆలోచనా విధానంలోఉన్న ఆ భయంకరమైన ప్రమాదం, ఆచెత్తా ఏమిటో చెప్పవయ్యా ” అని డా॥ హామర్‌ఫీల్డు నిలవేసి అడిగాడు. ఆయన స్వరంలో, మాట్లాడే విధానంలో అప్పుడే కొంచెం కోపం తొంగి చూచింది.

“ మీరు ఆధ్యాత్మికవాదులు. ఆధ్యాత్మికంగా మీరు దేన్నైనా సరే నిరూపిస్తారు. అట్లాచేసి మళ్లీ ప్రతి ఆధ్యాత్మికవాదీ, మరో ప్రతి ఆధ్యాత్మికవాదినీ ‘ నీదితప్పు ’ అని ఆత్మసంతృప్తికోసం నిరూపిస్తాడు. ఆలోచనా ప్రపంచంలో మీరంతా అరాచకవాదులు. ఈ ప్రపంచాన్ని పిచ్చిదాన్నిగా చేసింది మీరు. మీలో ప్రతివాడూ మీమీ ఇష్టాయిష్టాల్ని

బట్టి సృష్టించుకొన్న జగత్తులో విహరిస్తుంటారు. మీరు నివసిస్తూన్న ఈ యధార్థ జగత్తునుగూర్చి మీకు పిసరంతగూడా తెలియదు. ఇది కేవలం భ్రాంతిమూలకం అన్నది తప్ప మీకీ యధార్థప్రపంచాన్నిగూర్చి మరో ఆలోచనా పాలోచనా లేదు. ఇందాకటినుంచీ మీరు మాట్లాడ్తూండే తరహా చూస్తే నాకేం జ్ఞాపకంవచ్చిందో తెలుసా? తమ పాండిత్యాన్నంతా ఒలకబోస్తూ, 'ఒక్క సూదిమొనమీద ఎంతమంది దేవదూతలు నాట్యం చేయగల్గుతారు?' అన్న ఊకదంపుడువిషయంమీద కుస్తీపట్లు పట్టుకొన్న మధ్యయుగాల్లోని పండితమ్మన్యులు చట్టున గుర్తుకువచ్చారంటే నమ్మండి. అందాకా ఎందుకండీ! మంత్రాలద్వారా రోగాల్ని నయంచేయడానికి ప్రయత్నిస్తూ, మహారణ్యాల్లో పదివేల సంవత్సరాలకు పూర్వం జీవించిన భారతీయ వైద్యుడు, ఈ ఇరవయ్యో శతాబ్దపు వైజ్ఞానికయుగానికి ఎంతదూరంలో ఉన్నాడో, మీరూ అంతదూరంలోనే ఉన్నారు.'' అన్నాడు ఎర్నెస్టు.

ఎర్నెస్టు మాట్లాడుతూన్నంతసేపూ బలే హుషార్‌తో ఉన్నాడు. ఆయనమొగంమీద క్రొత్త తేజస్సొకటి తాండవించింది. ఆయన కళ్ళల్లో మెరుపు తీగెలు మిలమిల్లాడిపోయినై. ఆయన వాద వాగ్ధాటి గంగాప్రవాహంలాగా సాగిపోతోంది. ఆయన తత్వమే అది. ఆయన మాట్లాడుతూంటే అందరూ ఉత్తేజితులౌతారు. సమ్మెటపెట్టుమాదిరిగా, ఆయన తన ప్రచండవాదనాపాటవంతో ఎదుటివాళ్ళను చండచండంగా చెండాడుతూంటే, వాళ్లు తమనుతామే మరచిపోయి నోళ్లుతెరుచుకొని, గ్రుడ్లుమిటకరించి కూర్చుంటారు. ఇప్పుడూ వీళ్లు తామున్నామన్న సంగతికూడా మరచిపోయి ప్రతిమల్లాగా కూర్చున్నారు. బిషప్ మూర్‌హౌస్ కొంచెం ముందుకువంగి చాలా జాగ్రత్తగా వింటున్నాడు. డా॥ హామర్‌ఫీల్డు మొగంలో అసహనత్వం, కోపం ముంచుకొస్తున్నయ్. తక్కినవాళ్లు కూడా అసహనత్వంతో అట్టట్లైపోతున్నారు. ఇంకా కొందరు ఏమిటిలే అన్న నిరసనతో

తమాషాగా చిరునవ్వులు నవ్వుతున్నారు. నామటుకు నా కా గోష్ఠి బ్రహ్మానందంగా ఉంది. మా నాన్న వేపొకసారి చూచా. మా మధ్యలో ఈ పిట్టపిడుగును పడేసిన నేరానికి కావాలి ఏమో పాలుపోక ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు.

"నీ ధోరణి మా కగమ్యగోచరంగా ఉంది. మమ్మల్ని నీవు ఆధ్యాత్మిక వాదులని పిలవడంలో గల అంతర్యాన్ని కాస్త వివరించి చెప్పవూ?" అని డా॥ హోమర్ ఫీల్డు, మాట్లాడుతున్న ఎర్నెస్టుకు అడ్డు తగిలాడు.

ఇక ఎర్నెస్టు ప్రారంభించాడు. "మీరు ఆధ్యాత్మిక దృష్టితోనే ఆలోచిస్తారు కాబట్టి మీరు ఆధ్యాత్మిక వాదులు అన్నా. శాస్త్రీయ హేతువాద దృష్టికి మీ వాదం శుద్ధ వ్యతిరేకం. మీ సిద్ధాంత నిర్ణయాలకు బలంలేదు. మీరు ఉన్నదాన్ని హుళక్కనీ, హుళక్కిని ఉన్నదనీ నిరూపించగల మహానుభావులు. మీలో ఏ ఇద్దరూ ఏ విషయంమీద ఏకాభిప్రాయానికి రాలేరు. మీ వ్యక్తిత్వాన్నీ, ప్రపంచాన్నీ విపులీకరించడానికి మీరు మీ మీ బుద్ధిని ఆశ్రయిస్తారు. చైతన్యాన్ని చైతన్యంతో విశదీకరించడమంటే, ఎవళ్ల కాళ్ళు వాళ్ళబుజాలమీద మోసుకోని తిరగడం వంటిది.

"నాకు మీరు చెప్పేది అర్థంకావడంలేదు. మనస్సంబంధమైన ప్రతిదీ ఆధ్యాత్మికమే అనుకొంటా. అన్ని శాస్త్రాల్లోకి సరైందీ, సంపూర్ణ ఆమోదాన్ని పొందిందీ ఐన గణితశాస్త్రం కేవలం ఆధ్యాత్మికమైందే. శాస్త్రీయంగా ఆలోచించేవాడి ప్రతి ఆలోచనా విధానంకూడా ఆధ్యాత్మికమే. మీరు నాతో తప్పకుండా ఏకీభవిస్తారనుకుంటా?" అన్నాడు బిషప్ మూర్‌హౌస్.

"మీరన్నట్లుగానే మీ కర్థంకాలేదు. ఆధ్యాత్మికవాది తన ఊహల్ననుసరించి తర్కించడం ప్రారంభిస్తాడు. శాస్త్రజ్ఞుడు అనుభవ సత్యాలద్వారా విషయాన్ని నిర్ణయిస్తాడు. ఆధ్యాత్మికవాది సిద్ధాంతాలద్వారా సత్యాన్ని ఊహిస్తాడు. శాస్త్రజ్ఞుడు సత్యాలద్వారా సిద్ధాంతీకరిస్తాడు. ఆధ్యాత్మికవాది తన్ననుసరించి జగత్తును వ్యాఖ్యానిస్తాడు. శాస్త్రజ్ఞుడో జగత్తునుపట్టి తన స్థానాన్ని విశదీకరిస్తాడు." అని ఎర్నెస్టు సమాధానం చెప్పాడు.

"అదృష్టవశాత్తూ మేం శాస్త్రజ్ఞులంకాము" అని డా॥ హామర్‌ఫీల్డు నసిగాడు.

"ఐతే మీరెవరు?" అని ఎర్నెస్టు ప్రశ్నించాడు.

"తాత్త్వికులం."

"అట్లాపోండి మరి" అని ఎర్నెస్టు నవ్వి, "ఒక్కమాటలో ఈ కనపడే యథార్థజగత్తును వదిలిపెట్టి, తుదిలేని గాలిలోకి ఎగిరిపోయారు. దయయుంచి తమరుకాస్త భూమిమీదకువచ్చి, తాత్త్విక శాస్త్రమంటే ఏమిటో స్పష్టంచేయండిబాబూ!" అన్నాడు.

"తాత్త్విక శాస్త్రమంటే" అని ప్రారంభించి కొంచెంసేపాగి పట్టుకుపోయిన గొంతు సవరించుకొని, "తాత్త్విక దృష్ట్యా ఆలోచించేవాళ్ళకూ, తత్త్వహృదయంకలవాళ్ళకూ మినహా ఇతరులెవరికీ అర్థమయ్యేటట్లుగా నిర్వచించలేని దురవగాహమైన ఒకానొక విషయం. శోధన నాళికల్లో రాత్రింబవళ్లూ సతమతమయ్యే శుష్కహృదయంగల శాస్త్రజ్ఞుల సంకుచితబుద్ధికి తత్త్వశాస్త్రం అంతుచిక్కదు." అని డా॥ హామర్‌ఫీల్డు ఒక్క విసురు విసిరాడు. ఎర్నెస్టు, డా॥ హామర్‌ఫీల్డు దెబ్బను కొంచెంగూడా ఖాతరు చేయలేదు. ప్రతికక్షి చెప్పిన విషయాన్నే మళ్ళీ ఆయనమీదనే తిప్పించి

కొట్టడం ఎర్నెస్టు ఎప్పుడూచేసేపని. మృదువుగా, స్నేహపూర్వకంగా ఆయన ఇప్పుడుచేసిందీ అదే.

"ఐతే తత్త్వశాస్త్రానికి నేనిప్పుడిచ్చే నిర్వచనం మీకు నిస్సందేహంగా అర్థమౌతుంది. కానీ నేను దాన్ని నిర్వచించబోయేముందు మీకొక సవాలు చేస్తున్నా. నేనిచ్చే నిర్వచనంలో తప్పుంటే ఏది చూపించండి. చూపించ లేకపోతే, కన్నంలో తేలుగుట్టిన దొంగలాగా కిక్కురుమనకుండా ఆధ్యాత్మికవాదిగానే ఉండిపోండి! అన్ని శాస్త్రాలకంటే విపులమైంది తత్త్వశాస్త్రం. ఏఒక్క ప్రత్యేకశాస్త్రంగానీ అన్ని ప్రత్యేకశాస్త్రాలుగానీ ఏ మార్గంలో ఆలోచిస్తయ్యో, అదీ ఆమార్గంలోనే ఆలోచిస్తుంది. ఆ ఆలోచనా విధానంవల్లనే తత్త్వశాస్త్రం, ప్రత్యేకశాస్త్రాలన్నింటినీ ఒక పెద్ద శాస్త్రంగా సమీకరిస్తుంది. స్పెన్సర్ చెప్పినట్లుగా, ప్రతి ప్రత్యేకశాస్త్రం లోని విషయం కేవలం పాక్షికమైన విజ్ఞానాన్ని మాత్రమే ప్రసాదిస్తుంది. తత్త్వశాస్త్రం, శాస్త్రాలకూడా శాస్త్రం. మీకిష్టముంటే దాన్ని రాజాశాస్త్రమనికూడా అనండి. నేనిచ్చిన నిర్వచనం బాగుందా?" అన్నాడు ఎర్నెస్టు.

"మహా శ్లాఘనీయంగాఉంది! ఓ! మహా శ్లాఘనీయంగాఉంది!" అని డా॥ హామర్‌ఫీల్డు గొణిగాడు.

కానీ ఎర్నెస్టు వాళ్ళ నంతటితో వదలిపెట్టలేదు.

"బాగా జ్ఞాపక ముంచుకోండి! ఆధ్యాత్మిక వాదానికి నేనిప్పుడిచ్చిన నిర్వచనం పెద్ద గొడ్డలిపెట్టు! ఈ నా నిర్వచనంలో మీరు లోపం చూపించ లేకపోతే, ఇకమీదట మీరు ఆధ్యాత్మిక వాదాన్ని కొనసాగించడానికి అనర్హులౌతారు. నా నిర్వచనంలో లోపం కనుక్కొనేందుకు యథార్థ జీవితాన్ని ఆశ్రయించండి. దాన్ని తెలుసుకొనేవరకూ దుక్కిన పేనులాగా

ఆధ్యాత్మిక వాదిగానే ఉండిపోండి! '' అని ఎర్నెస్టు వాళ్ళకొక హెచ్చరిక చేసి, ఏదైనా సమాధానం వస్తుందేమోనని కొంచెసేపు నిదానించి చూసాడు. ఆ మౌనం చాలా బాధాకరంగా ఉంది. డా॥ హామర్‌ఫీల్డు బాధపడ్డాడు. ఉక్కిరి బిక్కిరైపోయాడు. సుత్తెపెట్టులాంటి ఎర్నెస్టు తాకిడికి ఆయన హృదయం బదాబదలైపోయింది. ఏవిధమైన హడావుడీలేని సరళమైన కచ్చితమైన వాదోప వాదాల కాయన అలవాటు పడలేదు. నీవా, నీవా అన్నట్లు బల్లదగ్గర ఉన్నవాళ్ళందరి వేపొకసారి యాచనా పూర్వకంగా చూసాడు. కానీ ఒక్కళ్లూ ఆయన తరఫు మాట్లాడలేదు. మా నాన్న తువాలడ్డు పెట్టుకోని నవ్వుతున్నాడు.

డా॥ హామర్‌ఫీల్డును పూర్తిగా చిత్తుచేసిన ఎర్నెస్టు మళ్ళీ ఉపక్రమించాడు. ''మరోరకంగా గూడా ఆధ్యాత్మిక వాదుల్ని అనర్హులని రుజువుచేయవచ్చు. వాళ్లచేతల్నిబట్టి వాళ్ళ స్థానాన్ని నిర్ణయించండి! నిరాధారాలైన పిచ్చిపిచ్చి ఊహాలల్లడం, తమ నీడల్నే దేవుళ్లగా భ్రమపడడం తప్పించి వాళ్ళు మానవ జాతికి చేసిన మహోపకారమేమిటి? వాళ్ళు మానవుడికి ఉల్లాసాన్ని కొంచె మభివృద్ధి చేసారని అంగీకరిద్దాం. కానీ వాళ్లు మానవజాతికి చెప్పుకోదగ్గ మంచి ఏంచేసారో చెప్పండి? శాస్త్రజ్ఞులు హృదయాన్ని, రక్త ప్రసరణ విధానస్థానమని నిర్ధారిస్తుంటే, వాళ్ళు దాన్ని ఉద్రేకాలకు ఉనికిపట్టు అని వేదాంతభాష్యం (వేదాంతమన్న మాటను దురర్థంలో వాడుతున్నందుకు క్షమించండి) చేస్తున్నారు. శాస్త్రజ్ఞులు ధాన్యపు కొట్లనూ, ఘురికి నీరు గూడా నిలవటానికి వీల్లేని ఆరోగ్యకరమైన మహాపట్టణాల్నీ నిర్మిస్తూంటే, వాళ్ళు కరువు కాటకాలూ, మహామ్మారీ భూభారాన్ని తగ్గించడానికి భగవంతుడను గ్రహించే వరప్రసాదాలని విపరీతార్థాలు చేస్తున్నారు. శాస్త్రజ్ఞులు పెద్ద పెద్ద భవనాలూ, రహదార్లూ, వంతెన్లూ నిర్మిస్తుంటే, వాళ్ళు వాళ్ళ యిష్టానుసారం. యిష్టమైన రూపాల్లో దేవుళ్ళను సృష్టిస్తున్నారు

శాస్త్రజ్ఞులు నూతన ప్రపంచాల్నీ, నక్షత్రాల పుట్టుపూర్వోత్తరాల్నీ గూర్చి విశేష పరిశోధల్ను చేస్తుంటే, వాళ్ళు భూలోకమే ప్రపంచ కేంద్రస్థానమని వితండవాదన చేస్తున్నారు. కొద్దిలో చెప్పాలంటే ఆధ్యాత్మికవాదులు మానవజాతికి నలుసుమాత్రం కూడా మంచిగానీ, ఉపకారంగానీ చేయలేదు. శాస్త్రీయ దృక్పథం పురోగమిస్తున్నకొద్దీ వాళ్లొక్కొక్క అడుగే వెనక్కి తగ్గుతున్నారు. ఆధ్యాత్మిక వాదుల ఊహాకల్పితాలైన భావాల్ని, శాస్త్రీయ రీత్యా రుజువు చేయబడ్డ సత్యా లెంతవేగంగా పటాపంచలు చేస్తున్నయ్యో, మళ్లీ వాళ్లంత వేగంగా కొత్త ఊహల్ని అల్లుకుపోతున్నారు. నిన్న మొన్న నగ్నసత్యాలని నిరూపించిన విషయాలకు కూడా వాళ్లు తప్పుడు వ్యాఖ్యానాలు సాగించారు. వాళ్లీవిధంగానే యుగాంతం వరకూ వక్రభాష్యాలు చేస్తూంటూ రనడంలో నాకేమాత్రం సందేహంలేదు. మహాశయులారా ! ఆధ్యాత్మికవాది, మంత్రాల్తో చింతకాయలు రాలుద్దామనుకొనేరకంవాడు. చర్మధారియై, తిమి తిమింగలాల మాంసాన్ని తినే దేవుణ్ణి సృష్టించుకొన్న ఎస్కిమోలకూ మీకూ ఉన్న భేదమల్లా కొన్నివేల సంవత్సరాల పరిశోధనా ఫలితాలైన సత్యాల తేడా మాత్రమే. ఇదీవిషయం.”

“కానీ, అరిస్టాటిల్ సిద్ధాంతం యూరపుఖండంలో దాదాపుగా 12 శతాబ్దాలకు పైగా రాజ్యంచేసిందే ? అరిస్టాటిల్ ఆధ్యాత్మిక వాదే కదా !” అని డా॥ బాలింగ్ ఫోర్డు సగర్వంగా పల్కి, తన చుట్టు పక్కలఉన్న వాళ్లవొకసారి బడాయిగా చూసాడు. అందరూ, ‘బలే! బలే దెబ్బతీసావులే’ అన్నట్లుగా చిరునవ్వుల్తో తలలూపారు.

“మీ ఉదాహరణ చాలా దురదృష్టకరమైంది. మానవ చరిత్రలో అంధకారదశను మీరు ప్రస్తావించారు. నిజానికి మే మాదశను ‘అంధకార యుగం’ అని పిలుస్తాం. ఆకాలంలో ఆధ్యాత్మికవాదులు విజ్ఞాన శాస్త్రాన్ని

భ్రిష్టుపట్టించారు. స్పర్శవేదికోసమని భౌతిక శాస్త్రాన్ని దుర్వ్యయం చేసిన యుగమది. రసాయన శాస్త్రం రసవాద శాస్త్రంగా మారిన కాలమది. ఖగోళశాస్త్రాన్ని జ్యోతిశ్శాస్త్రంగా రూపొందించిన రోజులవి. అరిస్టాటిల్ భావ ప్రభావానికి చాలా విచారిస్తున్నా!'' అని ఎర్నెస్టు సమాధాన మిచ్చాడు.

డా॥ బాలింగ్‌ఫోర్డు బాధపడ్డట్లు కనిపించాడు. కొంతసేపటికి తెప్పరిల్లి, “నీవు చిత్రించిన ఆ భయంకరదృశ్యాన్ని ప్రస్తుతానికి సరే అనుకొందాం. కానీ, ఆధ్యాత్మికవాదం ఆ అంధకారయుగంలోనుంచి అభ్యుద్ధరించి మానవ జాతిని వెలుగులోకి తీసుకురావడంలో సర్వ సమర్థమైందన్న విషయాన్ని నీవు తప్పకుండా ఒప్పుకోవాలి'' అన్నాడు.

“మానవజాతి వెలుగులోకి రావడానికీ, ఆధ్యాత్మిక వాదానికీ గోకులాష్టమికీ, పీర్లపండక్కీ ఉన్న సంబంధంవంటిది'' అని ఎర్నెస్టు తలతిరిగే సమాధానంచెప్పాడు.

“ఏమిటీ! నూత్న పరిశోధల్నికి సముద్రప్రయాణాలు చేయించింది ఆధ్యాత్మిక చింతనకాదా?'' అని డా॥ హామర్‌ఫీల్డు హుంకరించాడు.

ఎర్నెస్టు ఒక చిరునవ్వుతో, “అయ్యో! మీరనర్హులై పోయారనుకొన్నానే! నా తత్త్వశాస్త్ర నిర్వచనంలో మీ రింతవరకూ తప్పెత్తి చూపించలేదు. మీరిప్పుడు నేలవిడిచి సాముచేస్తున్నారు. ఆధ్యాత్మికవాదుల తరహా అటువంటిదికాబట్టి నేను క్షమిస్తున్నానులే. మళ్ళీ ఇంకోసారి చెప్తున్నా వినండి! ఆధ్యాత్మికవా[illegible] ప్రయాణాలకీ ఏమాత్రం సంబంధంలేదు. తిండీ తిప్పలూ, వస్త్రందస్త్రం, డబ్బూ దస్కంమీద ఉన్న అపేక్ష నూత్న సముద్రప్రయాణాలకు ముఖ్య కారణం. దానికితోడు కాకతాళీయంగా ఇండియాకు పోయే వర్తక మార్గాలుకూడా బందుచేయబడటంతో, గత్యంతరంలేక సముద్రమార్గం కను

కోల్పోవలసి వచ్చింది. 1453 లో కాన్‌స్టాంటినోపుల్ పడిపోవడంతో టర్కీ దేశస్థులు ఇండియాకుపోయే ఎడారిమార్గాన్ని ఆకట్టేసారు. దాంతో ఐరోపా వర్తకులం మరోమార్గాన్ని కనిపెట్టాల్సిన అవసరం ఏర్పడింది. ఇదీ సముద్రప్రయాణ పరిశోధల్నకు అసలైన కారణం. కొలంబస్ ఇండియా దీవులకు కొత్తమార్గం కనిపెట్టడానికని సముద్రప్రయాణం సాగించాడు. అన్ని చరిత్ర గ్రంథాల్లోనూ చెప్పిన విషయమిదే. కాక తాళీయంగా, భూమియొక్క స్థితిగతులూ, దాని పరిమాణం మొదలైనవాటినిగూర్చి కొన్ని సత్యాలు బైటపడినై.” అన్నాడు.

డా॥ హామర్‌ఫీల్డు బుసవిడిచాడు.

“నాతో మీ రేకీభవించరు? అయితే నేనెక్కడ తప్పుపోయానో చెప్పండి?” అని ఎర్నెస్టు ప్రశ్నించాడు.

“అబ్బాయ్! నివు వెయ్యిచెప్పు! లక్షచెప్పు! నామతమే నాది. ఇప్పుడా విషయంలోకి దిగాలంటే తొందర్లో తెమిలే పనేంగాదు. చెప్పాల్సినకథ చేటభారతమంత ఉంది,” అని డా॥ హామర్‌ఫీల్డు కొంచెం ఘాటుగా సమాధానం చెప్పాడు.

“శాస్త్రజ్ఞుడికి ఏకథా చేటభారతంకాదు. అందుకనే అతడు క్రొత్త క్రొత్త ప్రదేశాలకు వెళ్లుతున్నాడు. అమెరికాకు వచ్చిందీ అందుకనే” ఎర్నెస్టు చాలా మృదుమధురంగా మాట్లాడాడు. ఎర్నెస్టు ఎవర్‌హార్డును [illegible] కొద్ది గంటల కాలంలో ప్రతిక్షణం, ప్రత్యంశం గుర్తుకుతెచ్చుకోవడం నాకు మహదానందమైనా, ఆసాయంకాలం జరిగిన సంగతంతా వర్ణించలేను.

వాదం చిలికి చిలికి గాలివానైంది. ఎర్నెస్టు మరీ వాళ్లని తమాషా తాత్త్వికులనీ, శుష్కప్రియాలు శూన్యహస్తాల వాళ్ళనీ, ఇంకా అటువంటి

వాళ్ళనీ ఇటువంటివాళ్ళనీ ఏవేవో పేర్లుపెట్టి పిలిచేటప్పటికి వాళ్ళకు అరికాలి మంట నెత్తికెక్కిపోయింది. కోపంతో వాళ్ళమొగాలన్నీ కందగడ్డలై పోయినై. మాటిమాటికీ నగ్నసత్యాల్తో వాళ్ళ నోళ్లు మూయించాడు. “సత్యం—మానవుడు అభేద్యమైన నగ్నసత్యం!” అని ఎర్నెస్టు, వాళ్ళల్లో ఏ ఒక్కడు నోరుమెదిపినా, విజయంగా సవాలు చేశాడు. సత్యాల్తో వాళ్ళను ఉక్కిరిబిక్కిరిచేసాడు. యధార్థాల్తో వాళ్ళకు ముచ్చెమటలు పోసేటట్టుచేసాడు. నిజాలతో వాళ్ళను గుక్కతిప్పుకోకుండా చేసాడు. నగ్నసత్య నిరూపణతో వాళ్ళపుటమార్చి వదలిపెట్టాడు.

“నీవు యథార్థాన్నే భక్తిశ్రద్ధల్తో సేవించేటట్లున్నావే?” అని డా॥ హామర్ ఫీల్డు అధిక్షేపించాడు.

“సత్యంతప్ప వేరే భగవంతుడే లేడు. ఎవర్హార్డు దాని ప్రవక్త” అని డా॥ బాలింగు ఫోర్డు వ్యాఖ్యానించాడు.

ఎర్నెస్టు నవ్వుతూ వాళ్ళ మాటల్ని అంగీకరించాడు.

“నేను టెక్సాస్‌నుంచి వచ్చిన వ్యక్తివంటివాణ్ణి” అన్నాడు. అదేమిటంటే ఇట్లా వివరించాడు. “మిస్సోరినుంచి వచ్చిన మనిషి ఎప్పుడూ నీవు నాకు చూపించాలి అంటాడు. కానీ టెక్సాస్‌నుంచి వచ్చినమనిషి నీవు దాన్ని నా చేతిలోపెట్టాలనంటాడు. దీన్నిబట్టి అతడు ఆధ్యాత్మికవాది కాదని స్పష్టమౌతుంది.”

ఆధ్యాత్మిక తాత్త్వికులు నిజానికెప్పుడూ నిలబడరు అని ఒకసారి ఎర్నెస్టు అంటే, “సత్యానికి పరీక్ష ఏమిటబ్బాయ్? నీకంటే తెలివిగల బుర్రల్నే ఎంతోకాలంనుంచి తికమకపెడుతున్న దాన్ని దయతో కొంచెం వివరించి చెప్తావా ?” అని డా॥ హామర్ ఫీల్డు వెంటనే ఒక దెబ్బతీసాడు.

“తప్పకుండా” అని ఎర్నెస్టు సమాధానం చెప్పాడు. ఆయన హామీకి వాళ్లు రెచ్చిపోయారు. “సత్యంకోసం, తెలివిగల బుర్ర

లంతగా తికమక పడటానికి కారణం, దాంతోపాటు వాళ్ళు ఆకాశం లోకి ఎగిరిపోయారు. వాళ్లు భూమిమీదనే నిలబడి ఉన్నట్లయితే దాన్ని సులభంగానే తెలుసుకోగల్గేవారు. అంతేకాదు, తమ జీవితంలోని ఆచరణ యోగ్యమైన ప్రతిక్రియచేతా, ఆలోచనచేతా వాళ్లకువాళ్ళే సత్యాన్ని స్పష్టంగా పరీక్షిస్తున్నామని కూడా గ్రహించి ఉండేవాళ్లు” అన్నాడు.

“ఆ పరీక్ష, ఆ పరీక్ష” అని డా॥ హోమర్‌ఫీల్డు తమాయించుకోలేక ఒకటి రెండుసార్లు ఉచ్చరించాడు: “ఉపోద్ఘాతాల్తో నిమిత్తంలేదు. ఇంత కాలంనుంచి మేం వెతుకుతున్న ఆ సత్యపరీక్ష ఏదో చెప్పు. ఆ పరీక్షను మాకు తెలియజెప్పు. మా జన్మలు తరిస్తయ్.”

ఆయన మాటల్లో అవినయం, అవిశ్వాసం, అవహేళనా దాక్కొన్నయ్. ఆయన విధానంగూడా పూర్తిగా అట్లాగే ఉంది. అక్కడ కూర్చున్నవాళ్లల్లో చాలమంది రహస్యంగా లోలోపల సంతోషించుకున్నారు. బిషప్ మూర్‌హౌస్‌కు మాత్రం అది కొంత బాధకలిగించింది.

“డా॥ జోర్డన్ దాన్ని చాలస్పష్టంగా చెప్పాడు. ఆయన సత్య పరీక్ష ఏమిటంటే, అది ఆచరణయోగ్యమేనా? నీ వా పరీక్షకు నీ జీవితాన్ని హామీ ఇస్తావా?” అని ఎర్నెస్టుచెప్పాడు.

“ఉహ్! నీవు బిషప్ బర్క్లీ విషయమే తీసుకోలేదు. ఆయన కింత వరకూ సమాధానంచెప్పిన మొనగాళ్ళేలేరు?” అని డా॥ హోమర్‌ఫీల్డు పరిహాస పూర్వకంగా మాట్లాడాడు.

“తక్కినవాళ్లకన్నా ఉదాత్తమైన ఆధ్యాత్మికవాది అతడు” అని ఎర్నెస్టు పెద్దగానవ్వి, “కానీ మీ రిచ్చిన ఉదాహరణ చాలా దురదృష్ట కరమైంది. ఎందుకంటే, బర్క్లీ తనంతటతానే తన ఆధ్యాత్మికవాదం నిష్ప్రయోజనమైందని చాటిచెప్పాడు.” అన్నాడు.

ఉత్కృష్టపాదం.

డా॥ హోమర్‌ఫీల్డు తోకతొక్కిన త్రాచై బుస్సలు కొట్టాడు. పచ్చి అబద్ధం ఆడుతూంటేనో, దొంగతనం చేస్తుంటేనో ఎర్నెస్టును పట్టుకొన్నట్లుగా వుందతనికి.

"ఏమయ్యో! ఇవ్వాళ రాత్రి నీవు చెప్పిందంతా ఎట్లా తగలబడ్డదో, ఇదీ అంత లక్షణంగానే ఏడ్చింది. నీ విప్పుడు చెప్పింది నిరాధారమైంది. నీలో ఉన్న నీచత్వాన్నిది వెల్లడిస్తున్నది." అని డా॥ హోమర్‌ఫీల్డు ఢంకా బజాయించాడు.

"నన్ను బాగా తొక్కేసారు. నా కింత పెద్దదెబ్బ కొట్టిందేమిటో మాత్రం నాకు తెలియదు. డాక్టర్! కాస్త దాన్ని నా చేతుల్లోపెడ్తూ పుణ్యముంటుంది." అని ఎర్నెస్టు హీనస్వరంతో పలికాడు.

"నేను తప్పకుండా ఆపనిచేస్తా. ఆపనిచేస్తా. నీకెట్లా తెలుస్తుంది ? బిషప్ బర్లే తన ఆధ్యాత్మికవాదం పనిచేయలేదని చాటిచెప్పాడన్న సంగతి నీకు తెలియదు. నీకు దానికిదగ్గ ఆధారమేమీలేదు. పిచ్చివాడా! అది ఎప్పుడూ పనిచేస్తుంది." అని డా॥ హోమర్‌ఫీల్డు హుంకరించాడు.

"బర్లే ఆధ్యాత్మికవాదం నిష్ప్రయోజనమైందని చెప్పడానికి నాకున్న ఆధారాలివి. ఎందుకంటే—" అని ఎర్నెస్టు ఒక క్షణకాలం మౌనంవహించి, "బర్లే, గోడల్లో దూరిపోవడానికి ప్రయత్నించేయకుండా ద్వారాల ద్వారానే పోవడం అలవర్చుకొన్నాడు. కూడూ గుడ్డా జీవితాధారాలని విశ్వసించి వాటితోటే జీవయాత్ర సాగించాడు. తన గడ్డంమీది వెంట్రుకలు తొలిగిస్తుంది కాబట్టి ఆయన రేజర్తో శుభ్రంగా క్షౌరం చేసుకొన్నాడు." అన్నాడు.

"కానీ, అవ్వి యదార్థవస్తువులే! ఆధ్యాత్మికవాదం మనస్సంబంధమైందిగా ?" అని డా॥ హోమర్‌ఫీల్డు బొబ్బపెట్టాడు.

రెండో ఆయన తలూపాడు.

"మనస్సులో, ఒక్క సూదిమొనమీద కోటానుకోట్లమంది దేవ దూతలు నిరభ్యంతరంగా నాట్యంచేయవచ్చు. తిమి తిమింగలాది మాంసాలు తింటూ, మృగచర్మం ధరించిన దేవుడుగూడా మానసికంగా ఉండవచ్చు. ఈ మానసికమైన భావనలను వ్యతిరేకించడానికి ఎవరికీ రుజువులు దొరకవు. డాక్టర్! నీవు బహుశా మనస్సులోనే జీవిస్తున్నావనుకొంటా!" అని ఎర్నెస్టు నచ్చేటట్లు మాట్లాడాడు.

"నాకు మనస్సే సామ్రాజ్యం."

"అంటే, నీవు గాలిలో ఊగులాడుతున్నానని మరోరకంగా చెప్పి నట్లే. కానీ భోజనాల సమయానికీ, ఏదైనా భూకంపంకలిగినప్పుడూ తప్ప కుండా భూమిమీదకు వస్తావు. లేకపోతే, డాక్టరుగారూ కొంచెంచెప్పండి! భూకంపంవస్తే మీ నెత్తిమీద ఒక పెద్ద రాయో రప్పో పడి, కపాలమోక్షమవు తుందన్న జ్ఞానమే మీకులేదా?" వెంటనే ఆయనకుకూడా తెలియకుండానే డా॥ హామర్‌ఫీల్టు చెయ్యి, నెత్తిమీది జుట్టులో దాక్కొన్న గాయపు మచ్చ మీదికి పోయి తడమడం మొదలుపెట్టింది. అదృష్టవశాత్తూ ఎర్నెస్టు సరిగ్గా అతికే ఉదాహరణే ఇవ్వడం సంభవించింది. ఒకసారి పెద్దభూకంపం వచ్చినప్పుడు, డా॥ హామర్‌ఫీల్డు నెత్తిమీద పెద్ద చిమ్నీబడి చావుతప్పి కన్ను లొట్టబోయిన సామెతగా బ్రతికి బైటబడగలిగాడు. అక్కడున్న వాళ్లందరూ ఇల్లులేచిపోయేటట్లు ఒక్కసారిగా గొల్లున నవ్వారు.

"మంచిది. నేనుచెప్పింది కాదంటానికి ఆధారాలేవైనా ఉన్నయ్యా?" అని, నవ్వులాగిన తరువాత ఎర్నెస్టు ప్రశ్నించాడు.

"మంచిది. ఇంకా మంచిది. నీ వాదన్ను అంత బాగుండకపోయినా, మరీ తీసికట్టుగాలేవులే," అని మళ్ళీ అనిశ్చబ్దంలో అన్నాడు ఎర్నెస్టు.

కానీ డా॥ హామర్‌ఫీల్డు పూర్తిగా చిత్తైపోయాడు. వాద ఝంఝానిలం క్రొత్త దిశల్లోనుంచి మాంచి పకడబందీగా వీచింది. ఒక పాయింటు తర్వాత

మహోపాయింటుగా ఎర్నెస్టు మత గురువులమీదికి సవాళ్లు పర్చాడు. వాళ్లు తనకు శ్రామిక వర్గాన్ని గూర్చి తెలుసునని మళ్లీ చెప్పినప్పుడు, శ్రామికవర్గాన్ని గూర్చిన మూలసూత్రాలన్నీ వివరించి, వాళ్లకేమీ తెలియదని నిర్ధారించాడు. వాళ్లు చెప్పినవన్నీ నిరాధారాలైనవని సవాల్ చేసి చెప్పాడు. ఆ తున వాళ్లకు నగ్నసత్యాల్ని విప్పిచూపాడు. వాళ్ల ఆకాశ విహారానికి అడ్డుతగిలి, భూమిమీదకు తీసుకువచ్చి జీవిత యాదార్ధ్యాల్ని సాక్షాత్కారం చేయించాడు.

కళ్లకు కట్టినట్లు మళ్లీ నాకాదృశ్యం ఎట్లా కనపడుతున్నది! మేఘగర్జనలాగా ఉండే ఆయన కంఠస్వరాన్ని ఇప్పుడు మళ్లీ వినగలను. నగ్నసత్యాల్తో వాళ్లను చీల్చి చెండాడిన కంఠస్వరమది. ఒక్కొక్క సత్యం వాళ్లకు కొరడా దెబ్బమాదిరిగా ఫెడేల్ ఫెడేల్న తగిలింది. ఆయన ఒక్కొళ్లను దయాధర్మ భిక్ష అడగడు. ఇతర్లకు ఏమాత్రం జాలిచూపడు. చిట్టచివరకాయన వాళ్లకు ఇచ్చిన కశాఘాతం జన్మ జన్మేప్పీ నేను మరచిపోలేను.

"ఈ రాత్రి మీ తెలివితక్కువ ప్రకటనలద్వారా గానీయండి, లేక ప్రత్యక్ష అంగీకారాలద్వారా గానీయండి, శ్రామికవర్గాన్ని గూర్చి కించిత్తు గూడా మీకు తెలియదని మాటి మాటికీ తెలియజేసారు. శ్రామికవర్గాన్ని గూర్చి తెలియనందుకు నిందించాల్సింది నిమ్మల్ని గాదు. శ్రామిక వర్గాన్ని గూర్చి ఏవిషయమైనా మీకెట్లా తెలుస్తుంది? శ్రామికవర్గం నివసించే ప్రదేశంలో మీరు నివసించరు. పెట్టుబడిదారి ధనికవర్గంతో కట్ట కట్టుకొని మీరంతా ప్రత్యేకంగా నివసిస్తారు. వీళ్లతో ఎందుకని నివసించరు? ఆ పెట్టుబడిదారివర్గమే మిమ్మల్ని డబ్బిచ్చి పోషించేది. ఈరాత్రి మీరు ధరించివచ్చిన ఈదుస్తుల్ని మీకిచ్చేది అదే. అందుగ్గాను మీరు వాళ్ళకు ప్రత్యేకంగా ఇష్టమైన ఆధ్యాత్మిక తత్త్వం ఉపదేశిస్తుంటారు. వాళ్ళకు

ప్రత్యేకంగా ఇష్టమైనవే సర్వాంగీకారయోగ్యాలు. ఎందుచేతనంటే వాటి వల్ల తరతరాలనాటినుంచీ పట్టుకువస్తున్న సాంఘికవ్యవస్థకు ప్రమాదమేమీ ఉండదు.''

ఇప్పుడు బల్లదగ్గర కొంత వివాదానికి సంబంధించిన అలజడి బైలుదేరింది. ''ఓ! నేను మీ నిష్కాపట్యాన్ని సవాలుచేయడంలేదు; మీరు నిష్కాపటులే. మీరు నమ్మిందే బోధిస్తున్నారు. పెట్టుబడిదారి వర్గానికి, అందులోనే మీబలం, మీ విలువా ఉన్నాయ్. కానీ, ప్రస్తుత సాంఘికవ్యవస్థను మార్చే మహోపదేశాలేకనక మీరుచేస్తే, మీ యజమానులైన పెట్టుబడిదారి ముఠాకు ఏమాత్రం రుచించవు. వెంటనే మిమ్మల్ని బర్తరఫుచేస్తారు. అప్పుడప్పుడూ మీలో కొందరి కిటువంటి బర్తరఫులు జరిగినైకూడా. నేను చెప్పింది నిజంకాదూ?'' అన్నాడు ఎర్నెస్టు.

ఈదఫా గుసగుసలుగాని అలజడిగాని బైలుదేరలేదు. ఒక్క డా॥ హామర్‌ఫీల్డు తప్ప తక్కినవాళ్లంతా మౌనంగా అంగీకరించి కూర్చున్నారు.

''వాళ్ల ఆలోచనావిధానం తప్పైనప్పుడే వాళ్ళను రాజీనామా లివ్వమనడం జరిగింది.'' అన్నాడు డా॥ హామర్‌ఫీల్డు.

''అంటే, వాళ్ళ భావనావిధానం పెట్టుబడిదారి వర్గానికి అనంగీకారమైందని మరోవిధంగా చెప్పినట్లే. అందుకనే నేనుచెప్తున్నా వినండి. మీపంథాలో మీరుపోండి! మీ బోధలు మీరుచేసుకోండి! మీడబ్బు మీరు సంపాదించుకోండి. దయయుంచి శ్రామికవర్గాన్ని మాత్రం వదలిపెట్టండి! మీరు శత్రుపక్షానికి సంబంధించినవాళ్లు. శ్రామికవర్గానికీ మీకూ అస లేవిధమైన సామ్యమూలేదు. మీకోసం ఇతర్లు తయారు చేసిపెట్టిన పన్నతో మీచేతులు చాలా మృదువుగాఉన్నాయి. తినీతినీ మీబొజ్జలు పీపాల్లాగా ఉన్నాయి. (ఈమాట అనేటప్పటికి డా॥ బాలింగ్‌ఫోర్డు ఉలిక్కి

పడ్డాడు. తక్కినవాళ్లంతా విపరీతంగా ఉన్న అతని పొట్టమీద చుట్టుకొన్న పట్కావేపుచూచారు. కొన్ని సంవత్సరాలపాటు ఆయనపాదాలాయనకే కనపడలేదట!) ఇప్పుడున్న సాంఘికవ్యవస్థకు పూర్తిదోహదాలైన భావాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ మీమనస్సులు నిండివున్నయ్. మీకు తిండీబట్టా ఇచ్చి పోషించేవాళ్ళకు వాళ్లకిష్టమైనవి బోధిస్తూ విశ్వాసపాత్రులై ఉండండి. కానీ శ్రామికవర్గంలోకి జొరబడి వాళ్లకు దొంగనాయకులుగా మాత్రం ప్రవర్తించకండి. ఒక్కసారే మీరు హృదయపూర్వకంగా రెండు పక్షాల్లోనూ ఉండలేరు. మీ ప్రసక్తిలేకుండానే శ్రామికవర్గం తన బాగోగులు తాను చూచుకొన్నది. నమ్మండి. మీ పొలుకువకూడా లేకుండగానే శ్రామికవర్గం తన మంచిచెడ్డలు తాను నిర్ణయించుకోగలుగుతుందికూడా. ఇంకాచెప్పాలంటే, మీరు ఉన్నదానికంటే, తూనాబొడ్డంబాలుగా దూరంగాకూర్చుంటేనే శ్రామికవర్గం ఎక్కువగా అభివృద్ధి చెందకలుగుతుంది.'! అని ఎర్నెస్టు మాట్లాడాడు.

## ౨

వచ్చిన అతిథులంతా వెళ్ళిపోయినతర్వాత మా నాన్న కుర్చీలో పడుకొని విపరీతంగా నవ్వడం మొదలుపెట్టాడు. మా అమ్మ చచ్చిపోయింది మొదలుకొని మా నాన్న బ్రహ్మానందభరితుడై కడుపుబ్బ నవ్వగా నేను చూడడం ఇదే ప్రథమ పర్యాయం.

"పందెంవేసి చెపుతున్నాగా, డా॥ హామర్‌ఫీల్డు తన జన్మలోఇటువంటి వాఙ్వాదన్ని ఎదుర్కొని ఉండడు." అని మళ్ళీ నవ్వి, "వాదంలో మత సంబంధమైన సాంప్రదాయమట!" ఎవర్‌హార్డ్ మొట్టమొదట నోట్లో నాలుకలేని వట్టి మేధకుడి మాదిరిగా ఎట్లా ప్రారంభించి ఒక్క క్షణకాలంలో

సింహంలాగా ఎట్లా గర్జించాడో గుర్తించావా? అతడికి బ్రహ్మాండమైన మనోనిగ్రహం ఉంది. అతడి శక్తిసామర్థ్యాలన్నీ విజ్ఞానశాస్త్రానికి ఉపయోగించినట్లైతే గొప్ప విజ్ఞానశాస్త్రవేత్తగా తయారయ్యేవాడు." అన్నాడు నాన్న.

నాకు ఎర్నెస్టు ఎవర్‌హార్డు మీద ఆసక్తి పెరిగిందని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఆయన మాట్లాడిన విధానం, విషయమేకాదు నన్ను ముగ్ధురాల్ని చేసింది. ఆయన వ్యక్తిత్వమే నన్ను పరవశురాలిగా జేసివేసింది. నా జీవితంలో అటువంటి వ్యక్తినే చూడలేదు. బహుశా అందుకే కావాలి నేను ఇరవైనాల్గు సంవత్సరాల వయస్సు వచ్చినా ఇంకా పెండ్లి చేసుకోలేదు. నేనాయన్ని మనస్ఫూర్తిగా ప్రేమించానని చెప్పక తప్పదు. మేధాశక్తి, వాదనాపటిమ కతీతమైన ఏదో ఒకశక్తి నన్నాయనవైపు గాఢంగా ఆకర్షించింది. ఆయన పటిష్ట కండరాలూ, వృషభస్కంధం మాట అటుంచి ఆయన నాకొక అద్భుత ప్రతిభాసంపన్నుడిగా సాక్షాత్కరించాడు. దేహబలం, బుద్ధిబలమేకాకుండా ఆయన కరుణాంతఃకరణలు కలవాడని కూడా అనుకున్నా. మనిషిని చూస్తే ఎంత మొరటుగా కన్పిస్తాడో మనస్సులో అంత మార్దవం కలవాడు. చురుకైనవాడు. ఆయన అట్లాంటి వాడని నాలో ఏదో తోచిందిగాని, అట్లా తలచడానికి కారణాలు మాత్రం నేను చెప్పలేను. మేఘగర్జనలాగా ఉన్న ఆయన కంఠస్వరంలోని ఏదోశక్తి నా హృదయంలో కాపురం పెట్టింది. ఇప్పటికీ ఆ కంఠం నా చెవుల్లో ధ్వనిస్తూనే ఉంది — మళ్ళీ ఆ కంఠాన్ని వినాలని ఉబలాటంగా ఉంది. ఆయన మొగంలో ఉన్న గంభీరత్వాన్ని కప్పిపుచ్చే ఆయన కళ్ళల్లోని చిరునవ్వుకాంతుల్ని మళ్ళీ ఒక్కసారి కళ్లారా చూడాలని నా మనస్సు పరవళ్ళు తొక్కింది. ఆయనలో ఉండి నాకందని అస్పష్టమైన అనిశ్చయమైన ఏదో భావన నన్ను అమాంతం కదలించివేసింది. ఆయన్ను

మళ్ళీ చూడడం పడకపోతే నాలో అస్పష్టంగా ఏర్పడ్డ ఊహలు మాసి పోయి, ఆయన్నే సులభంగా మరచిపోవడం జరుగుతుందని నాకు పూర్తి నమ్మకమున్నప్పటికీ, అప్పుడు మాత్రం ఆయన్ని గాఢంగా ప్రేమించా.

కానీ; మళ్ళీ నేనాయన్ని చూడడానికి నాకేవిధమైన అడ్డంకీలేదు. మానాన్నకు సాంఘికశాస్త్రంమీద కొత్తగా ఏర్పడ్డ అభిమానం, ఆయన చేసే విందులూ నాకా అవకాశాన్ని లేకుండా చేయవు. ఇదివరకు, మా నాన్న సాంఘిక శాస్త్రవేత్తకాదు. మా అమ్మను పెండ్లిచేసుకోవడం మా నాన్నకు సంతోషప్రదమైందే. ఆయన అభిమానశాస్త్రమైన భౌతిక శాస్త్రంలో ఆయనచేసే పరిశోధనలు ఆయనకు పరమానంద ప్రదాలుగానే ఉండేవి. కానీ మా అమ్మ చనిపోయినతర్వాత, ఆయనచేసే శాస్త్ర పరి శోధనలు ఆయన హృదయంలో వెలితిని పూర్తిచేయలేకపోయినై. మానాన్న మొట్టమొదట కాలక్షేపార్థం తత్త్వ శాస్త్రాన్ని చేపట్టాడు. తరువాత బాగా ఆసక్తి పెరిగిపోయి ఆర్థిక, సాంఘిక శాస్త్రాలమీదికి దృష్టిమరల్చాడు. ఆయన ధర్మపక్షపాతి. సంఘంలోఉన్న అధర్మాన్నీ, అన్యాయాన్నీ పూర్తిగా తుడిచిపెట్టాల్నకాంక్ష ఆయనలో మిన్నందుకొంది. వీటివల్ల వచ్చే ఫలితాన్నిగూర్చి నేనంతగా ఆలోచించకపోయినప్పటికీ, జీవితంలో నూతనంగా ఏర్పడ్డ ఈ ఆసక్తి లక్షణాల్నిమాత్రం కృతజ్ఞతా పూర్వకంగా అభినందించా. అవి ఆయన్నెక్కడికి తీసుకుపోతయో అన్నదికూడా ఖాతరుచెయ్యకుండా, ఒక యువకుడిమాదిరిగా నవనవోత్సాహంతో వాటిలో పూర్తిగా నిమగ్నుడైపోయాడు.

ఆయన పరిశోధనాగారంతో బాగా అలవాటుపడ్డందున, ఇప్పుడు భోజనాలగదిని సాంఘిక శాస్త్ర పరిశోధనాలయంగా మార్చివేశాడు. ఇక్కడివిందుకి శాస్త్రజ్ఞులు, రాజకీయవాదులు, కోటీశ్వరులూ, విజ్ఞాన వేత్తలు, కార్మికనాయకులు, సోషలిష్టులు, అరాచకవాదులూ మొదలైన

'నానా గోత్రీభ్యులు' సమావేశ మౌతుంటారు. వాళ్ళందర్నీ చర్చల్లోకి దింపుతాడు. జీవితంమీదా, సంఘంమీదా ఉన్న వాళ్ళ ఊహల్ని విపులీకరిస్తాడు.

'మతగురువుల విందు రాత్రికి' కొంచెం ముందుగా ఆయన ఎర్నెస్టును కలుసుకొన్నాడు. వచ్చిన అతిథులందరూ వెళ్ళిపోయినతర్వాత మానాన్న తాను ఎర్నెస్టును ఎట్లా కలుసుకొన్నదీ చెప్పాడు. రాత్రి వీధిలోగుండా తాను పోతూపోతూ, సబ్బులపెట్టెమీద నిలవబడి అక్కడ మూగిన శ్రామిక జన సమూహానికి ఉపన్యసిస్తూన్న ఒకవ్యక్తినిచూచి ఆగిపోయాడట. ఆయనే ఎర్నెస్టు. అందువల్ల ఆయన కేవలం సామాన్యమైన ఉపన్యాసకుడనుకోంటానికి వీల్లేదు. సోషలిస్టుపార్టీ సభల్లో ఆయనకు ఉన్నతస్థానంఉంది. దాని నాయకుల్లో ఆయనొకడు. సోషలిస్టు తత్వ సిద్ధాంతం ఆయనకు కరతలామలకం. ఆయన సుప్రసిద్ధుడైన సామ్యవాద తత్త్వవేత్త. ఆయన ఎటువంటి గొట్టువిషయాన్నైనా నాసరే అరటిపండువలిచి చేతిలోపెట్టినట్లుగా, అందరికీ సులభంగా అర్థమయ్యేటట్లు చెప్పగల చాకచక్యంగలవాడు. ఆయన సహజంగానే అటువంటి విశేషంకలవాడు. శ్రామికవర్గానికి ఆర్థిక విషయాలు బోధించడానికి ఉపాయంగా సబ్బులపెట్టెమీద నిలవబడలేదాయన.

ఆయన ఉపన్యాసం మా నాన్నను నిలవేసింది. వక్తృత్వపటిమ రుచి చూస్తున్నకొద్దీ మా నాన్నకు ఆసక్తి పెరిగిపోతోంది. మా నాన్న పరవశుడైపోయాడు. ఆయనతో పరిచయం చేసుకోకుండా ఉండలేకపోయాడు. పరిచయమైనతర్వాత, బోధకుల విందుకు ఆయన్ని ఆహ్వానించాడు. భోజనమైపోయిన తర్వాత మా నాన్న ఆయన్నిగూర్చి తనకు తెలిసిన విషయం చెప్పాడు. అమెరికాలో రెండుశతాబ్దాలపైచిలుకునుంచీ

నివసిస్తున్న ప్రాచీన ఎవర్‌హార్డ్ వంశం వాడైనప్పటికీ, ఆయన శ్రామిక వర్గంలో జన్మించాడు. ఆయన పది సంవత్సరాల ప్రాయమప్పుడు యంత్రాగారాల్లో పనిచేయడానికి పోయాడు. కొంతకాలం జీతంనాతం లేకుండా పని నేర్చుకున్నాడు. తర్వాత గుర్రపులాడాలు కొట్టేవాడుగా తయారయ్యాడు. స్వయంకృషిచేత నాల్గు అక్షరంముక్కలు నేర్చుకొన్నాడు. తర్వాత తనంతటతానే జర్మన్, ఫ్రెంచి భాషలుకూడా నేర్చుకున్నాడు. అప్పుడే చికాగోలో అతికష్టంమీద నడపబడుతున్న ఒక సోషలిస్టు ప్రచురణ సంస్థకు శాస్త్రీయగ్రంథాలూ, తాత్త్విక గ్రంథాలూ అనువాదం చేసియిస్తూ మరీ పస్తులు పడుకోకుండా నాలుగురాళ్లు సంపాదించుకుంటుండేవాడు. ఆ సంపాదనకుతోడు ఆయన సొంతంగా వ్రాసిన ఆర్థిక, తాత్విక గ్రంథాల కొద్ది అమ్మకంమీద వచ్చేరాయల్టీతో వేన్నీళ్ళకు చన్నీళ్ళగా కాలక్షేపం చేస్తుండేవాడు.

నేను పడుకోబోయేముందు ఆయన్నిగూర్చి మా నాన్న ద్వారా తెలుసుకున్న విషయమిది. ఆయన కంఠధ్వనిని గుర్తుచేసుకొంటూ చాలా సేపు మేల్కొనిఉన్నా. నా ఆలోచనలు నాకే భయం కలిగించినయ్. నా వర్గానికి సంబంధించినవాడు కాడు. అందనివాడు. చాలాగట్టివాడు. ఆయన దక్షత్వం నాకు అమితానందాన్నీ, అమితభయాన్నీ కలిగించింది. ఎందుకంటే, ఆయన్ని నా ప్రియుడిగా, నా భర్తగా నిశ్చయంచేసుకునే వరకూ నాలో 'ఊహలు' కావాల్నని తీవ్రంగా ఉరుకులా పరుగులా తీసినై. మగవాళ్ళలో ఉన్నబలం స్త్రీలను తప్పకుండా ఆకర్షిస్తుందని చెప్పుకోవడం విన్నా. కానీ ఆయన చాలా బలవంతుడు. "కాదు. కాదు. అది అసాధ్యమైన పని. అర్థంలేనిది!" అని నాకు నేనే బిగ్గరగా ఆలోచించా. మరుసటిరోజు ప్రొద్దున్నే ఆయన్ని మళ్లీచూడాలనే ఉబలా

టంతో నివర్తిలేచా. వాదంలో ప్రతికక్షుల్ని చిత్తుచేసే ఆయన దక్షత్వం చూడాలని ఉత్సాహపడ్డా. మేఘగర్జనలాంటి ఆయన కంఠాన్ని మరో మారు వినాలని ఉవ్విళ్లూరా. తమంతవాళ్ళులేరని అహంకారంతో విర్రవీగేవాళ్లను ఎదుర్కొని చివరకు 'మావంటి శుద్ధ తెలివితక్కువ సన్యాసులు లేరు' అనేటట్లుగా వాళ్లచేతనే ఒప్పించి, రెండుచెంపలూ వేసుకోనేటట్లుచేసే ఆయన వాదపటిమను ఇంకొకసారి తృప్తిదీరా గమనిద్దామని నా మనస్సు స్వారీచేసింది. చూడడానికాయన మొరటువాడుగా ఉంటే మాత్రమేం? ఆయన మాటల్లోనే చెప్పాలంటే, 'అది పనిచేసింది.' అది బాగా పనిచేసింది. దుక్కమాదిరిగా ఉన్న ఆయన భౌతికరూపంకాక, ఆయనలో దర్శనీయమైన మరోవిషయం ఉంది. యుద్ధరంగంమాదిరిగా అది ప్రతివాణ్ణీ ఊపివేస్తుంది.

చాలారోజులు గడిచిపోయినై. ఈలోపుగా నేను మా నాన్ననడిగి ఎర్నెస్టు పుస్తకాలు తీసుకొని చదివేసా. ఆయన మాట్లాడుతూంటే ఎంత స్పష్టంగా, అందర్నీ ఒప్పించేటట్లుగా ఉంటుందో, ఆయన వ్రాసిన పుస్తకాలూ అట్లాగే ఉన్నయ్. ఎటువంటి అనుమానం వచ్చినా తీరిపోయేటట్లుగా చాలా సులభంగా మనస్సుకు పట్టేటట్లుగా ఉన్నయ్. అందరికీ అర్థమయ్యేటట్లు వ్రాయగల శక్తి ఆయనకు ఉంది. స్పష్టంగా నిర్దుష్టంగా చెప్పగల వాడాయన. ఆయన ఉక్తి గొప్పదైనప్పటికీ, నాకు నచ్చనిది అందులో చాలా ఉంది. శ్రమకూ—పెట్టుబడికీగల శత్రుత్వం, స్వార్థానికి సంబంధించిన యుద్ధం, దీన్నే వర్గపోరాటమని ఆయన వ్రాసాడు. ఈ వర్గపోరాటవిషయమై ఆయన లేనిపోని అనవసరమైన ప్రాధాన్యత ఇచ్చాడు.

ఆయన తూర్పు పడమరా తెలియని అమాయకుడనీ, ఏదో వచ్చీ రాని నాల్గు విషయాలు నేర్చుకొని గొప్ప మేధావినని భ్రమించే వెఱ్ఱివాడనీ, ఎర్నెస్టునుగూర్చి డా॥ హామర్‌ఫీల్డు తేల్చిన సారాంశాన్ని మా నాన్న

నవ్వుతూ నాతో చెప్పాడు. దానికితోడు డా॥ హోమర్‌ఫీల్డు మళ్లీ ఎర్నెస్టును కలుసుకోడానికి నిరాకరించాడు.

కానీ, బిషప్ మూర్‌హౌస్ కు ఎర్నెస్టుమీద ఎక్కువ ఆసక్తికలిగింది. మళ్ళీ ఒకసారి ఆయన్ని కలుసుకోవాలని తహతహలాడాను. "చాలా గట్టిగుండెవాడు. మంచి ఉషార్ కలవాడు. మాంచి ఉషార్ కలవాడు. కానీ, ఆయన తన సిద్ధాంతాలమీద చాలా గట్టినమ్మకం కలవాడు. గట్టి నమ్మకం గలవాడు" అని బిషప్ మూర్‌హౌస్ ఎర్నెస్టునుగూర్చి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

ఒకరోజుసాయంత్రం మా నాన్నతో ఎర్నెస్టువచ్చాడు. బిషప్‌కూడా అంతకుముందే వచ్చిఉన్నాడు. మేం వరండాలో టీ త్రాగుతున్నాం. ఎర్నెస్టు, విశ్వ విద్యాలయంలో జీవశాస్త్రంలో ప్రత్యేకవిషయం నేర్చుకొంటున్నందువల్లా, 'తత్త్వశాస్త్రం - విప్లవం' అనే గ్రంథాన్ని దీక్షతో వ్రాస్తున్నందువల్ల, బర్క్లీకు, తరచుగా వస్తూవుండేవాడు.

ఎర్నెస్టు రావడంతోటే వరండా చిన్నదైపోయినట్లు కనిపించింది. ఆయనంత పెద్దవాడని కాదు. ఆయన 5'9'' ఎత్తుమాత్రమే. ఆయనరాకే బ్రహ్మాండమంతగా తోచింది మాకు. నన్ను కలుసుకోవడానికి ఆయన ఆగి, గంభీరమైన దృష్టివిక్షేపంతో, నన్నభినందిస్తూ నాతో దృఢమైన కరచాలనం చేసినప్పటికీ ఆయన తనలోఉన్న తొట్రుపాటును తమాయించుకోలేక పోయాడు. ఆక్షణంలో ఆయనదృష్టి నిశ్చలంగా గంభీరంగాఉంది. ఆయనకళ్ళలో నన్నేదో ప్రశ్నిస్తున్నట్లు ద్యోతకమైంది. ఇదివరకుమాదిరిగానే ఆయన నన్ను చాలా సేపుచూచాడు.

"నేను మీరువ్రాసిన 'శ్రామికవర్గ తత్త్వశాస్త్రాన్ని' చదువుతున్నా" అన్నా. ఆయనకళ్లు సంతృప్తితో మెరిసినై.

"నేనెవరి నుద్దేశించి వ్రాసానో మీరు బహుశా గ్రహించేవుంటారను కొంటా." అన్నాడు.

"ఆc. అందుకే మీతో నాకో చిన్నతగాదా ఉంది."అని సవాలుచేసా.

"మిస్టర్ • ఎవర్‌హార్డ్! నాకూ్కడా మీతో తగాదా ఉంది." అన్నాడు బిషప్ మూర్‌హౌస్. ఎర్నెస్టు తమాషాగా భుజాలెగరేసి, నేనిచ్చిన టీ కప్పు స్వీకరించాడు. బిషప్, "ముందు మీరు కానీయండి!" అన్నాడు నాతో.

"మీరు వర్గవైషమ్యాన్ని రెచ్చగొడుతున్నారు. శ్రామికవర్గంలో ఉన్న సంకుచితత్వాన్నీ, మూర్ఖత్వాన్ని దానికోసం మీరు ఉపయోగించు కోవడం తప్పుగా, మహాపరాధంగా తలుస్తున్నా. వర్గద్వేషం సాంఘి కాభ్యుదయానికి గొడ్డలిపెట్టు. అది సాంఘికోపద్రవమని కూడా అను కొంటున్నా" అన్నా.

"నేను నిర్దోషిని. వర్గద్వేషం నాపుస్తకంలోలేదు. పైగా నేనెక్కడా అటువంటి ఉద్దేశ్యంతో ఒక్కక్షరంకూడా వ్రాయలేదు." అని సమాధానం చెప్పాడు.

"ఓ! అదా!" అని నిందాగర్భంగా అంటూ, ఆయన పుస్తకాన్నందు కోని తెరిచా.

ఆయన టీ చప్పరిస్తూ, నేను పేజీలు తిరగేస్తుంటే మందహాసంచేసాడు.

"నూటముప్పయిరెండో పేజీ, అని, 'అంయుగ్గాను ప్రస్తుత సాంఘి కాభ్యుదయదశలో కూలీ యిచ్చేవాళ్ళకూ, పుచ్చుకొనేవాళ్ళకూ మధ్య వర్గ పోరాటం కలుగుతుంది.' " అని పెద్దగా చదివి వినిపించి, పెద్ద, విజయం సాధించిన దాని మాదిరిగా ఆయన వేపు చూసా.

"అందులో వర్గవైషమ్య ప్రసక్తేలేదే" అని నామీదకొక చిరునవ్వు విసిరాడు.

"ఐతే మీరు వర్గపోరాట మన్నారుగా!" అని సమాధానం చెప్పా.

"వర్గపోరాటానికీ వర్గద్వేషానికీ చాల భేదముంది. నామాట నమ్ము. మేము ఎప్పుడూ ద్వేషాన్ని రెచ్చగొట్టం. సాంఘికాభివృద్ధికి, వర్గపోరాటం విధి అని మాత్రమే చెబుతాం. దానికి మేము బాధ్యులంకాము. మేము వర్గపోరాటాన్ని తయారుచేయం. న్యూటన్ ఆకర్షణశక్తిని సృష్టించేసి నట్టే మేము ఈ వర్గపోరాటాన్ని విపులీకరిస్తాం. వర్గపోరాటానికి మూలకంద మైన ప్రయోజన వైరుధ్యం యొక్క స్వభావాన్ని మాత్రం మేము స్పష్టీక రిస్తాం." అని ఆయన సమాధానం చెప్పాడు.

"కానీ, అసలు ప్రయోజనవైరుధ్యమనేదే లేకుండా ఉండాలి" అని నేను అరిచా.

"నేను మీతో మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నా. సోషలిస్టుల మైన మేమూ ఈ ప్రయోజన వైరుధ్యంలేకుండా చేయాలనే ప్రయత్ని స్తున్నాం. క్షమించండి. నా పుస్తకంలోనుంచి కొంతభాగం చదివి విని పిస్తా" ఆయన పుస్తకాన్ని తీసుకొని చాలా పేజీలు తిప్పాడు.

"నూటఇరవైఆరో పేజీ...'ఆదిమ కమ్యూనిస్టు సమాజవ్యవస్థ అంతం చెందడంతో ప్రారంభించిన వర్గపోరాట పరంపర, సాంఘిక ఆస్తికతకోసం వ్యక్తుల ప్రత్యేక ఆస్తిపాస్తులూ, వ్యక్తిగత ఆస్తిపాస్తులూ వినియోగపడి నప్పుడు అంతమొందుతుంది."

"కానీ నేను మీతో ఏకీభవించను. మీ పూర్వసిద్ధాంతంతప్పు. శ్రమకూ పెట్టుబడికీ మధ్య ప్రయోజన వైరుధ్యమంటూ ఏమీలేదు. లేక పోతే అటువంటిదేమీ ఉండగూడదు." బిషప్ అడ్డు తగిలాడు. ఆయన తీవ్ర మనోభావాలను నెట్టివేస్తూ ఆయనమొగం ఎలాతెలాపోయింది.

"చాలా అభివందనాలు. చిట్టచివరగా మీరు మాట్లాడిన మాటల

చేత, మళ్ళీ నా వాతావరణాన్ని అంగీకరించారు.” అన్నాడు గంభీరంగా ఎర్నెస్టు.

“అసలు వైరుధ్యం ఎందుకుండాలి?” అని బిషప్ గ్రుచ్చిఅడిగాడు. ఎర్నెస్టు భుజాలెగరేసి, “ఎందుకంటే, మనమట్లా తయారుకాబడ్డాము కాబట్టి అని ఊహిస్తున్నా” అన్నాడు.

“మనమట్లా తయారుకాబడలేదే” అని రెండోవ్యక్తి అరిచాడు.

“నూటికో కోటికో ఒకడో, అరో కనిపించే నిస్వార్థ నిర్మల జీవియైన ‘ఆదర్శ’ వ్యక్తినిగూర్చా, లేక అత్యధిక సంఖ్యాకుడైన సర్వసామాన్యవ్యక్తిని గూర్చా మీరు తర్కిస్తున్నది?” అని ఎర్నెస్టు ప్రశ్నించాడు.

“సర్వ సామాన్యమైన వ్యక్తిని గురించే.” అని సమాధానంవచ్చింది.

“మానసికమైన బలహీనతలుకలిగిన, తప్పులు చేయడానికి ఆస్కారమైన వ్యక్తి?” అవునన్నట్లుగా బిషప్ మూర్‌హౌస్ తలూపాడు.

“స్వార్థం కలిగిన, సామాన్యమైనవ్యక్తి.”

అంగీకారంగా మళ్ళీ బిషప్ తలూపాడు.

“చాలా జాగ్రత్తగా గమనించండి. నేను ‘స్వార్థజీవి’ అన్నా.”

“సర్వసామాన్యమైనవ్యక్తి స్వార్థపరుడే.” అని బిషప్ ఆయన అభిప్రాయాన్ని బలపరచాడు.

“వీలైనంతవరకూ గుంజుకోవాలని చూస్తాడు.”

“నిజమే. అందినంతవరకూ సొంతంచేసుకోవాలని చూస్తాడు- కానీ అది విచారకరమైన విషయం.”

“అయితే నాచేతిలో చిక్కారు. చూపిస్తా చూడండి. ట్రాముల్లో పనిచేసేవాడొకడున్నాడు.” ఎర్నెస్టుమొగం వికసించింది.

“పెట్టుబడే లేకపోతే అతడసలెట్లా పనిచేస్తాడు.” అని బిషప్ అడ్డుతగిలాడు.

"నిజమే. లాభాలు సంపాదించడానికి శ్రమశక్తే లేకపోతే, పెట్టుబడే ఊడ్చిపెట్టుకు పోతుందన్న విషయం మీ రంగీకరించాలి." బిషప్ మూకీభావంగా ఉన్నాడు.

"ఒప్పుకోరా ?" అని ఎర్నెస్టు వత్తిడిచేసాడు.

బిషప్ అంగీకార సూచకంగా తలూపాడు.

"కాబట్టి మీరుచెప్పిందీ, నేనుచెప్పిందీ జేబాకీకింద రద్దుచేద్దాం. ఫలితం, మన మిదివరకెక్కడున్నామో ఇప్పు డక్కడకే వచ్చామన్నమాట. మళ్ళీ మొదలుపెడ్దాం. ట్రాముల్లో పనిచేసే కార్మికులు శ్రమశక్తిని వినియోగిస్తారు. యజమానులు పెట్టుబడిని వినియోగిస్తారు. కార్మికులూ, పెట్టుబడీ కలిస్తే డబ్బువస్తుంది. సంపాదించిన డబ్బును వాళ్ళల్లోవాళ్లు పంచుకొంటారు. పెట్టుబడికివచ్చిన భాగాలను, 'లాభాలు' అని పిలుస్తారు. శ్రమశక్తికి వచ్చిన భాగాలను 'కూలీ' అంటారు." అని ఎర్నెస్టు చెప్పాడు.

"మంచిదే. ఈ భాగపంపిణీ తగాదా లేకుండా పరిష్కరించుకోకుండా ఉండటానికి కారణంలేదే." అని బిషప్ మధ్యలో అడ్డు తగిలాడు.

"మన మింతకుముందు ఒప్పుకున్న విషయాన్ని మీ రప్పుడే మరచిపోయారు. సర్వసామాన్యవ్యక్తి 'స్వార్థపరుడు' అన్నది ఉభయులం అంగీకరించాం. అతడటువంటివాడు. మీరు ఊహాప్రపంచంలోకి ఎగిరిపోయి ఆదర్శంగా ఉండవలసినవాళ్ళను సృష్టించుకొని వాళ్ళమధ్య భాగపంపిణీ వ్యవహారం చక్కబెట్తున్నారు కానీ అసలున్న రకాన్ని గూర్చి ఆలోచించడం లేదు. యదార్థజగత్తుకువస్తే తేలేవిషయమిది. కార్మికుడు స్వార్థపరుడు కావడంచేత భాగపంపిణీలో వీలైనంతవరకూ గుంజుకోవాలని చూస్తాడు. పెట్టుబడిదారుడూ స్వార్థజీవి కావడంవల్ల అందినంతవరకూ అతడూ సొంతం చేసుకోడానికి ప్రయత్నిస్తాడు. ఒకేమొత్తం ఉండి, ఇద్దరూ దాన్నే

ఎవరికివాళ్లు కాజేద్దామని బైలుదేరినప్పుడు, దాంతో ప్రయోజన వైరుధ్యం ఏర్పడుతుంది. శ్రమశక్తికీ, పెట్టుబడికీ మధ్య ఏర్పడే ప్రయోజన వైరుధ్య మిదే. పరిష్కరించడానికి వీలుగాని వైరుధ్య మిది. పెట్టుబడిదారులూ, శ్రామికులూ ఉన్నంతవరకూ వాళ్ళు భాగపంపిణీవిషయమై పరస్పరం గుద్దు లాడుకొంటూనే వుంటారు. ఇవ్వాళ ప్రొద్దున మీరు శాన్ ఫ్రాన్సిస్కో లోనే ఉన్నట్లయితే దేవుడా అంటూ రెండుకాళ్ళ స్వారీ తీయవలసివుండేది. అక్కడ ఒక్క ట్రామూకూడా నడవడంలేదు" అని ఎర్నెస్టు ప్రత్యుత్తరం చెప్పాడు.

"ఇంకో సమ్మె?" అని బిషప్ గాభరాతో అడిగాడు.

"అవును. ట్రాములమీద వచ్చిన ఆదాయంలో భాగపంపిణీ విషయమై వాళ్ళు జుట్టూ, జుట్టూ పట్టుకొంటున్నారు."

బిషప్ మూర్‌హౌస్ తమాయించుకోలేకపోయాడు.

"అది చాలా తప్పు! కార్మికులకు దూరాలోచన లేకపోవడంవల్ల జరిగిన ప్రమాదమిది. మా సానుభూతిని వాళ్ళెట్లా సంపాదిద్దామని ఆశిస్తు న్నారు?—" అని కోపంతో అరిచాడు.

"మనం నడవవలసిన అవసరపట్టినప్పుడు" ఎర్నెస్టు వ్యంగ్యంగా అన్నాడు.

బిషప్ మూర్‌హౌస్ ఆయన్ని లక్ష్యంచేయకుండా మాట్లాడటం మొదలుపెట్టాడు.

"వాళ్ళది చాలా సంకుచిత దృక్పథం. మానవులు మానవులుగా ప్రవర్తించాలిగాని పశువులుమాదిరిగా సంచరించకూడదు. ఇక ఇప్పుడు కొట్లాటలూ, హత్యలూ చెలరేగుతై. నానా భీభత్సా జరుగుతుంది. విధవలూ, అనాథలూ అలో లక్ష్మణా అని ఆక్రందిస్తారు. పెట్టుబడీ,

శ్రమా ప్రరస్పర మైత్రితో ఉండాలి. వాళ్ళు ఉభయుల క్షేమంకోసం పరస్పర సహకారంభావంతో కృషిచేయాలి.''

"అదిగో! మళ్ళీ తమరు శూన్యంలోకి ఉడాయించారే, భూమి మీదకు దయచేయండి! జ్ఞాపకం ఉంచుకోండి. సర్వసామాన్యమైనవ్యక్తి స్వార్థజీవి అని మన ముభయులం అంగీకరించాం!" అన్నాడు ఎర్నెస్టు.

"కానీ, అతడట్లా ఉండగూడదు." అని బిషప్ గట్టిగా అన్నాడు.

"ఆ విషయంలో నేనూ మీతో ఏకీభవిస్తున్నా. అతడు స్వార్థ పరుడు కాకూడదు. కానీ, అర్థంపర్థంలేని ఈ పిచ్చి నీతిశాస్త్రంమీద ఆధార పడి సంఘం ఉన్నంతకాలమూ అతడు స్వార్థజీవిగానే బ్రతుకుతుంటాడు." అని ఎర్నెస్టు సమాధానం చెప్పాడు. బిషప్ ఉలిక్కిపడ్డాడు. మా నాన్న ఆగి ఆగి నవ్వాడు.

"ఔను. పిచ్చినీతిశాస్త్రం. పెట్టుబడిదారీ వ్యవస్థ అంటే అర్థమదే. మీ చర్చి ఉన్నదందుకనే. మీరు వేదికలెక్కి ప్రతిదఫా బోధించేదీ అదే. పిచ్చి నీతిశాస్త్రం! దానికి మరో పేరులేదు." అని ఎర్నెస్టు నిర్దాక్షిణ్యంగా మాట్లాడాడు.

బిషప్ మూర్‌హౌస్ మా నాన్నవేపు సహాయార్థంగా చూచాడు. కానీ మా నాన్న నవ్వి తలూపాడు.

"మిస్టర్ ఎవర్‌హార్డు నిజమే చెప్పాడనుకుంటున్నా. ఎవళ్లెట్లా చస్తే ఏమి, నా సంగతే నాకు అన్న సిద్ధాంతంతో ఉంటే, రాక్షసత్వం ఎవళ్ళమటుకు వాళ్ళనే నిలువునా దోచేస్తుంది. మొన్నరాత్రి మిస్టర్ ఎవర్‌హార్డు చెప్పినట్లుగా, ఇదివరకటినుంచీ వస్తున్న సంఘు సాంప్రదాయాన్ని చెక్కుచెదరకుండా కాపాడడం కోసమే మీ మతబోధకులంతా తాపత్రయ పడుతున్నారు. మీ మీద ఆధారపడే సంఘం నడుస్తుంది" అన్నాడు మా నాన్న.

"క్రీస్తు బోధించిందదికాదే!" అని బిషప్ అరిచాడు.

"ఈ రోజుల్లో చర్చి, క్రీస్తు సిద్ధాంతాల్ని అనుసరించడంలేదు. అందుకనే శ్రామికులకు చర్చితో ఏ మాత్రం నిమిత్తంలేదు. పెట్టుబడిదారి ముఠా, శ్రామికవర్గాన్ని పెట్టే భయంకరమైన అమానుషమైన హింసాకాండను చర్చి క్షమిస్తుంది." అని ఎర్నెస్టు గబా గబా మాట్లాడాడు.

"చర్చి దాన్నెప్పుడూ క్షమించదు." అని బిషప్ అడ్డుతగిలాడు.

"చర్చి దాన్ని వ్యతిరేకించదు. చర్చి దాన్ని .వ్యతిరేకించడంలేదంటే క్షమిస్తున్నదన్నమాటే. ఎందుకంటే చర్చికి పెట్టుబడిదారివర్గమే శరణ్యం" అని ఎర్నెస్టు తిరుగు సమాధానం చెప్పాడు.

"నేనా దృష్టితో దాన్ని పరిశీలించలేదు. మీరు పొరపాటు పడ్డారు. ఈ ప్రపంచం ఎక్కువగా కపటంతో, మోసంతో కూడు కొన్నదన్న విషయం నాకు తెలుసు. మీరు చెప్పే ఆ శ్రామికవర్గాన్ని చర్చి లక్ష్యపెట్టలేదన్న సంగతి కూడా తెలుసు." అని బిషప్ పట్టుకు పోయిన గొంతుతో మాట్లాడాడు.

"మీరెప్పుడూ శ్రామికుల్ని గూర్చి ఆలోచించలేదు. చర్చితో ఏ మాత్రం నిమిత్తంలేకుండా, చర్చికి తెలియకుండానే శ్రామికవర్గం పెంపొందింది"

"మీయచెప్పేది అర్థంకావడంలేదు." అని బిషప్ హీనస్థాయిలో మాట్లాడాడు.

"ఇతే విపులీకరిస్తా వినండి! 18 వ శతాబ్దం ఉత్తరార్థంలో యంత్రాలూ, కర్మాగారాలూ కాలుపెట్టడంతో అధికశ్రామికులు భూమినుంచి దూరమైపోయారు. కృషిలో పాతపద్ధతు లదృశ్యమైపోయినై. పనిచేసే వాళ్ళంతా ఊళ్ళూ పల్లెలూ వదలి తండోపతండాలుగా బయలుదేరి కర్మాగారాలున్న పట్టణాల్లోకి ప్రవేశించారు. పసిపిల్లాదిగా స్త్రీలూ, పురు

ఉక్కు పాదం.

దేవేంద్రభవనాల్లాంటి చర్చీలు కడ్తున్నారు. ఆ చర్చీల్లో, లాభాలద్వారా బొజ్జలు పెంచుకున్న సోమరిపోతు ముఠాకు మీరు తీయ తీయని మహోపదేశాలు చేస్తున్నారు. "

" నాకా సంగతి తెలియదు " అని బిషప్ ఎలా తెలాపోతూ పలికాడు. అతడికి తల తిరిగిపోతున్నట్లనిపించింది.

" ఇప్పడూ మీరు వ్యతిరేకించలేముగదూ? "

బిషప్ తలూపాడు.

" పద్దెనిమిదో శతాబ్దంలో మాదిరిగా నేడూ చర్చి మూగపోయింది?" బిషప్ మాట్లాడలేదు. మళ్ళీ ఎర్నెస్టు ఆ విషయాన్ని నొక్కి అడిగాడు.

" మరచిపోవాకండి. మతగురువేనాడైనా వ్యతిరేకించాడో అప్పడు ఆయనకు చర్చినుంచి ఉద్వాసనే. "

" అది న్యాయమైందని అనుకోను " అని తన అభ్యంతరాన్ని చెప్పాడు బిషప్.

" మీరు వ్యతిరేకిస్తారా ? " అని ఎర్నెస్టు అడిగాడు.

" మా సమాజంలో, మీరు చెప్పినటువంటి చెడుగులుంటే చూపించండి. నేను తప్పకుండా వాటిని వ్యతిరేకిస్తా "

" నేను చూపిస్తా. మీ రెప్పుడంటే నేనప్పుడు సిద్ధంగా ఉన్నా. నేను మిమ్మల్ని తీసుకొని ప్రత్యక్ష నరకకూపాల్ని చూపిస్తా " అని ఎర్నెస్టు చాలా ప్రశాంతంగా మాట్లాడాడు.

" అయితే నేను తప్పకుండా వ్యతిరేకిస్తా. చర్చి నోరుమూసుకొని కూర్చోదు " అని బిషప్ కుర్చీలో నిటారుగా కూర్చున్నాడు. ప్రశాంతమైన ఆయన మొగంమీద యోధరేఖలు తారాడినై.

"మీకు క్షణం ఉచ్ఛ్వాసన జరుగుతుంది." అని ఎర్నెస్టు హెచ్చరించాడు.

"జరగదని నేను నిరూపిస్తా. మీరుచెప్పినట్లుగానే జరుగుతే, చర్చికి ఈపరిస్థితులు తెలియనందువల్లనే పొరపాటుపడ్డదని రుజువుచేస్తా. అంతేకాదు, శ్రామికవర్గంలో ఏవైనా భయంకరమైన పరిస్థితులేర్పడితే, అవి పెట్టుబడిదారివర్గంయొక్క అజ్ఞానంచేత నేననికూడా నిర్ధారిస్తా. మన సందేశం అందుకోవడంతోటే అది తన తప్పిదాన్ని తప్పకుండా సవరించుకొంటుంది. ఈ సందేశాన్నందించవలసిన బాధ్యత పూర్తిగా చర్చిదే." అని బిషప్ ఎదురుసవాల్ చేసాడు.

ఎర్నెస్టు నవ్వాడు. ఆయన చాలా క్రూరంగా నవ్వాడు. ఇక లాభంలేదని నేను బిషప్ పక్షం వహించా.

"జ్ఞాపకముంచుకోండి! మీరు ఒకపక్షమే గమనిస్తున్నారు. మాలో లేశమాత్రంకూడా మంచిలేదని మీరు సెలవిచ్చినా, మాలో చాలా మంచి ఉంది. బిషప్ మూర్‌హౌస్ చెప్పింది సరైంది. మీరు చెప్పినట్లుగా పరిశ్రమలోపం - భయంకరత్వం అజ్ఞానంచేత కలిగినవే. సంఘంలోని విభాగాలు కలుసుకోలేనంత దూరంగా విడిపోయినై."

"కిరాతకులుకూడా పెట్టుబడిదారివర్గమంత రాక్షసులూ, దుర్మార్గులూ కారు." అని ఆయన సమాధానం చెప్పాడు. అప్పుడాయన మీద నాకు అసహ్యంకలిగింది.

"మా విషయం మీకు తెలియదు. మేము రాక్షసులమూ, దుర్మార్గులమూకాము."

"రుజువుచెయ్యండి?" అని ఆయన సవాల్ విసిరాడు.

"మీకు.....నేనెట్లా రుజువుచేసేది?" నాకు కోపం ముంచుకొస్తోంది.

షులూ క్రొత్త యంత్రాల్లో పనిచేయడానికి నియమింపబడ్డారు. కుటుంబ జీవితానికి స్వస్తిపలికారు. చాలా భయంకరపరిస్థితులు ఏర్పడ్డయ్. అది రక్తగాథ."

"నాకు తెలుసు, నాకు తెలుసు. అది చాలా భయంకరమైందే. కానీ అది ఒక శతాబ్దన్నర నాటి గాథకదా!" అని బిషప్ మూర్‌హౌస్ బాధాసూచకమైన మొగంతో మధ్యలో మాట్లాడాడు.

"అదిగో! ఆ శతాబ్దన్నర కాలంనాడే నేటి శ్రామికవర్గం ఏర్పడ్డది. చర్చి తనకేమీ పట్టనట్లుగా తూనా బోటుంబొలుగా ఉంది. పెట్టుబడిదారిముఠా, జాతిని ఒక కసాయిదుకాణంగా చేస్తే, చర్చి మూగమొద్దులాగా ఉండిపోయింది. నేడు మాదిరిగానే నాడూ, చర్చి దాన్ని వ్యతిరేకించలేదు. నాటి పరిస్థితుల్ని గూర్చి ఆస్టిన్ లెవిస్ చెప్పినట్లుగా, 'నా గొర్రెమందను పోషించండి' అని క్రీస్తు ఎవరికి ఆదేశించాడో వాళ్ళు, ఆ గొర్రెలు బానిసలుగా అమ్మబడి, కుయ్ కుయ్ అనకుండా చచ్చేదాకా బండచాకిరి చేస్తూంటే, ఊరకే గ్రుడ్లు మిటకరించుకొని చూస్తూ కూర్చున్నారు. చర్చి అప్పుడు నోరుపడ్డదాని మాదిరిగా ఉండిపోయింది. నేనింకా తదితర విషయాలు చెప్పబొయ్యేముందు మిమ్మల్నొక్కటడుగుతున్నా. మీరు నాతో ఏకీభవించేదీ లేనిదీ నిక్కచ్చగా చెప్పండి. చర్చి అప్పుడు నోరుమూసుకొని కూర్చున్నదా?" అని ఎర్నెస్టు తన సంభాషణ కొనసాగించాడు.

బిషప్ మూర్‌హౌస్ తటపటాయించాడు. ఎర్నెస్టు చెప్పినట్లుగా ఇటువంటి 'ముఖాముఖి నిష్కర్ష' వాదానికి డా॥ హామర్‌ఫీల్డు మాదిరిగా ఈయనా అలవాటుపడలేదు.

"పద్ధెనిమిదో శతాబ్దపు చరిత్ర వ్రాయబడిఉంది. చర్చి మూగమొద్దులాగా ఉండకపోయినట్లైతే చరిత్రలో మన కదేవిషయం కనపడుతుందిగా" అని ఎర్నెస్టు అందించాడు.

"నిజమే. చర్చి ఆనాడు ఏమీ పట్టించుకోలేదు." అని బిషప్ అంగీకరించాడు.

"చర్చి ఈనాడూ అదే పరిస్థితిలో ఉంది."

"ఇక్కడ నేను మీతో ఏకీభవించను" అన్నాడు బిషప్. ఎర్నెస్టు కొంచెం సేపాగాడు. ఆయనవేపు పరకాయించి చూచాడు. ఆయన సవాలును సరేనన్నాడు.

"మంచిది. జరుగుతున్న విషయం గమనిద్దాం. చికాగోలో స్త్రీలు 90 సెంట్ల కోసం వారంరోజులూ రెక్కలు ముక్కలు చేసుకొంటున్నారు. మరి చర్చి దాన్ని వ్యతిరేకించిందా?"

"ఇది నే నిప్పుడు కొత్తగా వింటున్న వార్త. వారంరోజులకూ తొంభై సెంట్లేనా? ఎంత దుస్సహం!" అన్నాడు బిషప్.

"చర్చి ఏమైనా వ్యతిరేకించిందా?" అని ఎర్నెస్టు గుచ్చి అడిగాడు.

"చర్చికీ విషయం తెలియదు." అని బిషప్ మథనపడడం సాగించాడు.

"ఐనప్పటికీ చర్చి ఆదేశం 'నా గొర్రెమందను పోషించండి' అనే" అని ఎర్నెస్టు ఎగతాళిగా మాట్లాడి, మరుక్షణంలో "పరిహాసం చేసినందుకు నన్ను మన్నించండి. మీరంటే మాకు చిర చిరలాడుతుందంటే మీరాశ్చర్య పడతారా? దక్షిణ ప్రాంత ప్రత్తియంత్రాల్లో పనిచేస్తున్న పిల్లలనుగూర్చి మీరెన్నడైనా మీ పెట్టుబడిదారి ముఠా సమావేశాల్లో వ్యతిరేకించారా?" ఆరేడు సంవత్సరాల వయస్సుకలిగిన పసికూనలు, ప్రతిరాత్రీ పన్నెండు గంటల చొప్పున పనిచేస్తుంటే మీరేనాడైనా 'అదేమి' అన్న పాపాన పోయారా? వాళ్ళెన్నడూ సూర్యరశ్మినే చూచుకోటానికి నోచుకోలేదు. ఈగలవలె దోమలవలె చస్తున్నారు. వాళ్ళ రక్తంపిండి లాభాలు పంచుకుంటున్నారు. ఆ లాభాలతో కొత్త ఇంగ్లండులో బ్రహ్మాండమైన

ఆయన తలూపాడు. "నాకు రుజువుచేయమని మిమ్మల్ని అడగ లేదు. మీకు మీరే రుజువుచేసుకోండన్నాను." అన్నాడు.

"నాకుతెలుసు." అన్నా.

"మీ కసలేం తెలియదు." అని మొరటుసమాధానం చెప్పాడు.

"ఆఁ! ఆఁ! వాళ్లు పిల్లలు" అన్నాడు నాన్న. తగాదాచంపడానికి.

"నాకేం లెక్కలేదు -" అని నేను నిర్లక్ష్యంగా మాట్లాడ్డానికి ప్రారంభించా. కానీ ఇంతలోకే ఎర్నెస్టు అడ్డుతగిలాడు.

"మీరు కాకపోతే మీనాన్నకు (ఎట్లాఅన్నా ఇబ్బందిలేదనుకోండి.) సియెరామిల్లులో కొంత పెట్టుబడిఉందని నాకు తెలుసు."

"దానికీ మనం మాట్లాడేదానికీ ఏమి సంబంధం?" అని నేను బిగ్గరగా అరిచా. అతడు మెల్లగా ప్రారంభించాడు. "మీరు ధరించిన గౌను రక్తపుమరకలతో కూడింది అన్నది తప్ప ఆట్టే సంబంధమేమీలేదు. మీరు తినే ఆహారం రక్తంతో వండింది. పసిపిల్లల, పెద్దవాళ్ళరక్తం మీ ఇంటి దూలాలనుంచి బొట్లుబొట్లుగా వర్షిస్తోంది. నేను కళ్లుమూసుకొని కూర్చోని, మీ ఇంటి కప్పుమీదనుంచి టపా, టపా మని నా చుట్టుపట్ల పడుతున్న రుధిరబిందువుల్ని వినగలను." అని సాభినయంతో మాట్లాడుతూ కళ్లుమూసుకొని, తన కుర్చీలో చేరగిలబడి కూర్చున్నాడు. అవమానంతో కోపంతో నాకు పట్టరాని దుఃఖం వచ్చింది. నా జన్మలో నన్నింత ఘోరంగా ఎవ్వరూ చూడలేదు. బిషప్, మానాన్నా గాభరాపడి ఉక్కిరి బిక్కిరైపోయారు. ఈ సంభాషణను కులాసాకబుర్లలోకి మారుద్దామని వాళ్ళు ప్రయత్నించారు. కానీ, ఎర్నెస్టు కళ్ళు తెరిచి, నావేపుచూచి, వాళ్లను ఊరుకోమన్నట్లుగా చేయివిచాడు. ఆయనమొగం, కళ్ళూ గంభీ రంగా ఉన్నయ్. ఇప్పుడాయన కళ్ళల్లో చిరునవ్వు కాంతులులేవు. ఆయన

ఏమి చెప్పబోతున్నాడో, నాకే భయంకరమైన శిక్ష విధించబోతున్నాడో నాకేం తెలియలేదు. ఎందుకంటే అప్పుడే అటు ప్రక్కగుండాబోయే ఒక మనిషి ఆగి, మావేపొకసారి చూచాడు. అతడు బలిష్టంగా ఉన్నాడు. చినిగి మాసిపోయిన దుస్తులుధరించి ఉన్నాడు. అతడి భుజంమీద ఫేముతో చేసిన కుర్చీలు, తెరలూ, సీటలూ మొదలైన సామాన్లబరువు ఉంది. ఏమన్నా మాట్లాడుకుంటున్నారేమోనని, తను లోపలికి వచ్చి ఏమైనా అమ్ముకొనిపోవడానికి వీలున్నదో లేదో అని మా యింటి వేపొకసారి చూచాడు.

"అతడిపేరు జాక్సన్" అన్నాడు ఎర్నెస్టు.

"దున్నపోతుమాదిరిగా ఉన్నాడే ఏదైనా పని చేసుకోకూడదూ, వీధుల్లోబడి అమ్ముకోకపోతే." అని నేను నిర్మొగమాటంగా అన్నా.

"అతడి ఎడమచేతి చొక్కాచెయ్యి చూడు" అని ఎర్నెస్టు నెమ్మదిగా మాట్లాడాడు.

నేను చూచా. అది ఊరికే వ్రేలాడుతోంది.

"మీ ఇంటి కప్పునుంచి వర్షిస్తున్న నెత్తుటి చుక్కల్లో నేను విన్నవి కొన్ని అతడి మోచేతివి. సియెరా మిల్లులో అతడు తనచేయి పోగొట్టుకొన్నాడు. నడుము విరిగిన గుఱ్ఱం మాదిరిగా అతణ్ని పోయిచావమని మీరు వీధుల్లోకి తరిమేసారు. నేను 'మీరు' అన్నానంటే, మీరూ, తక్కిన భాగస్వాములూ కలిసీ, మీ మిల్లులు రక్షించడానికని నియమించిన సూపరింటెండెంటూ, ఉద్యోగులూ అన్నమాట. అది ఒక ప్రమాదం జరిగింది. కంపెనీకి కొన్ని డాలర్లు ఆదా చేద్దామని అతడు ప్రయత్నించడం చేత జరిగిన ప్రమాదమది. అతడి చేయి పళ్లచక్రంలో పడ్డది. పళ్ళ చక్రంలో ఇరుక్కుపోయిన చెకుముకిరాయిని అతడు తీయకుండా వదిలి వేయవచ్చు. దానివల్ల మహాపాడైపోతే రెండుజతల వరసల పెద్దమేకులు

పాడైపోయి ఉండేవి. అతడా రాతిని తీసేద్దామని చేయిపెట్టాడు. అతని చేయికాస్తా ఆ పళ్ళచక్రంలో ఇరుక్కొని భుజంవరకూ తెగనుకుపోయింది. అది రాత్రిపూట జరిగినపని. మిల్లులు ఎక్కువకాలం పనిచేస్తున్నయ్. దానిగ్గాను బోలెడన్ని లాభాలువస్తయ్. జాక్సన్ చాలాగంటలు పని చేస్తూండడంచేత అతని కండరాల బిగువూ సత్తువా క్షీణించిపోయినై బాగా అలిసిపోయి ఉండడంమూలాన అతనిపని కొంచెం వెనకాడింది. అందుకనే అతణ్ని యంత్రం లంకించుకుంది. అతడికి భార్యా, ముగ్గురు బిడ్డలూ ఉన్నారు.'' అని ఎర్నెస్టు ఏమీ తొణుకూ బెణుకూ లేకుండా మాట్లాడాడు.

"కంపెనీ అతడికేం సహాయంచేసింది?" అని నేనడిగా.

"ఏమీచేయలేదు. ఓ! ఔనౌను. అదొక పనిచేసింది. అతడు ఆస్పత్రినుంచి బైటికివచ్చిన తర్వాత వేసిన నష్టపరిహార దావాను చాలా చాక చక్యంతో గెలిచింది. కంపెనీ చాలా ఘటికులైన న్యాయవాదుల్ని నియమి స్తుంది తెలుసా"

"మీరు మొత్తం చరిత్రను చెప్పలేదు. లేకపోతే మీరు మొత్తం కథ తెలియనైనా తెలియకుండా ఉండాలి. కాకపోతే అతడు గర్విష్టైనా అయి ఉండాలి." అని నేను నిందారోపణచేసా.

"గర్విష్టి! హోహో! హాహో!" అని ఆయన అట్టహాసం చేసి, "ఓరి భగవంతుడా! గర్విష్టి! తన చేతిని పోగొట్టుకొనే గర్విష్టి! అతడు నిస్సందేహంగా చాలా నిగర్వి, జాగ్రత్తపరుడూ. అతడు గర్విష్టి అనడానికిగాని లేకపోతే అజాగ్రత్తపరుడు అనడానికిగానీ ఎటువంటి ఆధారంలేదు" అన్నాడు.

"మీరు చెప్పినదానికన్నా వేరే ఏదో లేకపోతే న్యాయస్థానాలతనికి వ్యతిరేకంగా తీర్పు ఇచ్చిఉండేవికావు." అన్నా.

"కర్నల్ 'ఇన్గ్రామ్' కంపెనీ తరఫున ఉన్న న్యాయవాది. ఆయన మాంచి తెలివితేటలు గలవాడు." అని ఎర్నెస్టు నావేపొకసారి సాభిప్రాయంగా చూచి మళ్ళీ ప్రారంభించాడు. "నీవు చేయాల్సినపని చెపుతా విను మిస్. కన్నింగ్‌హామ్! జాక్‌సన్ కేసును నీవు పరిశీలించు!"

"నే నెప్పుడో ఆ పని చేద్దామనుకొన్నా" అన్నా.

"ఐతే మంచిది, అతణ్ణెక్కడ కలుసుకోవాలో చెపుతా. కానీ మీరంతా, జాక్‌సన్ చేతిద్వారానే నిరూపించాలి అన్న విషయం ఆలోచిస్తుంటే నాకు కొంచెం భయమేస్తోంది." అని ఎర్నెస్టు మామూలు ధోరణిలో మాట్లాడాడు.

నేనూ, బిషప్పూ ఎర్నెస్టు సవాళ్ళను అంగీకరించడం జరిగింది. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. నాకూ, నా వర్గానికి అన్యాయం జరిగిందనే తపనతో నేను ఒక్కదాన్నే మిగిలిపోయా. ఆయన ఒక మృగం. నేనాయన్ని అప్పుడు బాగా అసహ్యించుకొన్నా. శ్రామికవర్గానికిచెందిన వ్యక్తి అంతకన్నా బాగా ఎట్లా ప్రవర్తిస్తాడులే అని నాకు నేనే సమాధానం చెప్పుకొని ఊరడిల్లా.

3

జాక్‌సన్‌చేయి నా జీవితంలో ఇటువంటి దురదృష్టకరమైన పాత్ర వహిస్తుందని నేను కలలోగూడా అనుకోలేదు. నేను జాక్‌సన్‌కోసం వేటాడినప్పుడు నాకేమాత్రం అతనిమీద అభిప్రాయం ఏర్పడలేదు. అతడి ఇల్లు ఒక నరక కూపంలాగాఉంది. ఆగుడిసెచుట్టూ మురికిగుంటలున్నయ్. ఆ మురికిగుంటలన్నీ పచ్చని నాచు పెరిగి ముక్కులు బద్దలేసుకువెళ్ళే చెడు గవులు కొడుతున్నయ్.

నిగర్వి, మంచివాడని వర్ణించబడ్డ జాక్‌సన్‌ను చూచా. అతడు పేముపని చేసుకొంటున్నాడు. నే నతనితో మాట్లాడ్తూంటే ఏమాత్రం అలుపూ గిలుపూ లేకుండా పనిచేసుకొంటూనే ఉన్నాడు. అతడు మంచి వాడా, నిగర్వి అయినప్పటికీ, "వాళ్ళు నాకు కనీసం కాపలా నౌకరీ అన్నా ఇయ్యాల్సింది" అని అతడన్నప్పుడు, అతడిలో అప్పుడే మొలకెత్తు తున్న ద్వేషాన్ని గుర్తించగలిగా.

అతడివల్ల నాకు తెలియవచ్చిన విషయం బహుకొద్ది. అతణ్ణి చూడ గానే పరమ మూర్ఖుడనుకున్నా. కానీ, 'పోయినకన్ను పోయినా ఉన్న కన్ను రామబాణంరా' అన్నట్లు ఒక్కచేత్తోనే బహు చాకచక్యంగా పని చేస్తూండడం గమనించేటప్పటికి నాలో మొదట తోచిన దురభిప్రాయం తొలిగిపోయింది. దీనివల్ల నాకో ఊహతోచింది.

"నీచెయ్యి పళ్ళచక్రంలోకి ఎందుకు ఇరుక్కుపోయింది?" అని నేనడిగా.

అతడు నావేపు మెల్లగా ఒకసారిచూచి తలూపి, "నాకు తెలియదు. అది జరిగిందంతే," అన్నాడు.

"అజాగ్రత్తా?" అని నే నందించా.

"కాదు. అది అజాగ్రత్త అంటానికి వీల్లేదు. నేను ఎక్కువ గంటలు పనిచేస్తుండేవాణ్ణి. నే నప్పు డలిసిపోయాననుకొంటా. నేను మిల్లుల్లో పదిహేడుసంవత్సరాలపాటు పనిచేసా. ఇంకానేపటికి మిల్లు కూతవేస్తుందనగా ఇటువంటి ప్రమాదాలు చాలా జరుగుతున్నయ్యని నా అనుభవంద్వారా గ్రహించా. రోజులో తక్కిన కాలంలోకన్నా మిల్లు కూతవేయాబోయే గంటలోనే ఎక్కువ ప్రమాదాలు జరుగుతుంటై అని నేను పందెంవేసి చెప్తుతా. గంటల తరబడీ పనిచేసినవ్యక్తి అఖరివేళలో అంత

చలాకీగా ఉండడు. చాలామంది ప్రమాదాలకు గురికావడం నేను కళ్లారా చూచాను." అని అతడు సమాధానంచెప్పాడు.

"చాలా మందా?"

"వందలు, వందలు. పసిపిల్లలుకూడా."

భయంకరమైన వివరాలు మినహాయించి నేనింతకుముందా ప్రమాదాన్ని గూర్చి విన్నదానికీ, ఇప్పుడితడు స్వయంగా చెప్పినదానికీ ఏమీ తఖావతు లేదు. యంత్రాన్ని నడపవలసిన విధానంలో ఏమైనా పొరపాటు చేసాడేమోనని అతణ్ణి నే నడిగినప్పుడు లేదని తలూపాడు.

"నేను కుడిచేత్తో బెల్టును నెట్టి, ఎడమచేత్తో చెరుముకిరాయిని తీసేయడానికి ప్రయత్నించా. బెల్టు తొలిగిందా లేదా అని నేను పరకాయించి చూడలేదు. నా కుడిచెయ్యి ఆ పని చేసిందనుకొన్నా కాని అది జరగలేదు. నేను తొందరగా చెయ్యిపెట్టా. బెల్టు తిరుగుతూనే ఉంది. నా చెయ్యి కాస్తా నజ్జు నజ్జయిపోయింది." అన్నాడతను.

"చాలా బాధకలిగుండవచ్చు." అని సానుభూతిగా అన్నా.

"ఎముకలు నుగ్గు నుగ్గైపోవడం నొప్పిగాదా."

నష్టపరిహారం దావాను గురించి అతడి మనస్సు చీకాకైపోయింది. తనకేమీ నష్టపరిహారం ముట్టలేదన్నదిమాత్రం అతడికి స్పష్టంగా తెలుసు. ఫోర్‌మన్, సూపరెండెంటూ ఇచ్చిన సాక్ష్యంవల్లనే కోర్టువారు తనకు వ్యతిరేకంగా తీర్పిచ్చారన్న ఊహ అతనిలో ఉంది. ఆ సాక్ష్యం ఉండవలసిన తీరులోలేదని అతడు చెప్పాడు. వాళ్ళ దగ్గరికిపోదామని నిశ్చయించుకొన్నా.

ఒక్కటి మాత్రం స్పష్టమైంది. జాక్‌సన్ పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. అతడి భార్య జబ్బుమనిషి. అతడు కలప, చేరు వస్తువుల అమ్మకం

మీద కుటుంబానికి చాలినంత సంపాదించలేకుండా ఉన్నాడు. అద్దె బాకీ పడ్డాడు. అతడి 11 సంవత్సరాల పెద్దకొడుకు మిల్లులోకిపోయి పనిచేయడం ప్రారంభించాడు.

"వాళ్లు కనీసం నాకు కాపలాదారి పనైనా ఇచ్చి ఉండాల్సింది." అని నేనుపోతూన్నప్పుడు చిట్టచివరగా అతడన్న మాటలు.

జాక్సన్ కేసును వాదించిన లాయరునూ, సాక్ష్యం ఇచ్చిన ఫోర్మన్, సూపరెండెంటునూ కలుసుకొని భోగట్టా సేకరించేటప్పటికి ఎర్నెస్టు వాదనలో కొంత సరుకున్నదని అనుకోవడం ప్రారంభించా.

ఆ లాయరు చాలా బలహీనుడూ, అసమర్థుడూ. అతణ్ణి చూచేటప్పటికి జాక్సన్ కేసు పోవడం నాకాశ్చర్యమనిపించలేదు. జాక్సన్ అటువంటి లాయర్ని పెట్టుకొన్నందుకు తగిన శాస్తే జరిగిందిలే అని మొదట అనుకొన్నా. కానీ వెంటనే, "కంపెనీ మాంచి సమర్థులైన లాయర్లని ఏర్పాటుచేసుకొంటుంది." "కర్నల్ ఇన్గ్రామ్ చాలా చురుకైన లాయరు" అని ఎర్నెస్టు చెప్పిన రెండు మాటలూ నా మనస్సులో తళుక్కున మెరిసినై. నేను చాలా తీవ్రంగా ఆలోచించా. జాక్సన్‌వంటి కార్మికులకన్నా కంపెనీ చాలా తెలివైన లాయర్లను ఏర్పాటుచేసుకోగలుగుతుంది అన్న ఊహ చటుక్కున తోచింది. కానీ ఈ ఊహ చాలాకొద్ది వివరంతో కూడుకొన్నదే. దీనికన్నా మాంచి కారణమింకోటుంది. జాక్సన్ కేసు అతనికి వ్యతిరేకంగా ఎందుకు తిరిగిందో నాకు గట్టినమ్మకమేర్పడింది. "కేసెందుకు పోగొట్టావ్?" అని అడిగా.

లాయరు కొంచెంసేపు తంపరబింపరల్లాడాడు. పాపమా అభాగ్యుడి గాథరాచూస్తే నాకే మనస్సులో కొంచెం జాలి కలిగింది. అతడిక మూలుగుతూ మాట్లాడడం మొదలుపెట్టాడు. అది అతనికి పుట్టుకతోనే వచ్చిన

అలవాటేనని అనుకున్నా. పుట్టినప్పట్నుంచీ అతడు అభాగ్యుడుగానే జీవిస్తున్నాడు. సాక్ష్యాన్ని కూర్చి చెప్పాడు. అవతలవాళ్లే కనుకూలంగా సాక్ష్యంచెప్పారు. జాక్‌సన్‌కు సహాయపడే మాట ఒక్కటికూడా వాళ్ళ నుండి రాబట్టలేకపోయాడు. ఎవళ్లవల్ల తనకు నోట్లో కొంచెం గంజి దిగ జారుతున్నదో వాళ్ళకి తెలుసు. జాక్‌సన్ వట్టి తెలివితక్కువవాడు. కర్నల్ ఇన్గ్రామ్ అతణ్ని గాభరాపెట్టి తికమకచేసి వదిలిపెట్టాడు. క్రాస్ పరీక్షలో కర్నల్ ఇన్గ్రామ్ అసాధ్యపు పిండం. జాక్‌సన్‌నుంచి అతడికే ఎదురు తిరిగే సమాధానాలు రాబట్టాడు.

"అతడిపక్షాన న్యాయం ఉంటే, అతడు తన మెడకే చుట్టుకునే సమాధానాలు చెప్పడమెట్లా సంభవిస్తుంది?" అని నేనడిగా.

" న్యాయానికీ దీనికీ సంబంధ మేమిటి?" అని తిరుగు సమాధానం చెప్పాడు.

తన చిన్న గదిలో గోడమీద అల్లరిచిల్లరగా అటూ ఇటూ పడున్న పెద్దపెద్ద పుస్తకాలవేపు చేయిపెట్టి చూపిస్తూ, "ఆ పుస్తకాలు చూచారా. అవన్నీ చదివినందువల్ల నాకు తేలిన సారాంశమేమంటే, న్యాయశాస్త్రం వేరూ న్యాయం వేరూ అని. ఏ లాయరైనా అడగండి. న్యాయాన్ని నేర్చుకోటానికి మీరు ఆదివారపు పాఠశాలలకు పోతారు. కానీ, న్యాయ శాస్త్రాన్ని నేర్చుకొంటానికీ మీ రా పుస్తకా లాశ్రయించాలి" అన్నాడు.

జాక్‌సన్ పక్షం న్యాయమున్నప్పటికీ, ఓడిపోయాడనేనా మీరు చెప్పేది? జడ్జి కార్ట్వెల్ కోర్టులో న్యాయమన్నదే లేదన్నదేనా మీ ఉద్దేశ్యం?" అని ప్రశ్నించా.

ఆ లాయరు నా వేపొకసారి దిగాలపడి చూచాడు. అతడి మొగం మీద ఆందోళన చిహ్నాలదృశ్యమైపోయినై.

"నాకు తగిన అవకాశం దొరకలేదు. నన్నూ, జాక్సన్‌నూ వాళ్లు వట్టి వెధవలుచేసి కూర్చోబెట్టారు. నా కవకాశం ఏం వచ్చింది? కర్నల్ ఇన్గ్రామ్ గొప్ప లాయరు. అతడు గొప్పవాడే కాకపోతే, సైయరా మిల్సుకూ, ఎర్డ్సన్ లాండు సభకూ, బర్క్లే సంస్థకూ ఓక్‌లాండుకూ, సాన్ లియాండ్రోకూ, ప్లెజెన్‌టన్ విద్యుచ్ఛక్తి పరిశ్రమకూ ఎట్లా లాయరుగా నియమింపబడతాడు. పైగా ఆయన కార్పొరేషన్ లాయరుకూడా. కార్పొరేషన్ వట్టి చచ్చుదద్దమ్మల్ని లాయరుగా ఎప్పుడూ పెట్టుకోదు. ఒక్క సైయరా మిల్సే ఏడాదికి అతనికి 20 వేల డాలర్లు ముట్టచెప్తుతుం దంటే, ఆయన సంగతేమనుకుంటున్నారేమిటి? ఆయన సంవత్సరానికి 20 వేల డాలర్లు చెల్లించుకోవాల్సిన తాహతు కలవాడు కాబట్టే, వాళ్లు చెల్లిస్తున్నా రనుకోరాదూ. నే నంత చేయను. నేనే అంత విలువచేసేవాణ్ణైతే, పస్తుల్తో ఇట్లాపడి ఉండి, జాక్సన్‌లాంటి వాళ్లకేసులు పట్టే స్థితెందుకు పడుతుంది. జాక్సన్ కేసు నెగ్గేఉంటే నే నెంత తీసుకొని ఉండేవాణ్ణను కుంటున్నారు? "

"బహుశా మీరాతణ్ణి నిలువునో పిడిచేసి ఉండేవాళ్ళ. "

"అవును. మరి నేనూ బ్రతకాలిగా ?" అని కోపంతో అన్నాడు.

"అతనికి భార్యా బిడ్డలున్నారు." అన్నా.

"నాకూ పెళ్లాం బిడ్డలూ ఉన్నారుగా. వాళ్లు తిన్నారా తినలేదా అనేది విచారించేవాళ్లు నేనుతప్ప నా అన్నవాళ్లెవరూ మరొకరులేరు."

అని అతడు ఘాటుగా సమాధానంచెప్పాడు.

ఉన్నట్లుండి అతడిమొగంలో దైన్యం గోచరించింది. అతడు తన గడియారాన్ని తెరిచి దానిలో అంటించబడ్డ ఒక చిన్న ఫొటో చూపించాడు. ఆఫొటోలో ఒక స్త్రీ, ఇద్దరు ఆడపిల్లలున్నారు.

"ఇదిగో ఇందులో ఉన్న వాళ్లను చూడండి! మాకు చాలా కష్టపు రోజులు వచ్చినై. జాక్సన్ కేసుగెలిస్తే వాళ్లను పల్లెటూరికి పంపిద్దామను కొన్నా, వాళ్ల కిక్కడ ఆరోగ్యం సరిగాలేదు. కానీ వాళ్లను పంపించ డానికి చేతిలో గుడ్డిగవ్వగూడా లేదు."

నేను బైలుదేరుదామనుకొంటుండగానే అతను మళ్లీ మాట్లు ప్రారంభించాడు.

"నాకు ఎంతతన్నుకొన్నా అవకాశమే లభించలేదు. కర్నల్ ఇన్గ్రామ్‌కూ, జడ్జి కాల్డ్వెల్‌కూ మాంచిదోస్తీ ఉంది. క్రాసుపరీక్షలో నాకు వాళ్ళనుంచి సరైన సాక్ష్యం వచ్చిఉంటే వాళ్లిద్దరికున్న స్నేహం కేసును తాడోపేడో తేల్చివేసేదని కాదు నేనుచెప్పేది. ఐనప్పటికి జడ్జి కాల్డ్వెల్ నాకు మంచి సాక్ష్యం దొరక్కుండా-చేయవలసిన తతంగమంతా చేసి కూర్చున్నాడు. అందాకా ఎందుకు. కర్నల్ ఇన్గ్రామ్, జడ్జి కాల్డ్వెల్ ఒకే చోట నివసిస్తున్నారు. ఒకేక్లబ్బులో ఉంటారు. వాళ్ళిద్దరూ పక్క-పక్కలే ఉంటున్నారు. అటువంటిచోట ఉండడం నాకు మించినభారం. వాళ్ళ భార్యలు తరచు ఒకొళ్లయింటి కొకళ్లు వస్తూ పోతూ ఉంటారు. వాళ్లొకళ్లకొకళ్లు విందులూ గిందులూ చేసుకుంటూ ఉంటారు.

"ఐనా, జాక్సన్ నష్టపరిహారంకోసం దావావేయడం న్యాయమే నంటావన్నమాట?" అని బైటికిపోతూ పోతూ గడపమీద ఒకక్షణం నుంచోని అడిగా.

"నేనట్లా అనుకోవడంలేదు. దానివిషయం నాకుతెలుసు. అతడు కొంచెం దొంగనటన చేసాడని నేను మొట్టమొదట అనుకొన్నా. కానీ ఈవిషయం నాభార్యతో చెప్పలేదు. డబ్బులేకుండా ప్రయాణం. కష్టమైనప్పటికీ, పల్లెటూళ్లకుపోయి కాలక్షేపం చేద్దామనే ఉబలాటంతో ఉన్నదామె. ఆమెను నిరాశకలిగిద్దామనుకోలేదు.

"మిషన్‌కు ఏమాత్రంకూడా దెబ్బతగలకుండా ఉండడంకోసమే జాక్సన్ ప్రయత్నించాడు, అన్న సత్యాన్ని నీవెందుకు కప్పిపుచ్చావ్?" అని నేను పీటర్ 'డొన్నెలి'ని ప్రశ్నించా. పీటర్, జాక్సన్ కేసులో విచారణసమయమప్పుడు సాక్ష్యంచెప్పిన మిల్లులోని ఒక ఫోర్‌మన్.

సమాధానం చెప్పబోయేముం దతడు చాలసేపు దీర్ఘంగా ఆలోచించాడు. (తనవేపొకసారి ఆదుర్దాతో చూచుకొని) "ఎందుకంటే, నాకో పెళ్లాం, ముగ్గురు పసికూనలూ ఉన్నారు. అందుకని." అన్నాడు.

"నాకేం అర్థంకాలేదు." అన్నా.

"మరోమాటలో చెప్పాలంటే, అట్లాచేయడం మంచిది కాదు." అన్నాడు.

"నీ వనేది— " అని నేను మొదలు పెట్టా.

కానీ ఇంతలోకే అత డడ్డుతగిలి, "నేననుకొన్న దేదో అదేచెప్పా. మిల్లుల్లో చాలా కాలంనుంచీ పనిచేస్తున్నా. చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడే దారెపుకండెలు తీయడంతో పని ప్రారంభించి అప్పట్నించీ ఇప్పటిదాకా పనిచేస్తున్నా. మరలో మరగా పనిచేసి నేను ప్రస్తుతపదవిని సంపాదించ కలిగా. నీ దయవలన నేను ఫోర్మన్‌గిరికి వచ్చా. నాకేమైనా ఆపదవస్తే అనుకొనేవాడు ఈమిల్లుల్లో కలికాని ఒక్కడైనా ఉన్నాడా? అనేదే నాకు పెద్దసందేహం. నేను యూనియన్లో సభ్యుడిగాఉండేవాణ్ణి. ఐతప్పటికీ రెండుసార్లు సమ్మెలుజరిగితే కంపెనీ నన్ను వాటిల్లో పాల్గొనకుండా నిర్బంధించింది. వాళ్లు నన్ను యజమాన్లకు అమ్ముడుపోయానని నిందించారు. ఈరోజున నాతోపాటు గలిసి తాగటానికి వాళ్లల్లో ఏఒక్కర్నీ పిలిచినా రారు. నా నెత్తిన రాళ్ళుపడి ఎట్లా గాయాలైనదో చూచారూ? నూలుకండెలదగ్గర పనిచేయడానికొక్క కుర్రకుంకకూడా లేకుండాపోయాడు. ఇంక నన్నేమైనా అనండి. ఏమిచేస్తాను. నాకు కంపెనీఒక్కటే స్నేహితుడు.

కంపెనీకి దాసోహమని పనిచేయడం నా విధ్యుక్తధర్మమని చెప్పడంలేదు. కూడూ, గుడ్డా, నా పెళ్ళాంబిడ్డలకోసం నేను మిల్లుల్ని కనిపెట్టుకొని ఉండాల్సిన అగత్యం ఏర్పడింది. అందుకోసమనే."

"జాక్‌సన్ దేమైనా తప్పుందా?" అని ప్రశ్నించా.

"అతడికి తప్పకుండా నష్టపరిహారం ముట్టాల్సిందే. చాలా మంచి పనివాడు. ఎప్పుడూ ఏవిధమైన ఇబ్బంది కలిగించలేదు."

"నిజంచెప్తానని ప్రమాణం చేసినప్పటికీ, నీకు నిజంచెప్పే స్వాతంత్ర్యం లేకపోయిందన్నమాట?"

అవునని అతడు తలూపాడు.

"నిజం! జరిగిన యదార్థం, సత్యమే చెప్పడానికి?" అని నేను గంభీరంగా మళ్ళీ ప్రశ్నించా.

మళ్ళీ ఒకమారు అతని మొగంమీద అశాంతి గోచరించింది. ఆ మొగాన్నతడు నావేపుకాకుండా ఆకాశంవేపు ఎత్తాడు.

"నా పిల్లలకోసం నేను నరకకూపంలో కూలమన్నా కూలుతా." అని సమాధానం చెప్పాడు.

సూపరింటెండెంటు హెన్రీడల్లాస్ సింటనక్క మొగంవాడు. నన్ను చాలా అమర్యాదగా చూచి నాతో మాట్లాడడానికే నిరాకరించాడు. విచారణనుగురించిగాని, సాక్ష్యాన్ని గురించిగాని వాడి దగ్గిర్నించి ఒక ముక్కైనా రాబట్టలేకపోయా. కానీ రెండో ఫోర్‌మన్‌ను కలుసుకోవడంతో నా అదృష్టం ఫలించింది. అతను జేమ్సుస్మిత్. అతడిది మొద్దుమొగం. అతన్ని నేను ప్రశ్నపరంపరల్తో చుట్టుముట్టేశాను. అప్పుడు అతన్నిచూచి నాలోనేనే ఎందుకో కుంగిపోయాను. తానూ స్వేచ్ఛగా ప్రవర్తించడానికి వీలులేనిఅభాగ్యుడేనన్న విషయం అతడిమాటలవల్ల తేలింది. అతడు

మాట్లాడే ధోరణినిబట్టి చూస్తే తక్కినవాళ్లకన్నా కొంచెం విజ్ఞాని మాదిరిగా గోచరించాడు. పీటరు డాన్నెలీ చెప్పినట్లుగానే అతడూ జాక్సన్‌కు నష్ట పరిహారం ముట్టాల్సిందేనని నొక్కిచెప్పాడు. మిల్లులో ప్రమాదంచేత దెబ్బ తిన్నవాణ్ని బైటికి గెంటేసి దిక్కులేని బికారిగా చేయడం చాలా అమానుషం, ఘోరం అనికూడా చెప్పాడు. మిల్లుల్లో చాలా ప్రమాదాలు జరుగుతుంటై అనికూడా చెప్పాడు. ఎట్లాగైనాసరే నష్టపరిహారాలు చెల్లించకుండా శాయశక్తులా ప్రయత్నించడమే కంపెనీయొక్క ముఖ్య సిద్ధాంతమని కూడా విశదంచేశాడు.

"అంటే, కంపెనీ భాగస్వాములకు సంవత్సరానికి కొన్ని వందలవేలు ఆదాయమన్న మాట" అన్నాడు. అతడు మాట్లాడుతూంటే మానాన్నకు మొన్నీమధ్యవచ్చిన లాభం; ఆ లాభంపెట్టి నేను కొనుక్కున్న అందమైన గౌను, మా నాన్న కొనుక్కున్న పుస్తకాలూ నాకు జ్ఞాపకంవచ్చినై. నా గౌను రక్తపుమరకలతో కూడుకొన్నదని ఎర్నెస్టు చెప్పినమాట నా మనస్సులో తళుక్కున మెరిసింది. అంతటితో దుస్తుల్లో దాకొన్న నా శరీరం కంపరమెత్తిపోయింది.

"నిన్ను విచారించినప్పుడు, యంత్రాన్ని పాడుకాకుండా చేయడానికి ప్రయత్నించడంలో జాక్సన్ ప్రమాదానికి గురైనాడని సాక్ష్యంలో నీవు చెప్పలేదుగా?"

"ఔను. నేను చెప్పలేదు. అజాగ్రత్తవల్లా అశ్రద్ధవల్లా జాక్సన్ ప్రమాదానికి గురైనాడు. అందుచేత కంపెనీకి ఈప్రమాదంతో ఎటువంటి బాధ్యతలేదు. ఇందులో కంపెనీ తప్పేమీలేదు." అని మొగం అదో రకంగాపెట్టి సమాధానం చెప్పాడు.

"అది అజాగ్రత్తేనంటావా?"

"అజాగ్రత్త అనండి ఇంకేమైనా అనండి. అసలు సంగతేమి టంటే, గంటలకొద్దీ పనిచేస్తే మనిషి అలసిపోతాడు."

నాకతడిలో ఆసక్తి ఎక్కువౌతున్నది. అతడు నిజంగా తక్కినవాళ్ళ కన్నా ఎన్నోరెట్లు గొప్పవాడు.

"తక్కిన కార్మికులకన్నా నీవు బాగా చదువుకొన్నావు" అన్నా.

"వాకిటి కావలితనంచేస్తూ హైస్కూలు చదువుదాకా ఎట్లాగో దేకా. విశ్వవిద్యాలయంలోచేరి చదువుకొందామనుకొన్నా. కానీ మా నాన్న చచ్చిపోవడంతో మిల్లులో పనిచేయడానికి వచ్చా.

"నేను ప్రకృతి పరిశోధకుణ్ణౌదామనుకొన్నా." అని అది తనలో ఒక బలహీనతగా సిగ్గుపడి చెప్పి, "నాకు జంతువులంటే పిచ్చపేర్మి. కానీ మిల్లుల్లోకి వచ్చా. నాకు ఫోర్మన్‌గిరి వచ్చిన తర్వాత పెళ్ళిచేసుకొన్నా. ఇంకేం! కుటుంబభారం మీదపడ్డది. తరువాత...ఇక అక్కణ్ణుంచి నేను పరాధీనుణ్ణయిపోయా." అన్నాడు.

"పరాధీనుణ్ణంటే నీ ఉద్దేశ్యం?" అని ప్రశ్నించా.

"నేను సాక్ష్యంలో అట్లా ఎందుకు చెప్పానో, నేనెందుకు వాళ్ళ సలహా ప్రకారం చెప్పానో, మీరు స్పష్టం చేస్తున్నారుగదూ!"

"ఎవరి సలహా ప్రకారం?"

"కర్నల్ ఇబ్రాహిమ్ సలహా ప్రకారం. నేను సాక్ష్యం ఎట్లా చెప్పాలో ఆయన టూకీగా పాఠం నేర్పాడు."

"మరి అతడి మూలకాన జాక్సన్ కేసుకాస్తా బుడింగుమన్నదన్న మాట."

అతడవునన్నట్లు తలూపాడు. అతడి మొగంలో నెత్తురు నలుపుగు తిరగడం ప్రారంభించింది.

"జాక్సన్ మీద ఆధారపడి బ్రతకాల్సినవాళ్లు పెళ్లాం, ఇద్దరు బిడ్డలున్నారు మరి."

"నాకు తెలుసు" అని, అతడి మొగం నల్లబారిపోతున్నప్పటికీ చాలా ప్రశాంతంగా అన్నాడు.

"నీవు హైస్కూల్లో చదువుకొనేటప్పుడు ఉన్న విధానంలోంచి ఆనాడు కోర్టులో సాక్ష్యం చెప్పవలసిన విధానంలోకి మారిపోవడం నీకు సులభమనిపించిందా? చెప్పు!" అని అతణ్ణి వత్తిడిచేసా.

ఉన్నట్లుండి అతడు రెచ్చిపోయేటప్పటికి నా గుండెలు బేజారెత్తిపోయినై. అతడొక ఘోరమైన ఒట్టేసి, నన్ను కొట్టడానికన్నట్లు గట్టిగా పిడికిలి బిగించాడు.

"నన్ను క్షమించండి!" అని మరుక్షణంలో "అది అనుకున్నంత సులభమైందేమీకాదు. ఇక మీరు ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవచ్చు ననుకుంటా. మీకు నా ద్వారా తెలియాల్సిన సంగతులన్నీ తెలిసినై. మీరిక్కణ్ణుంచి వెళ్లిపోయేముందు నాదొక చిన్న మనవి ఉంది. నేను చెప్పినదంతా మళ్ళీ ఇంకొకళ్లతో చెప్పినందువల్ల మీకు ఒరిగే ప్రయోజనమేమీలేదు. రామ! రామ! నేనసలు చెప్పలేదని బుకాయిస్తా. దీనికి సాక్ష్యం చట్టుబండలూ ఏమీలేదాయె. ఒక్క అక్షరంగూడా నే చెప్పానని ఒప్పుకోను. అంతగావస్తే కోర్టులోప్రమాణంచేసికూడా నే నేపాప మెరుగనని చెప్తా." అన్నాడతడు.

స్మిత్‌ను కలుసుకొని మాట్లాడిన తర్వాత కెమిస్ట్రీ భవనంలో ఉన్న మా నాన్న ఆఫీసుకు వెళ్లా. అక్కడ అనుకోకుండా ఎర్నెస్టు తటస్థమయ్యాడు. ఆయన తన మామూలు ధోరణిలోనే నాతో కరస్పర్శచేసి తన గంభీర నేత్రాల్తో చూచాడు. కిందటిసారి మా మధ్య తుపానులాగా చెలరేగిన వాగ్వాదం పూర్తిగా మరచిపోయినట్లుగా కనిపించాడు. కానీ, నే

నా నాటి సంఘటనను మరచిపోయే స్థితిలో లేను. "నేను జాక్‌సన్ కేసును పరిశీలిస్తున్నా" అని ఊరుకున్నా. ఆయన చాలా ఆసక్తి చూపించాడు. నేనింకా చెప్పబోతానని నిరీక్షించాడు. 'నాకు పూర్వమున్న నమ్మకాలన్నీ దీనితో పూర్తిగా తొలగిపోయినయిలే' అన్నట్లుగా ఆయన చూపుల్లో గమనించా.

"అతణ్ణి చాలా అన్యాయం చేసినట్లు తోచింది నాకు. నేను—నేను—మా ఇంటి దూలాలనుంచి అతడి నెత్తురు కొంచెం వర్షిస్తున్నదనుకొంటున్నా." అని చెప్పుకున్నా.

జాక్‌సన్, ఇంకా అతడి మిత్రులూ కనికరంతో చూడబడినట్లైతే బహుశా ఇంత పెద్దమొత్తాలు లాభాలు రావడానికి ఆస్కారం ఉండదు." అని ఆయన ప్రత్యుత్తర మిచ్చాడు.

"ఇక మళ్లీ నా జన్మలో అందమైన గౌన్లు తొడుక్కొని ఆనందించలేను." అన్నా. నేను నమ్రురాలినైనా. చేసిన పాపానికి నాలో నేను గాఢ దుఃఖభారంతో క్రుంగిపోయా. ఎర్నెస్టు ఒకరకమైన ఫాదర్ కన్ఫెసర్ అన్న తీయని ఆలోచన కలిగింది. ఇక అక్కణ్ణుంచి ఆయన బలం నా మనస్సును లోగొన్నది. ఆ బలం నాకు ప్రశాంతినీ, రక్షణనూ చేకూరుస్తానని వాగ్దానం చేసినట్లనిపించింది.

"కాదు. పోనీ గోనెపట్టలు కట్టుకొనైనా ఆనందించగలుగుతావా అని అడుగుతున్నా. జ్యూట్ మిల్లులు కూడా ఉన్నాయ్. అక్కడా ఇదే తతంగం నడుస్తూంటుంది. ఇక్కడా అక్కడా ఏమిటి ? ఎక్కడ చూచినా ఇదే పరిస్థితి అనుకో. మనం డబ్బాకొట్టుకొనే నాగరికత అంతా మానవుని నెత్తురు మీద ఆధారపడి ఉందే. నెత్తుట్లో బాగా మునిగి తేలిన నాగరికత మనది. నీవుగానీ, నేనుగానీ చివరకు హరిహరబ్రహ్మాదులుగానీ

ఈ నెత్తురు మరకలు కాకుండా తప్పించుకోలేరు. నీవు మాట్లాడిన వాళ్లె వళ్లూ ? ” అని అతడు గంభీరంగా మాట్లాడాడు.

జరిగిందంతా పూసగ్రుచ్చినట్లాయనకు చెప్పేసా.

“ వాళ్లల్లో ఏ ఒక్కడూ స్వేచ్ఛగా బ్రతికే ఏజెంటులేడు. వాళ్ళందరూ పారిశ్రామిక యంత్రరాక్షసి కోరల్లో చిక్కుకొన్న వాళ్ళే. ఇంకా అంతకన్నా మహా ఘోరమేమిటంటే, వాళ్ల జీవతంతువులా యంత్రరాక్షసి చేతుల్లో పగ్గాలై పోయినై. వాళ్లు ఎట్లాగైనాసరే తమ సంతానాన్ని పోషించుకోవాలనే తహతహలాడ్తారు. అది వాళ్ళ సహజాతం. ఈ సహజాతం వాళ్ళల్లో ఉన్న తక్కిన గుణగణాలకన్నా చాలా బలవత్తరమైంది. మానాన్న ! నాకూ, నాతమ్ముళ్లకూ, చెల్లెళ్ళకూ ఇంత భోజనం పెట్టుకోడానికి, అబద్ధాలాడాడు; దొంగతనం చేసాడు; అదీయిదీ ఏమిటీ ! ఎటువంటి అకృత్యానికైనా పాల్పడ్డాడు. ఆయన పారిశ్రామిక యంత్రానికి బానిసై పోయాడు. అది ఆయన జీవితాన్నంతా గుత్తచేసుకొని, గుక్కెడు ప్రాణాలూ హరీ అనేదాకా చాకిరిచేయించుకొంది. ”

“కానీ, మీరో! మీరు తప్పకుండా స్వేచ్ఛాజీవులే.” అని అడ్డుతగిలా.

“ పూర్తిగా స్వేచ్ఛాజీవినిగాను. నా హృదయ తంతువులుమాత్రం యంత్రరాక్షసి చేతుల్లో చిక్కుకోలేదు. నాకింతవరకూ సంతానం చట్టుబండలూ లేనందువల్ల నామటుకు నేనే ఎంతో అదృష్టవంతుణ్ణని మురుసుకొంటున్నా. నాకు పిల్లలంటే పిచ్చిప్రేమ. నేనూ పెళ్ళిచేసుకొంటే మటుకు స్వేచ్ఛాగిచ్ఛా తీసి తుంగలోతొక్కాల్సిందే. ”

“ అది చాలా తప్పుడుసిద్ధాంతం. ”

“ తప్పుడు సిద్ధాంతమన్న సంగతి నాకూ తెలుసు. అయినప్పటికీ ఆ సిద్ధాంతంతప్ప గత్యంతరంలేదు. నేను విప్లవవాదిని. అది నేను విద్యుక్తంగా తొక్కవలసిన ప్రమాదభరితమైన, పంథా.”

అవహేళనాపూర్వకంగా నేనునవ్వా.

"నేను మీనాన్న యింట్లో అర్ధరాత్రి జొరబడి, ఆయనకు సైరియా మిల్సునుంచి వచ్చిన లాభాల్ని దోచుకోడానికి ప్రయత్నిస్తాననుకో అప్పు డాయనేం చేస్తాడు ? "

"ఆయన పడుకొనే పక్క దగ్గరగానే రివాల్వరు పెట్టుకొని మరీ పడుకుంటాడు. బహుశా ఆయన నిన్ను ఉన్న పాళాన కాల్చివేయవచ్చు." అని ప్రత్యుత్తరమిచ్చా.

"మరి, నేనూ, ఇంకొందరూ కలసి 15 లక్షల జనానికి తోడుఇచ్చి డబ్బున్నవాళ్ళందర్నీ కొల్లగొట్టడానికి నాయకత్వం వహిస్తా మనుకో, అప్పుడు ఇంతకన్నా ఎక్కువగా కాల్పులూ గల్లంతూ జరుగుతుంది. ఔనా కాదా ? "

"ఔను. నీవది చేయడంలేదుగా." అని ఆక్షేపణ తెలిపా.

"నేనుచేస్తున్నపనే అది. మేము కేవలం ఇళ్ళల్లోఉన్న ధనాన్ని మాత్రమే తీసుకొందామని అనుకోవడంలేదు. ఆ ధనానికి మూలాధారా లైన సర్వం, అన్నిగనులూ, రైలురోడ్లూ, యంత్రాగారాలూ, బ్యాంకులూ, స్టోర్లూ అన్నీ స్వాధీనంచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాం. విప్లవ మంటే అది. విప్లవం నిజానికి ప్రమాదభూయిష్టమైందే. నేననుకొంటున్న దానికన్నా ఇంకా ఎక్కువ కాల్పులూ గల్లంతూ జరుగవచ్చు. కానీ, ఇందాకచెప్పినట్లుగా ఈరోజెవ్వరూ స్వేచ్ఛాజీవికాడు. మనమందరం పారిశ్రామిక యంత్రపు చక్రాల్లో, ఇరుసుల్లో పడి బైటికి తప్పించుకురాలేక వాటితోపాటే తిరుగుతున్నవాళ్ళమే. నీవూ, నీవు మాట్లాడినవాళ్లూ అట్లా ఇరుక్కుపోయినవాళ్ళేనని నీవే గ్రహించావుకదూ ! వాళ్లల్లో ఇంకా ఎక్కువ మందితో మాట్లాడు. పోయి కర్నల్ ఇన్గ్రామ్నుచూడు. జాక్సన్ కేసు

ప్రచురించకుండా మాపుచేసిన పత్రికావిలేఖర్లనూ, ఆపత్రికలను నడిపే సంపాదకుల్నీ కూడా కలుసుకోని మాట్లాడు. వాళ్ళందరూ యంత్రానికి బానిసలని నీయంతటనీవే తెలుసుకోగల్గుతావు.”

మా సంభాషణ కొంతదూరం సాగినతర్వాత, ‘ప్రమాదాలకుగురయ్యే శ్రామికు లెంతమంది’ అన్న చిన్న ప్రశ్న వేసా. దానికాయన లెక్కలతో సహా ఒక చిన్న ఉపన్యాసం దంచేసాడు.

“ఆ విషయమంతా పుస్తకాల్లో ఉంది. వాటికి లెక్కలుకూడా సమకూర్చారు. పొద్దుటి గంటల్లో జరిగే ప్రమాదాలు చాలా తక్కువనీ కానీ గంటలు గడిచినకొద్దీ శారీరకంగా, మానసికంగా గూడా అలుపుపుట్టి కార్మికులు పనిలో వెనకాడేపరిస్థితి ఏర్పడినకొద్దీ ప్రమాదాలు ఎక్కువ సంభవిస్తున్నయ్ అనీ సారాంశం తేల్చి నిర్ధారించాడు.

“అందాకా ఎందుకూ. ఒక కార్మికుడికన్నా మీనాన్న జీవితానికి, కనీసం కాలివ్రేలికికూడా ప్రమాదంజరగకుండా సురక్షితంగా ఉంచడానికి మూడురెట్లు ఎక్కువ శ్రద్ధతీసుకుండే అవకాశాలున్నయ్ అన్న సంగతి నీకు తెలుసా? ఆయన కటువంటి అవకాశాలున్నయ్. ఇన్సూరెన్సుకంపెనీల కావిషయం తెలుసు. వెయ్యిడాలర్ల ప్రమాదానికి భీమాచేస్తే, భీమా కంపెనీవాళ్లు మీనాన్నను సంవత్సరానికి నాల్గు డాలర్ల ఇరవైసెంట్లు చెల్లించాలని నిర్ణయిస్తారు. అదే మొత్తానికి ఒక కార్మికుడు భీమాచేస్తే అతణ్ణి పది హేను డాలర్లు చెల్లించమంటారు.”

“మరి నీవో?” అని అడిగా. నేనీప్రశ్న తృణీకార భావంతో వేసానని అనుకొంటాడేమోనని వ్యాకులత చెందా.

“ఓ! నేను విప్లవకారుణ్ణి కావడంవల్ల నాకు కార్మికుడికన్నా ఎనిమిదిరెట్లెక్కువగా ప్రమాదాలు సంభవించడానికిగానీ, చంపబడటానికి

గానీ అవకాశాలున్నయ్. మామూలు కార్మికుడికన్నా, బాగా తర్ఫీదు పొంది ఆరితేరి, ప్రేలుడు పరికరాలు తయారుచేసే ప్రసిద్ధ రసాయన శాస్త్ర వేత్తలవద్ద ఇన్సూరెన్సుకంపెనీ ఎనిమిదిరెట్లెక్కువ వసూలుచేస్తుంది. వాళ్లు నన్ను భీమాచేయడానికసలంగీకరించరనుకొంటా. ఈ ప్రశ్నెందుకు వేసావ్ ?" అని అతడు చాలా నిర్లక్ష్యంగా సమాధానంచెప్పాడు.

నాకళ్లు రెపరెప కొట్టుకున్నయ్. నా మొగంలో నెత్తురు తుకతుక లాడిపోయింది. వ్యాకులత్వంలో ఆయన నన్ను బంధించినందునగాదు, నాఅంతట నేనే, అందులో, ఆయన ఎట్టఎదుట బంధించుకొన్నా.

అప్పుడే మా నాన్న లోపలికివచ్చి, నాతో గూడా బైలుదేరి వెళ్లడానికి తగిన సన్నాహంలో ఉన్నాడు. ఎర్నెస్టు, తానిదివరకు అడిగి తీసుకు వెళ్ళిన పుస్తకాలు తిరిగిచ్చేసి మొట్టమొదటగా వెళ్ళిపోయాడు. పోతూ పోతూ ఒకసారి వెనక్కు తిరిగి,

"ఓ! అన్నట్లు నీ మనశ్శాంతిని నీవూ, బిషప్ మూర్ హౌస్ మనశ్శాంతిని నేనూ ఎట్లాగూ చెడగొట్తున్నామనుకో. అందు కోసమని నీవొకసారి మిస్. విక్సన్, మిస్. పెర్టన్వైట్నూ కలుసుకోవడం మంచిదనిపిస్తున్నది. వాళ్ల భర్తలు మిల్లుల్లో ప్రధాన భాగస్వాములని నీకూ తెలుసుగా. తక్కిన మానవజాతి మాదిరిగానే ఆ ఇద్దరు స్త్రీలు గూడా యంత్రానికి బంధింపబడ్డవాళ్ళే. కానీ, వాళ్లు ఆ యంత్రం నెత్తిమీదనే కూర్చుండేటట్లుగా వాళ్లు బంధింపబడ్డారు." అన్నాడు.

## ౪

జాక్‌సన్ చేతిని గూర్చి ఆలోచించినకొద్దీ నేను కంపించిపోవడం మొదలుపెట్టా. మొట్టమొదటిసారిగా నేను జీవితాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నా. నా విశ్వవిద్యాలయ జీవితం, చదువూ, సంస్కృతీ వట్టిబూటకాలు. సాంఘిక, జీవిత సిద్ధాంతాలుతప్ప నేను నేర్చుకొన్నదేమీలేదు. పుస్తకాల్లో చదువుతూంటే అంతా బాగానే ఉన్నట్లుండేది. కానీ ఇప్పుడు నేను యథార్థజీవితాన్ని దర్శిస్తున్నా. జాక్‌సన్ చేయి జీవితంలోని ఒక నగ్నసత్యం. "సత్యం – మనుష్యుడు – మానవుడు నగ్నసత్యం!" అన్న ఎర్నెస్టు ప్రవచనం నా ఆత్మలో ప్రతిధ్వనిస్తోంది.

మన సంఘమంతా నెత్తురుమీద ఆధారపడి ఉందన్న విషయం భయంకరం, దుస్సాధ్యం. ఐనా, అడుగో జాక్‌సన్ కనపడ్తూనే ఉన్నాడుగా. నేనతణ్ణి వదిలించుకోలేకుండా ఉన్నా.

అతణ్ని చాలా అమానుషంగా చూచారు. ఇంకా ఎక్కువ మొత్తాలు లాభాలు సంపాదించడంకోసమని, అతడోడ్చిన పవిత్రరక్తానికి వాళ్లు నష్టపరిహారం చెల్లించలేదు. ఆ మొత్తం లాభాలను పంచుకొని ఆనందంగా విహరించే కుటుంబాలన్నీ నాకు తెలుసు. ఆ లాభాలు జాక్‌సన్ రక్తం పిండుకొని సంపాదించినవి. ఒక్కణ్ణే అంత అమానుషంగా చూస్తే, సంఘం తనకేమీ పట్టనట్లుగా తన మామూలు ధోరణిలో తను పోతున్నప్పుడు, ఇంకా ఎంతమందిని అమానుషంగా చూడగూడదు? ఎర్నెస్టు ఆ రోజు వర్ణించిచెప్పిన, చికాగో మిల్లుల్లో వారానికి 90 సెంట్లుకోసమని పనిచేసే స్త్రీలూ, ప్రత్తి యంత్రాల్లో పనిచేసే పిల్లలూ జ్ఞాపకం వచ్చారు. నెత్తురులేక పాలిపోయిన వాళ్ల చేతులు నా కళ్ళకు కనపడుతున్నయ్. వాళ్ల

నెత్తురు త్రాగే తాన్లకుతాన్లు గుడ్డలు తయారౌతున్నయ్. ఆ తాన్లలోదే నా యీ గౌను కూడా. తరువాత సైయరా మిల్లులు, వాటివల్ల వచ్చిన లాభాలూ గుర్తుకు వచ్చినై. నా గౌనుమీద జాక్సన్ నెత్తురుకూడా కనపడ్డది. జాక్సన్‌నుంచి నేను తప్పించుకోలేను. నా కెప్పుడూ అతని ధ్యానమే అయింది.

నా అంతరాంతరాల్లో నే నేమైనా కొండ చిట్టచివర నుంచున్నానా అనిపిస్తోంది. భయంకరమైన క్రొత్త జీవితాన్నొకదాన్ని దర్శించబోతున్నాను. నే నొక్కదాన్నే గాదు. నా మొత్తం ప్రపంచమే తల్లక్రిందులౌతోంది. మా నాన్నొకడున్నాడు. ఆయన మీద ఎర్నెస్టు ప్రభావం ఎట్లా పడ్తున్నదో గమనిస్తున్నా. మరి బిషప్పొకడు. క్రిందటి దఫా నే నాయన్ని చూచినప్పుడు ఏదో మాదిరిగా ఉన్నాడు. చాలా ఉద్రేకపూరితుడుగా ఉన్నాడు. ఆయన కళ్ళలో చెప్పరాని భయంకరమైన ఆందోళన చూచా. నేను విన్నదాన్నిబట్టి నాకు తెలిసినవిషయమేమిటంటే, ఎర్నెస్టు తానిదివరకు చేసిన వాగ్దానం ప్రకారం ఆయన్ను వెంటబెట్టుకొని ప్రత్యక్ష నరకకూపాలు చూపిస్తున్నాడు. బిషప్ ఎటువంటి నరకకూపాల్ని దర్శించాడోమటుకు నాకు తెలియదు. ఎందుకంటే, వాటినిగూర్చి చెప్పడానికి వీలుకానట్లుగా ఆయన దెబ్బతిన్నాడు.

నా చిన్న ప్రపంచంతోసహా మొత్తం ప్రపంచం తల్లక్రిందులై పోతున్నదన్న భావం నాలో వేళ్లు పాతుకుపోయేటప్పటికి దీనికంతా కారకుడు ఎర్నెస్టు అని తీర్మానించుకున్నా.

“ఆయనరాకపూర్వం మే మంతా సంతోషంగా ప్రశాంతంగా ఉన్నాం” అనికూడా అనుకొన్నా. మరుక్షణంలోనే నా యీ భావన సత్యానికి విద్రోహకరమైందని గుర్తించా. అణగారిపోయి అనాధులైన అభాగ్యజీవుల సహాయార్థం, సత్యం—న్యాయంకోసం పరిశ్రమించే, సత్యాన్ని

నిరూపించే, నిర్భయమైన ప్రకాశవంతాలైన నేత్రాల్లో మూర్తీభవించిన సత్యంలాగా నాకు ఏర్నెస్టు సాక్షాత్కరించాడు. వెంటనే క్రీస్తు మూర్తి గూడా గోచరించింది. ఆయనా అనాథజీవులకోసం, మతాచార్యుల మౌఢ్య నిర్మూలనంకోసం తన జీవితాన్ని అంకితం చేసాడు. ఆయన జీవితం క్రాసుతో సమాప్తమైందన్న విషయం జ్ఞాపకంవచ్చింది. ఏర్నెస్టు విషయం తలుచుకునేటప్పటికల్లా నా గుండె గుబుక్కుమంది. నా హృదయంలో వ్యథ బైలుదేరింది. ఈయనకు కూడా క్రాసే శరణ్యమా ఏమి! మేఘంలా గర్జించే మహోత్సాహపూరితుడైన ఈయనకోసం కూడా క్రాసు ఎదురు చూస్తోందా ఏమి?

నేనాయన్ని గాఢంగా ప్రేమిస్తున్నానని ఆక్షణంలో నాకు తెలుసు. ఆయనకు సర్వసౌకర్యాలు చేకూర్చాలనే కోరికతో నాహృదయం రసార్ద్రమౌతోంది. ఆయన జీవితాన్ని గూర్చి ఆలోచించా. అది చాలా కఠిన దరిద్ర, నిర్భాగ్య జీవితమై ఉండాలి. ఆయనకోసం, అబద్ధాలాడి, దొంగిలించి, చచ్చేదాకా రెక్కలు ముక్కలుచేసుకొన్న వాళ్ళ నాన్న విషయం ఆలోచించా. ఆయన పదోఏటనే స్వయంగా మిల్లుల్లో పనిచేయడానికి పోయాడు! ఆయనచుట్టూ నాచేతులు మెలేసి, అనేక ఆలోచనల్తో అలసిపోయిన ఆయన తలను నాగుండెకు గాఢంగా హత్తుకొందామనీ, ఆయనకు కొంచెంసేపు విశ్రాంతినిచ్చి, కష్టాలన్నీ మరిచిపోయేటట్టు చేసి, సుఖాన్నిద్దామనీ నా హృదయం ఉవ్విళ్ళూరుతోంది.

చర్చి ఆహ్వానంలో నేను కర్నల్ ఇన్గ్రామ్సును కలుసుకొన్నా. ఆయన్ను నేను చాలా సంవత్సరాలనుంచీ బాగా ఎరుగుదును. తాను బుట్టలో పడ్డానన్న విషయం ఆయనకు తెలియకుండానే అయన్ని నేను తాడిచెట్లూ రబ్బరుచెట్లూ ఉన్నతోపులో బుట్టలోవేసుకొన్నా. ఆయన నన్ను పెద్ద

హుందాతనంతో కలుసుకొన్నాడు. ఆయన చాలా లౌకికుడు. హుందాతనంగలవాడు. వెనకా ముందూ ఆలోచనగలవాడు. మా సంఘంలో ఆయన చాలా ప్రఖ్యాతవ్యక్తి. ఆయనముందు అంతటి విశ్వవిద్యాలయాధ్యక్షుడుకూడా తీసికట్టుగా గోచరించాడు.

ఐనప్పటికీ కర్నల్ ఇన్గ్రామ్‌కూడా నాకు తక్కిన పారిశ్రామికులు మాదిరిగానే కనిపించాడు. ఆయన స్వేచ్ఛాజీవి కాడు. ఆయనా యంత్ర చక్రానికి కట్టివేయబడ్డవాడే. నేను జాక్సన్ కేసునుగూర్చి ఆయనతో మాట్లాడినప్పుడు, ఆయనలో కలిగిన మార్పును నేనెప్పటికీ మరచిపోలేను. చిరునవ్వుతో ఉండే ఆయన ప్రకృతి, భూతంలాగా అదృశ్యమైపోయింది. కళకళలాడే ఆయన మొగంమీద ఉన్నట్లుండి భీతి గోచరించింది. జేమ్సు స్మిత్ తెగబడి మాట్లాడినప్పుడు నేనెట్లా గాభరాపడ్డానో ఇప్పుడూ అట్లాగే అయిపోయా. కానీ కర్నల్ ఇన్గ్రామ్ అతడిమాదిరిగా బూతులుతిట్టలేదు. శ్రామికుడికీ, ఆయనకూ ఉన్న కొద్దిభేదంఅదే. చాలా చమత్కారంగా మాట్లాడేవాడన్న పేరుందాయనకు. కానీ ఆ చమత్కారం గిమత్కారం ఇప్పుడాయన్లో లేవు. ఆయనకు తెలియకుండానే నానుంచి తప్పించుకుపోవడానికి అటూయిటూ మార్గం కోసం చూచాడు. కానీ తాటిబొందల్లో, రబ్బరుచెట్ల గుంపుల్లో ఆయన్ని నేను బంధీచేసా.

ఓహో! జాక్సన్ పేరు వినబడేటప్పటికల్లా ఆయన బిత్తరపోయాడు. నేనా విషయాన్నెందుకు కదిలించానబ్బా? నా ఛలోక్తిని ఆయన స్వీకరించలేక పోయాడు. నాది చాలా అనాలోచితమైన చౌకబారు అభిరుచి. ఆయన ఉద్యోగంలో వ్యక్తిగతమైన భావాలు లెక్కకురావన్న సంగతి నాకు తెలియదా? ఆఫీసుకుపోయేటప్పుడు ఆయన వ్యక్తిగత భావాల్ని ఇంట్లోనే దిగవిడిచిపోతాడు. ఆఫీసులో ఉన్నంతకాలం ఉద్యోగానికి సంబంధించిన భావాల్తోనే ఉంటాడు.

"జాక్సన్‌కు నష్టపరిహారం ముట్టాల్సిందేనా ?" అని అడిగా.

"తప్పకుండా. అది నా వ్యక్తిగతాభిప్రాయం. కానీ కేసుకు సంబంధించిన న్యాయందృష్ట్యా, దానికి సంబంధంలేదు." చెల్లాచెదరై పారిపోయిన ఛలోక్తుల్ని మళ్ళీ క్రమక్రమంగా అదుపులోకి తెచ్చుకొంటున్నాడు.

"న్యాయ శాస్త్రానికీ, ధర్మానికీ ఏమన్నా సంబంధంఉందా చెప్పండి!" అని అడిగా.

"నీవు చెప్పినమాటలో మొదటి రెండక్షరాలు కొంచెం సరిదిద్దుకోవాలి ?" అంటూ చిరునవ్వుతో మాట్లాడాడు.

"బలానికీ ?" అన్నా. ఔనని తలూపాడు. "ఐనప్పటికీ, న్యాయశాస్త్రంరీత్యా న్యాయాన్ని కలిగించాలికదూ ?"

"అక్కణ్ణేఉంది విరుద్ధం. మనం తప్పకుండా న్యాయాన్ని పొందుతాం" అని తిరుగుసమాధానం చెప్పాడు.

"మీరిప్పుడుద్యోగరీత్యా మాట్లాడుతున్నారు, కాదూ ?" అన్నా. కర్నల్ ఇన్గ్రామ్ ఈదెబ్బతో నిజంగా సిగ్గుపడ్డాడు. అక్కణ్ణుంచి తప్పించుకుపోవడానికి ఇటూఅటూ ఒకసారి ఆతుర్దాగా చూచాడు. కానీ ఆయన మార్గం అరికట్టేసా. ఒక్కడుగుకూడా కదల్చడానికి వీల్లేకుండా చేసేసా.

"ఒకవ్యక్తి, తనవ్యక్తిగతాభిప్రాయాల్ని ఉద్యోగాభిప్రాయాలకోసం బలిచేయడం ఆత్మహత్యలాంటిదికదూ, చెప్పండి ?"

నాకు సమాధానంరాలేదు. కర్నల్ ఇన్గ్రామ్ నోటమాట పెకల్లేదు. (తప్పించుకుపోడానికి వీలుకాక చేతులు పెల్లకీలేశాడు) నేను తర్వాత వార్తా పత్రికల్ను గూర్చి విచారించా. నేను జాక్సన్ కేసును గూర్చి ఏ విధమైన ఒడుదుడుకులులేకుండా నిష్పాక్షికంగా వ్రాసిపంపా. నే నింతకుముందు మాట్లాడిన వ్యక్తులమీద ఎటువంటి నేరారోపణలూ చేయలేదు. ఆ మాటకేవస్తే, నేనసలు వాళ్ల పేర్లుగూడా ఉదాహరించలేదు. జాక్సన్

చాలా సంవత్సరాలుగా మిల్లులో పనిచేయడం, యంత్రానికి దెబ్బతగలకుండా అతడు చేసిన ప్రయత్నం, అందువల్ల అతనికి కలిగిన ప్రమాదం, ఇప్పుడతడు అనుభవిస్తున్న దుర్భర నికృష్టజీవితం మొదలైనవి ఉన్నవి ఉన్నట్లుగా వ్రాసా. స్థానికంగా ఉన్న వార్తా దినపత్రికలు మూడూ, అట్లాగే రెండు వార పత్రికలూ నా వ్యాసాన్ని ప్రచురించడానికి నిరాకరించినై.

నేను పెర్సిలేటన్‌ను పట్టుకొన్నా. అతడు విశ్వవిద్యాలయ పట్ట భద్రుడు. జర్నలిజంలో అభిరుచికలిగి, ఆ మూడు వార్తాపత్రికల్లో మంచి పలుకుబడి సంపాదించిన ఒక పత్రికలో విలేఖరిగా పనిచేస్తూ అనుభవం సంపాదిస్తున్నాడు. జాక్‌సన్‌ను గూర్చిగాని అతడి కేసును గూర్చిగాని ఒక్క వాక్యం కూడా ప్రచురించకుండా నా వ్యాసాన్ని బుట్టదాఖలు చేయడానికి గల కారణమేమిటని, నేనతణ్ణి అడిగినప్పుడు, అతడొక చిరునవ్వు నవ్వాడు.

" సంపాదకీయ విధానంతో మాకేం నిమిత్తంలేదు. అది సంపాదకుల పని. " అని అతడన్నాడు.

" కానీ, అదేం విధానం? " అన్నా.

" మేమంతా కార్పోరేషన్లతో కట్టుబడి ఉన్నాం. ప్రకటనకిచ్చే డబ్బిచ్చినా, అటువంటి విషయాలు ప్రచురించం. ఎవడైనా అటువంటి దాన్ని పత్రికలో వేయడానికి దొంగతనంగా ప్రయత్నిస్తే ఉద్యోగానికి నీళ్లు వదులుకోవాల్సిందే. సామాన్యమైన ప్రకటనలకిచ్చేదానికన్నా పది రెట్లెక్కువ చెల్లించినా అటువంటి విషయంలో అక్షరమొక్కటైనా అచ్చు కాదు. '' అని సమాధానం చెప్పాడు.

" ఇక మీ విధానం ఏమిటి ? కార్పోరేషన్లకు దాసోహమనే మీ యజమాన్ల ఆజ్ఞల ప్రకారం, సత్యాన్ని రూపం మార్చివ్రాస్తూ ఉండటమే మీ ఉద్యోగం అనుకుంటా. " అన్నా.

"నాకు దానితో ఏమీ సంబంధంలేదు." అని ఆయన కొంచెం ఇరుకున పడ్డట్టై, ఇంతలోకే ఉపాయం తట్టడం మూలకాన మళ్ళీ తేరుకొని, "నా మటుకు నేను అబద్ధాలు వ్రాయను. నా పద్ధతి గోడమీద పిల్లివాటం. నేను రోజూచేసేపనిలో చాలా అంకఛండాలం ఉండేమాట నిజమేననుకోండి. కానీ, చూసారూ! అది నిత్యవ్యవహారంలో ఒక భాగం. అంతే." అని అమాయకంగా ముగించాడు.

"ఐనప్పటికీ మీ రేదో ఒకరోజు సంపాదకుడిస్థాన మాక్రమించుకొని ఒక విధానాన్ని అమలుపరుద్దామనుకొంటున్నారుకదూ?" అన్నా.

"అప్పటికి బాగా ధక్కాముక్కీలు తిని రాటుతేలిపోతా." అని సమాధానం చెప్పాడు.

"మీ రింకా ఇప్పటికి రాటుతేలకపోవడంచేత మిమ్మల్నొక్క ప్రశ్న అడుగుతా చెప్పండి. సామాన్య సంపాదకీయ విధానంలో మీకేది మంచిదని తోస్తోంది?"

"నేనాలోచించాను. జర్నలిజం జయంపొందబోతున్న సమయంలో ఎవడూ తన నెత్తికి తాను చేతులు తెచ్చుకోడు. నేను కనీస మా విషయ మైనా నేర్చుకొన్నా." అని తక్షణమే సమాధానంచెప్పి తన లేత బుర్రను వెర్రి మొర్రిగా ఊపాడు.

"మరి, మంచి సంగతేమంటావ్?" అని గుచ్చి అడిగా.

"మీ కీ తతంగం అర్థంకాదు. అంతా సక్రమంగా నిర్వహింపబడు తున్నదికాబట్టి అదే మంచిది. అర్థమైందా?"

"అగమ్యగోచరంగా ఉంది." అని గొణిగా. కానీ పొంగులువారు తున్న ఆయన యౌవ్వనానికి నా హృదయం ఖేదపడటం మొదలుపెట్టింది. బావురుమని వలవలా ఏడుద్దామనిపించింది.

నే నింతవరకూ అంటిపెట్టుకొని జీవిస్తున్న సంఘస్వరూపాన్నీ, ఆ సంఘం చాటున దాగుడుమూతలాడుతున్న భయంకరమైన కఠోరసత్యాల్నీ కనుక్కోవడం ప్రారంభించా. జాక్సన్కు వ్యతిరేకంగా (ఉద్దేశ్యపూర్వకమైన) కుట్రఉన్నట్లు తోచింది. అతడి కేసును శాయశక్తులా వాదించిన నచ్చుట్లుగొట్టే ఆ న్యాయవాదిని తలచుకొనేటప్పటికి నాకు 'పాపం' అనిపించి సానుభూతి ఏర్పడ్డది. కానీ ఈ కుట్ర మరీ పెద్దదిగా పరిణమించింది. అది కేవలం ఒక్క జాక్సన్ ను మనస్సులో పెట్టుకొని పన్నిన కుట్రగాదు. మిల్లుల్లో పనిచేసే ప్రతి ఒక్క శ్రామికునిపైనా పన్నినకుట్ర అది. యంత్రాల్లో పనిచేసే ప్రతివ్యక్తిమీదా ఐతే, తక్కిన యంత్రాల్లో, కర్మాగారాల్లో పనిచేసే ప్రతివ్యక్తిమీదా ఎందుక్కాగూడదు? అన్ని పారిశ్రామిక సంస్థలవిషయం కూడా నిజంగా ఇంతేకాదా!..

అదే అయినట్లైతే, సంఘం అనేమాట పచ్చి అబద్ధం. నా స్వయం నిర్ణయాలనుంచి నేను వెనక్కి తగ్గా. అది నిజం కాలేనంత భయంకరమైంది. కానీ, అదిగో జాక్సన్ ఉన్నాడే — జాక్సన్ విరిగినచేయి ఉన్నదిగా. నా ఇంటికప్పుమీదినుంచి వర్షించి నా గౌన్ను మరకలుచేసిన నెత్తురున్నదే— జాక్సనే స్వయంగా చెప్పినట్లుగా, ఇంకా చాలామంది జాక్సన్లు ఉన్నారు. యంత్రాగారాల్లోనే కొన్ని వందలమంది ఉన్నారు. జాక్సన్ నుంచి నేను తప్పించుకుపోలేను.

సిరియా యంత్రాగారాల్లో ఎక్కువభాగం పెట్టుబడి పెట్టిన విక్సన్నూ, పెర్టన్వైట్నూ చూచా. వాళ్ల కంపెనీల్లో ఉద్యోగంచేస్తున్న కార్మికులతో కరస్పర్శ చేసినట్లుగా, నేను వాళ్ళతో కరస్పర్శ చేయలేదు. సంఘంలో తక్కినవాళ్ళకన్నా తాము గొప్పవాళ్ళమనే నిక్కు వాళ్ళల్లో ఉన్నదని గ్రహించా. ఆ నిక్కు కులీనులమనే భావానికి సంబంధించిదని

నేను పిలుస్తా. వాళ్లు సిద్ధాంత విశాలదృక్పథాన్ని గూర్చి మాట్లాడారు. వాళ్లు సిద్ధాంతాన్నీ, న్యాయాన్నీ ఒకే గాటన కట్టేశారు. నా చిన్న వయస్సునూ, నా అనుభవశూన్యత్వాన్నీ సానుభూతితో చూస్తూ, పితృ వాత్సల్యంతో వాళ్లు నాతో మాట్లాడారు. నేను నా సమాచార సేకరణ కోసం కలుసుకున్న వాళ్ళందర్లోకి వాళ్ళు పట్టి నిష్ప్రయోజకులు. వాళ్ల ప్రవర్తన చాలా సక్రమమైనదేనని వాళ్లు పూర్తి నమ్మకంలో ఉన్నారు. దాన్ని గురించి తిరుగు ప్రశ్నలేదు. వివాదం అంతకుముందే లేదు. వాళ్లకి తామే సంఘ సంరక్షకులమనీ, చాలామంది సుఖజీవనం చేయడానికి కూడా తామే కారణమనీ వాళ్ల విశ్వాసం. తామే ఇంత ఉద్యోగం ఇచ్చి, జీవనాధారం చూపించకపోయినట్లైతే కార్మికవర్గం ఎటువంటి దుర్భర నికృష్టజీవితం గడపవలసి వచ్చేదో గుండెకరిగే చిత్రణ ఇచ్చారు.

వీళ్లిద్దర్నీ కలుసుకున్న వెంటనే ఎర్నెస్టును కలుసుకొని నా అనుభవాన్ని పూసగ్రుచ్చినట్లు చెప్పా. ఆయన సంతృప్తితో నావేపుచూసి, "నిజంగా ఇది చాలా మంచిపని. నీవే స్వయంగా నిజాన్ని తరచి చూస్తున్నావ్. ఇది నీ స్వానుభవంద్వారా తేల్చుకొన్న సర్వసాధారణ విషయం. ఇది సరైందికూడా. ఒక్క పెట్టుబడిదారుడు తప్పించి, పారిశ్రామిక యంత్రానికి సంబంధించిన ఏ ఒక్క వ్యక్తీ స్వేచ్ఛాభావజీవి కాడు. ఈ యజమానులు తాము చేస్తున్నది సక్రమమైందనే త్రికరణశుద్ధిగా విశ్వసిస్తున్నారన్న విషయం నీకు తెలిసింది. మొత్తం పరిస్థితిలో ఉన్న ప్రధానమైన అసంగతం అదే. తాము చేసేది సరైందని అనుకోకపోతే ఒక్కపనికూడా చేయలేనంతగా మానవ ప్రకృతిలో బాగా బంధింపబడ్డారు. వాళ్ళుచేసే పనకి వాళ్ళకు ఆమోదం కావాలి.

వాళ్లు వ్యాపారంలో ఏదైనా పనిచేయాలనుకొంటే, వాళ్ల బుర్రల్లో, ఎట్లాగో ఒకట్లా మతసంబంధమైనగానీ, నైతిక సంబంధంగాగానీ, శాస్త్రీయ

సంబంధంగాగానీ, లేకపోతే వేదాంత సంబంధమైనాగానీ తాముచేసేది సక్రమమైందనే భావన వచ్చేదాకా అట్లా ఉండాల్సిందే. ఆ ఊహ వచ్చిన తర్వాత కోరిక, భావనకు మూలకందం అన్న మానవతత్వ బలహీనతను గుర్తించకుండానే, ఇంక వెనకా ముందు ఆడకుండా వాళ్లు చేయదలచు కొన్నదేదో చేసేస్తారు. వాళ్లు చేయదలచుకొన్నా దాన్ని దాంతో నిమిత్తం లేకుండానే అంగీకారం లభిస్తుంది. వాళ్లు లోతుకుదిగి ఆలోచించని ధర్మాధర్మ నిర్ణేతలు. వాళ్లు కపటాత్ములు. తప్పుచేస్తూపోతే, ఒప్పు దానంతటదే వస్తుందనేంతవరకూ వాళ్ళ దృష్టిపోతోంది. స్వేచ్ఛలో, సామర్థ్యంలో తక్కిన మానవజాతికన్నా తామే సర్వాధికులమనే మనోహరమైన ప్రత్యక్ష సత్య సిద్ధాంతాత్మకమైన కల్పన, వాళ్లు నిర్మించుకొన్నవాటిల్లో ఒకటి. దాని ద్వారానే తక్కిన మానవజాతికి కూడూ, గుడ్డా ఇచ్చి పోషించాలనే అనుమతి వస్తుంది. వాళ్ళు 'నా విష్ణుః పృధివీపతిః' అనే పాత సిద్ధాంతాన్ని పునస్థాపన చేసారు. వాళ్ళ దృష్టిలో రాజులంటే వాణిజ్య ప్రభువులు.

ఉన్న బలహీనతంతా, వాళ్లు కేవలం వ్యాపారదృష్టికలవాళ్లు కావడమే. వాళ్లు తాత్వికులూ కారు, జీవశాస్త్రజ్ఞులూ కారు. సాంఘికవేత్తలు కూడా కారు. వాళ్ళదేగనక అయినట్లైతే అంతా బాగానే ఉంటుంది. వ్యాపారదృష్టికలవాడు, జీవశాస్త్రజ్ఞుడూ, సాంఘికవేత్తాగనక అయినట్లైతే, మానవజాతికి చేయవలసిన సరైనవిధానాన్ని ఇంచుమించుగా తెలుసుకుంటాడు. వాణిజ్య ప్రపంచాన్ని వదిలితే వీళ్లు ఎందుకూ పనికిరాని చచ్చు దద్దమ్మలు. వాళ్ళకు వ్యాపార విషయం ఒక్కటే తెలుసు. వాళ్ళకు మానవజాతిని గూర్చి, సంఘాన్ని గూర్చి లేశంకూడా తెలియదు. ఐనప్పటికీ ఆకటిచే అలమటించే అశేష ప్రజానీకంయొక్క, తదితర ప్రజానీకంయొక్క

అదృష్టాన్ని నిర్ణయించే మధ్యవర్తులుగా తయారౌతారు. ఒకనాడు చరిత్ర వాళ్ళనుచూచి భీకరవికటాట్టహాసం చేస్తుంది. '' అన్నాడు.

Mrs. వికసన్, Mrs. పెర్టన్ వైత్‌లతో మాట్లాడినప్పుడు నాకేమీ ఆశ్చర్యమనిపించలేదు. వాళ్లు అసూర్యంపశ్యలు. వాళ్ళ ఇళ్లు దేవేంద్ర భవనాలు. కొండలోయల్లో సరస్తీరాల్లో, సముద్రతీరాల్లో ఎక్కడబడితే అక్కడ వాళ్ళకు దేశమంతటా ఇళ్లున్నాయ్. వాళ్లు విశ్వవిద్యాలయానికి చర్చిలకు అభిమానులు. పోషకులు, ప్రత్యేకంగా మతబోధకులు వాళ్ల యెదుట దాసానుదాసులై మోకరిస్తారు. ఈ ఇద్దరు స్త్రీలూ అధికారం రూపంధరించినవాళ్లు. వాళ్లకున్న డబ్బుకేం లెక్క. వాళ్లు ధనం యిచ్చి భావాలు కొనే శక్తికలవాళ్లనడం కొంతవరకు నిజమే. ఆ విషయాన్నే నేను తొందర్లో ఎర్నెస్టుదగ్గిర శుశ్రూషచేసి నేర్చుకోబోతున్నా.

వాళ్లు, వాళ్లభర్తల్ని అర్థంలేకుండా అనుకరించారు. ధనవంతుల సిద్ధాంతాన్ని, వాళ్లుచేయవలసిన విధుల్ని, వాళ్లబాధ్యతల్నిగూర్చి వాళ్ల భర్తలమాదిరిగానే వాళ్ళూ మాట్లాడారు. వాళ్ల వర్గానికి సంబంధించిన ఏ నీతి శాస్త్రానికి, వాళ్ల భర్తలు లొంగిపోయార్లో వాళ్లూ దానికే దాసోహ మన్నారు. తమకే అర్థంగాని ఆడంబర శబ్దజాలంలో వాళ్లు మాట్లాడారు.

జాక్‌సన్ కుటుంబంయొక్క నికృష్టపరిస్థితుల్నిగూర్చి వాళ్ళకు నేను చెప్పినప్పుడు, అతనికి ఏవిధమైన జీవనోపాధిచూపించలేదని నేను ఆశ్చర్య పడ్డప్పుడు వాళ్లు తారామండలంగా లేచారు. తాము చేయవలసిన సాంఘిక కృత్యాల్లో ఎవళ్లేసలహాలిచ్చినా, తాము వాళ్ల నభినందించమని నాతో చెప్పారు. జాక్‌సన్‌కు సహాయంచేయమని నేను వాళ్లను నిక్కచ్చిగా అడిగితే, వాళ్లు దాన్ని కచ్చితంగా నిరాకరించారు. అన్నిటికన్నా ఆశ్చర్య మైన విషయమేమిటంటే, నేను వాళ్ళిద్దర్నీ ప్రత్యేక ప్రత్యేకంగా కలుసు

కొన్నప్పటికీ, నేనొక్కర్ని చూచానని గానీ, చూడబోతున్నానని గానీ వాళ్లిద్దర్లో ఏ ఒక్కరికీ తెలియకపోయినప్పటికీ, వాళ్లిద్దరూ పాఠం వప్పజెప్పినట్లుగా ఒకే రకమైన భాషలో నా కోర్కెను నిరాకరించారు.

అజాగ్రత్తకు తాము ఏ విధమైన బహుమానాలు ఎప్పుడూ ఇవ్వబోమని, అదీ కాక ప్రమాదాలకు నష్టపరిహారాలు చెల్లించడం ద్వారా యంత్రాల్లో తమంతటతామే స్వయంగా ప్రమాదాలు కొనితెచ్చుకొనేటట్లు బీదవాళ్ళకు ఆశ చూపించడంగానీ తాము చేయబోమని స్పష్టంగాచెప్పే అవకాశం కలిగినందుకు, ఎంతగానో అభినందిస్తున్నామనీ ఇద్దరూ తేల్చిన సారాంశం.

అయినా ఈ ఇద్దరు స్త్రీలూ నిష్కపటులే. తామూ, తమవర్గం గొప్పదనే నమ్మకం వాళ్ళ నరనరాల్లో జీర్ణించుకుపోయింది. వాళ్ళుచేసే ప్రతిపనికీ వాళ్ల వర్గానికి సంబంధించిన నీతిశాస్త్రం ఆమోదముద్ర వేస్తుంది. నేను Mrs. పెట్టన్ వైట్ భవనంనుంచి బైటికివచ్చి కొంచెం సాగినతర్వాత వెనక్కి తిరిగిచూస్తే 'వాళ్ళు యంత్రానికి కట్టుబడిఉన్నారు, వాళ్ళు యంత్రం మీద నే కూర్చు నేటట్లుగా కట్టుబడిఉన్నారు' అని ఎర్నెస్టు చెప్పిన మాటలు గుర్తుకువచ్చినై.

---

౫

ఎర్నెస్టు తరచుగా మా యింటికి రావడం సాగించాడు. అక్కడి కాయన్నింతగా ఆకర్షించడానికి కారణం. కేవలం మా నాన్నా కాదు, మా నాన్న ఏర్పాటుచేసే తార్కికవిందులూ కాదు. ఆయన రాకలకు నేను కూడా ఒక కారణంగా పాత్రవహించానని, అప్పుడుగూడా నాకు నేనే ఎంతగానో అభినందించుకున్నా. నా ఊహ సరైందేనని రుజువు కావడా

నికి ఎంతో కాలం పట్టలేదు. ఎందుకంటే ఎర్నెస్టు ఎవర్‌హార్డు వంటి ప్రియుడు 'న భూతో న భవిష్యతి.' ఆయన చూపూ, కరస్పర్శా (అవకాశముంటే) ఇంకా నిశ్చలంగా, దృఢంగా అభివృద్ధిచెందినై. మొదటినుంచీ ఆయన కళ్ళల్లో అభివృద్ధిచెందుతూవచ్చిన ఆ ప్రశ్న, ఇంకా తప్పించుకోడానికి వీల్లేని రకంగా తయారైంది

మొదటిసారి ఆయన్ని చూసినప్పుడు నాకు దురభిప్రాయం ఏర్పడ్డది. తర్వాత నన్నాయన ఆకర్షిస్తున్నాడని తెలుసుకొన్నా. అటుతర్వాత ఆయన నన్నూ, నా వర్గాన్నీ మోటుగా ఎదుర్కొన్నప్పుడు, మళ్ళీ ఆయన మీద నా కసహ్యం వేసింది. దాని తర్వాత, ఆయన నా వర్గంపై దుర్బుద్ధితో దుమ్మెత్తిపోయలేదనీ, దాన్నిగూర్చి ఆయన మాట్లాడిన కఠినకఠోర విషయాలన్నీ సమర్థనీయాలేననీ తెలుసుకున్న తర్వాత మళ్ళీ నే నాయనకు అత్యంత సన్నిహితురాలినైనా. ఆయన నాకు దైవజ్ఞుడైనాడు. నా కోసం ఆయన సమాజంలోని మోసాన్ని పటాపంచలు చేసాడు. అప్రియమైన నగ్నసత్య లేశాల్ని ఆయన నాకు ప్రత్యక్షీకరించాడు. ఆయనవంటి ప్రియుడు ఇంతకుముందెవ్వడూ లేడని నేను చెప్పినట్లుగానే, విశ్వవిద్యాలయం ఉన్న పెద్దపెద్ద పట్టణంలో ఉంటూ, ఇరవైనాల్గేండ్లు వయస్సు వచ్చిందాకా ఏ విధమైన ప్రేమానుభవాలులేకుండా ఏ కన్యా నివసించలేదు. గడ్డం లేని తార్కికులూ, తల నెరిసిన ప్రొఫెసర్లూ, మల్లులూ, ఫుట్‌బాల్ ఆడే భీముళ్ళూ నన్ను ప్రేమించారు. కానీ నే నివ్వాళ ఎర్నెస్టును ప్రేమిస్తున్నట్లుగా వాళ్ళెవర్నీ ప్రేమించలేకపోయా. ఆయన్ని నేను తెలుసుకోక ముందే ఆయన చేతులు నన్ను చుట్టేసినై. నేను కాదుకూడదని పెనుగులాడేలోపల్నే ఆయన పెదవులు నా అధరాన్ని చుంబించినై. ఆయన నిజాయితీముందు అక్షత కన్యాత్వం అవహేళన పొందుతుంది. ఆయనలో ఉన్న మహత్తరాజేయమైన వేగం నన్నాపాదమస్తకం ఊపేసింది. ఆయన

సంప్రదించలేదు. ఆయన తన రెండు చేతుల్లో నన్ను చుట్టేసి, చుంబించి మనం యిద్దరం పెండ్లిచేసుకొందామని నిశ్చయమైనట్లే చేసాడు; దాన్ని గూర్చి తర్కమేలేదు. వచ్చిన చర్చల్లా ఒక్కటే—అదెన్నో తర్వాత వచ్చింది—మనం పెళ్ళి ఎప్పుడు చేసుకొందాం అని.

ఇంతకుముందటువంటి దెప్పుడూ జరగలేదు. అది సత్యవిదూరమైంది. సత్యానికి ఎర్నెస్టు పెట్టిన పరీక్షప్రకారం అది పని చేసింది. నేను దానికి నా జీవితాన్ని హామీ ఇచ్చా. ఆ హామీ అదృష్టకరమైంది. కానీ మా ప్రణయ ప్రథమదినాల్లో హింసనుగూర్చి, ఆయన ప్రేమించే సాహసాన్ని గూర్చి ఆలోచించినప్పుడు భవిష్యత్తునుగూర్చిన భయం కలుగుతుండేది. ఐనప్పటికీ అటువంటిభయాలు నిరాధారాలు ఇంతకన్నా ప్రశాంతమైన, సాధువైన భర్తను ఏ స్త్రీ నోచుకోలేదు. ఆయనలో ఉన్న ఈ సాధుత్వహింసలు ఆయన ప్రవర్తనలో కలిగిన వికృతత్వ, స్వేచ్ఛల్తో తమాషాగా మిళితమైపోయినై. ఆ కొద్ది వికృతత్వం! ఆయన దాన్ని జయించలేక పోయాడు. అది మనోహరంగా ఉంది......

ఆయనమీద నాకున్న ప్రణయ పరిపూర్తిలో ఉన్న చివర అనుమానం కూడా ఇప్పటితో పూర్తిగా అంతర్ధానమైపోయింది. (ఆ అనుమానంకూడా ఉపచేతస్సుకు సంబంధించింది.) ఫిలోమత్ క్లబ్బులో - బ్రహ్మాండమైన వాగ్వివాదం జరిగిన ఆరాత్రి - ఎర్నెస్టు ఘనాపాటులందర్నీ ముఖాముఖిగా ఎదుర్కొని వాళ్లను చిత్తుచేసినప్పుడు నా సందేహం పూర్తిగా తొలిగిపోయింది. పసిఫిక్ సముద్రతీరంలో ఉన్నదీ ఫిలోమత్ క్లబ్. దాన్ని అత్యధిక ధనవంతురాలూ, అవివాహితమైన మిస్ 'బ్రెంట్ వుడ్' అనే వృద్ధస్త్రీ స్థాపించింది. ఆమెభర్తా, కుటుంబం, ఆటవస్తువూ అక్లబ్బే. సంఘంలో కోటీశ్వరులైన వాళ్లంతా, ధనవంతుల్లో దృఢమైన మనస్సుకలవాళ్ళూ దాంట్లో సభ్యులు. ఆక్లబ్బుకు కొంత విజ్ఞానరూపాన్నివ్వడానికి కొద్దిగా పండితులూ ఉన్నారు.

ఫిలోమత్‌కు క్లబ్బు గృహంఅంటూ వేరేలేదు. అది అన్నిక్లబ్బుల వంటిదీ కాదు. నెలకోసారి ఉపన్యాసం వినడానికి సభ్యులంతా తమ ప్రత్యేక నిర్ణయగృహంలో సమావేశమౌతారు. ఎప్పుడూ కాకపోయినా సామాన్యంగా ఉపన్యాసకుల్ని డబ్బిచ్చి పిలిపిస్తారు. న్యూయార్కులో ఎవడైనా ఒక రసాయన శాస్త్రజ్ఞుడు రేడియమ్‌లాంటి నూత్న పరిశోధన చేస్తే, అతణ్ణి అక్కణ్ణుంచల్లా భత్యఖర్చులన్నీ భరించి పిలిపించి, ఆయన వినియోగించిన కాలానికి ఎక్కువగా డబ్బు చెల్లిస్తారు. అట్లాగే ధ్రువమండల ప్రాంతాలకు పోయివచ్చినవాళ్లనూ, సారస్వతంలోగాని కళలోగాని విజయం సాధించినవాళ్లనూ పిలిపిస్తారు. ఆక్లబ్బులో జరిగిన చర్చలేవీ పత్రికల్లో ప్రకటించబడకుండా ఉండడమే ఫిలోమత్ యొక్క సిద్ధాంతంకాబట్టి తక్కువ అతిథుల్నెవర్నీ రానీయరు. అందుచేత పెద్దపెద్ద రాజకీయ ధురంధరులు తమ మనస్సును పూర్తిగా విప్పి చెప్తుంటారు. అటువంటి సందర్భాలు ఇంతకుముందు చాలా ఏర్పడ్డయ్.

ఇరవై సంవత్సరాలనాడు ఎర్నెస్టు నాకు వ్రాసిన బాగా మాసిపోయి ముడతలుపడ్డ ఉత్తరాన్ని నాముందు విప్పిపెట్టి, దానినుంచి నేనీక్రింది విషయాన్ని నకలు వ్రాస్తున్నా.

“మీ నాన్న ఫిలోమత్ సభ్యుడు. కాబట్టి నీవు రావచ్చు. అందుకని వచ్చే మంగళవారంరాత్రికిరా. నీజీవితంలో సదవకాశం లభిస్తుందని నేను వాగ్దానం చేస్తున్నా. ఈమధ్య నీవు చేసిన ఎదురుదాడుల్లో, నిపుణుల్ని ఊపివేయలేక పోయావు. నీవు వస్తే నీకోసం నేను వాళ్ళను ఊపి వదిలిపెడ్తా. వాళ్ళను తోడేళ్ళమాదిరి గుఱకలు పెట్టిస్తా. నీవు కేవలం వాళ్ళ శీలాన్ని గూర్చే ప్రశ్నించావు. వాళ్ళ శీలాన్ని గూర్చి ప్రశ్నిస్తే వాళ్లింకా బాగా సంతోషించి ఇంకా గొప్పవాళ్లై కూర్చుంటారు. కానీ నేను వాళ్ళ

ధనప్రపంచుల్ని బెదిరిస్తా. దాంతో వాళ్లు ఆదిమమానవుని మనస్తత్వంతో కూకటివేళ్ళతో సహా పెల్లగిలివస్తారు. నీవు రాగలిగితే, సాయంకాలపు దుస్తుల్లో దాక్కొని, ఎముకను కొరుకుతూ గుఱకలుపెట్టే గుహానివాసిని చూస్తావ్. మృగతత్వాన్ని చూడటానికి నీకు బ్రహ్మాండమైన అంతర్దృష్టిని కలిగిస్తానని వాగ్దానమిస్తున్నా.

"నన్ను ఈకకు ఈకా, పీకకు పీకా లాగిపారేద్దామని వాళ్ళు ఆహ్వానించారు. ఇది మిస్ బ్రెంట్ వుడ్ పుట్టెరుపుట్టినబుద్ధి. ఆమె నన్నాహ్వానించినప్పుడేమాత్రం మొరటుగా నాకు సూచించింది. వాళ్ళ కామె ఇంతకుముందు ఇటువంటి తమాషాను చూపించింది. నమ్మకమైన, సాధువైన సంస్కారుల్ని ఆహ్వానించడం వాళ్లకు సంతోషదాయకం. నేను పిల్లిమాదిరిగా భీరువుననీ, ఇంట్లో ఆవుమాదిరిగా సాధువుననీ, మందబుద్ధిననీ మిస్ బ్రెంట్ వుడ్ అనుకొంటోంది. ఆమెకా ఉద్దేశం కలిగేటట్లు నేనే సహాయపడ్డానన్నది కాదనను. నేను ప్రమాదంకలిగించేవాడిని కాదని తెలుసుకొనేవరకూ ఆమె మొదట చాలా ప్రయత్నంచేసింది. రాజ్యాంగవిధానం మొత్తం మారాలని చెప్పినవ్యక్తి గవర్నర్ ఉద్యోగానికి హాజరైనట్లుగా; నేను 2 వందల 50 డాలర్లు తీసుకోడానికి అంగీకరించా. నేను సాయంకాలపు దుస్తులు కూడా ధరించాలి. ఇది తప్పనిసరి. నాజీవితంలో ఎప్పుడూ ఇటువంటి దుస్తులు ధరించలేదు. ఎక్కడో ఒకచోట ఈదుస్తులు అద్దెకుతీసుకోవాలనుకొంటున్నా. కానీ, ఫిలోమత్ అవకాశం తీసుకోడానికి ఇంతకన్నా కూడా ఇంకేం పనిచేయమన్నా చేస్తా."

అన్నిప్రదేశాల్లోకి ఆరోజురాత్రి పెర్టన్ వైత్ ఇంట్లో క్లబ్బుసమావేశమైంది. సమావేశం జరిగే గదిలోకి ఇంకా ఎక్కువకుర్చీలు తీసుకువచ్చి వేసారు. ఎర్నెస్ట్ ఉపన్యాసం వినడానికి రెండువందలమంది ఫిలోమత్తులు ఆకుర్చీల్లో కూర్చున్నారు. వాళ్ళందరూ నిజంగా సంఘాధినేతలు. అక్క-

డికి వచ్చినవాళ్ళ అదృష్టాల్నిగూర్చి నామనసులో నేను ఊహించుకొని నాకు నేనే సంతోషించా. వాళ్ళ ధనంకోటానుకోట్లదాకా పెరిగిపోయింది. ఈ కోటీశ్వరులంతా కుండల్లో గుడ్డి గుర్రాలకు పండ్లుతోముతూ వ్యర్థకాలక్షేపం చేసే ధనికులవంటివాళ్లు కారు. యాంత్రిక, రాజకీయ జీవితాల్లో ప్రముఖపాత్ర వహించినవాళ్లు.

మిస్ బ్రెంట్‌వుడ్, ఎర్నెస్టును లోపలికి తీసుకువచ్చినతర్వాత మేమందరం మామాస్థానాల్లో కూర్చున్నాం. వాళ్లందరూ వెంటనే కదిలి ఆయన మాట్లాడే గదికి వచ్చారు. ఆయన సాయంకాలపు దుస్తుల్లోఉన్నాడు. ఇంక ఆ విశాల భుజస్కంధం, ఆ మహోన్నతమైన శిరస్సు సంగతి వేరేచెప్పాలా? ఆయన దివ్యతేజస్సుతో ఉట్టిపడుతున్నాడు.

ఆ ఒక్క విషయానికే నేనాయన్ని ప్రేమించానని అనుకొంటున్నా. నేనాయన్ని చూసేటప్పటికి నాలో ఆనందం వెల్లువలుగట్టింది. మళ్ళీ ఆయన చేతులు నన్ను పెనవేసుకొన్నట్లు, ఆయన అధరంచుంబించినట్లు స్పర్శజ్ఞానం కలిగింది. "ఆయన నావాడు! ఆయన నన్ను చేతుల్లో బంధించాడు. నేను, నామమాత్రమైన నేను; ఆయనమనస్సులోఉన్న ఉదాత్త గంభీరభావాలన్నీ త్రోసిరాజని ఆక్రమించుకున్నా." అని అక్కడ సమావేశానికి ఒక్కసారి లేచి పెద్దగా చెపుదామన్నంత గర్వం నాకు కలిగింది.

గది రాజద్వారంలో మిస్ బ్రెంట్‌వుడ్ ఆయన్ని కర్నల్ వాన్ గిల్బర్టుకు పరిచయం చేసింది. కర్నల్ వాన్ గిల్బర్టు అధ్యక్షతవహించబోతున్నాడని నాకు తెలుసు. కర్నల్ వాన్ గిల్బర్టు పెద్ద కార్పొరేషన్ లాయరు. దానికితోడు ఆయన అధిక ధనవంతుడు. ఏదైనా నోటీసు ఇవ్వాలంటే ఆయన కనీసపక్షం కోరేరుసుం లక్ష డాలర్లు. ఆయన న్యాయశాస్త్ర నిధి. న్యాయశాస్త్రం ఆయన చేతిలో కీలుబొమ్మ. మన్ను మాదిరిగా దాన్ని ఆయన ఇష్టంవచ్చినట్టుగా మలుస్తాడు. వేషంలో, సాహి

త్యంలో ఆయన ప్రాచీనుడు. విజ్ఞానంలో, భావనాశక్తిలో, ఉత్సాహంలో అత్యధునాతనుడు. పార్టువెల్ వీలునామాను మార్పుచేయడంతో ఆయనపేరు మొదటిసారిగా విఖ్యాతి పొందింది. ఈ ఒక్కపని చేసినందుకు ఆయన తీసుకున్న ! మొత్తం 5 లక్షల డాలర్లు. అప్పటినుంచీ ఆయన అవ్వాయిచువ్వలాగా పైకిపోయాడు. ఆయన దేశంలోని గొప్ప లాయరుగా ప్రసిద్ధిపొందాడు; కార్పొరేషను లాయరనుకోండి. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఉన్న మూడు తరగతుల గొప్పలాయర్లలో ఆయన ఒక్కడు.

ఆయనలేచి, ముందుగా ఏరి ఉంచుకున్న అవహేళనాగర్భితాలైన కొన్ని మంచిమంచి పదాల్తో ఎర్నెస్టును పరిచయంచేయడం ప్రారంభించాడు. సంఘసంస్కర్త, శ్రామికవర్గ సభ్యుడూ ఐన ఎర్నెస్టును పరిచయం చేయడంలో కర్నల్ వాన్ గిల్బర్టు పరిహాసాపూర్వక చమత్కార పదజాలాన్ని ప్రయోగించాడు. సభ్యులు మందహాసం చేసారు. నాకు కోపంవచ్చింది. ఎర్నెస్టువేపు చూచా. ఆయనవాలకంతో నాకు కోపం ఇబ్బడిముబ్బడైంది. ఆ మెత్తమెత్తని చివాట్లు కాయనకు రోషం వచ్చినట్లుకనపడలేదు. అంతకన్నా మరీ అన్యాయమేమిటంటే, అసలాయన కవి చెవిదూరినట్లేలేదు. నిద్రమత్తు మొద్దులాగా కూర్చున్నాడు. నిజంగా వట్టితెలివితక్కువదద్దమ్మ మాదిరిగా కనిపించాడు. పై దూకుతున్న ఈ అఖండమేధాసంపత్తికి, ఈ వ్యూహానికి ఏమన్నా బెదిరిపోయాడా అబ్బా! అనిపించింది నాకు. అప్పుడొక చిరునవ్వు నవ్వా. ఆయన నన్ను పిచ్చిదాన్ని చేయలేదు. కాని మిస్ బ్రెంటివుడ్ను పిచ్చిదాన్నిగాచేసినట్లే తక్కినవాళ్లందర్నీ పిచ్చివాళ్లుగా చేసాడు. ఆమె మా కెదురుగా కుడిచేతివేపున్న కుర్చీలో ఉంది. ఆమె చాలాపర్యాయాలు తన పరిచయస్తులవేపుచూసి తల పంకిస్తూ ఆయన విసుర్లకు తన ఆనందాన్ని తెలియజేస్తూ మందహాసం చేసింది.

కర్నల్ వాన్ గిల్బర్టు తన పరిచయవాక్యాలైపోయి కూర్చున్నాడు. ఎర్నెస్టు కుర్చీలోనుంచి లేచి ఇక మాట్లాడడానికి ఉపక్రమించాడు. చాలా తక్కువ స్థాయిలో, వినయం ఉట్టిపడేటట్లుగా, భయంభయంగా, ఆగి ఆగి మాట్లాడడం ప్రారంభించాడు. కార్మికవర్గంలో తాను పుట్టినసంగతీ, దైహికంగా మానసికంగా ఉపవాసాల్తో శుష్కించిపోయిన అసహ్యకరమైన తన వాతావరణాన్ని గూర్చి చెప్పాడు. తన ఆశల్నీ ఆశయాల్నీ వివరించాడు. పై తరగతులవాళ్లు నివసించే స్వర్గాన్ని గూర్చి తనకుగల భావన విశదీకరించాడు. ఆయన చెప్పినమాట లివి :

"నాకుపైన నిస్వార్థమైన మనస్సు, నిర్మలమూ ఉదాత్తమూ ఐన ఆలోచన, సునిశిత మేధాసంపత్తీ ఉన్నదని నాకు తెలుసు. నాకిదంతా ఎందుకు తెలుసునంటే, దుర్మార్గులూ, సాహసికురాండ్రుమినహా, మంచిమంచి ఆలోచన్లుచేస్తూ, మంచిభావ మాట్లాడుతూ, శ్లాఘనీయమైన పనులు చేస్తూ ఉండే ఆడవాళ్లనూ మగవాళ్ళనూ చిత్రించిన సముద్రప్రాంతీయ పుస్తక భాండాగారపు నవలలను (Sea side Library Novels) చదివా. ఒక్క ముక్కలో చెప్పాలంటే సూర్యోదయాన్ని నిజమని ఒప్పుకొన్నట్లే, నాకు పైన అంతా సుందరంగా, ఉదాత్తంగా, బ్రహ్మాండంగా జీవితానికి గౌరవప్రదమైన పరిస్థితి ఉందనీ, మానవుడి దుర్భర నికృష్టపరిస్థితుల్ని తొలగించి జీవితానికి అమృతానందమిచ్చే వాతావరణం ఉందనీ విశ్వసించా."

ఆయన తన ఉపన్యాసాన్ని కొనసాగించి తాను మిల్లుల్లో పనిచేసినప్పటి జీవితాన్నీ, గుఱ్ఱపులాడాల వ్యాపారం నేర్చుకొన్న పరిస్థితినీ, సోషలిస్టులతో తను కలుసుకున్న విషయాన్నీ జ్ఞాపకంచేసాడు. వాళ్లలో సునిశిత మేధావులూ, నసాళాలు బ్రద్దలయ్యేటట్లుగా మాంచి ఛలోక్తులువిసిరే ప్రతిభావంతులూ, ధనదేవత నారాధించే మత ప్రబోధకులతో జతపడనందు

వల్ల విడివడి బైటికివచ్చిన ఉదాత్త క్రైస్తవమతాచార్యులూ, పాలకవర్గానికి అండగా నిలబడ్డందున విశ్వవిద్యాలయంనుంచి బైటికి వచ్చేసిన పండిత ప్రకాండులూ అందులో ఉన్నారని చెప్పాడు. తలా తోకా లేకుండా అస్తవ్యస్తంగా ఉన్న ప్రస్తుతసమాజాన్ని కూలద్రోసి దానినుంచి భవిష్యత్తులో సార్థకమైన, సుసంగతమైన సమాజాన్ని నిర్మించడానికిపో రాడుతున్న విప్లవవాదులు షోషలిస్టులు అన్నాడు. ఆయనింకా చాలా చెప్పాడు. అదంతా వ్రాస్తే మహాభారతమంత అవుతుంది. కానీ ఆయన విప్లవాదుల జీవితాన్ని చిత్రించిన విధానాన్ని మాత్రం మరచిపోలేను. ఆగి ఆగి మాట్లాడే విధానం అదృశ్యమైపోయింది. ఆయన కంఠంలో దృఢత్వం, పటిష్టత స్థాయిత్వాన్ని పొందినై. ఆయన స్వరం ఆయనతోపాటే ఉత్తేజాన్ని పొందింది. ఆయన్లో ఆలోచన్లు గంగాప్రవాహంలాగా వాక్రూపంలో ప్రవహించినై. ఆయనింకా ఇలా అన్నాడు—

"హృదయంలోని లోతులు కదిలించే మహత్తరమైన మానవతా దృఢ విశ్వాసం, ఉజ్జ్వలమైన ఆదర్శం, మధురమైన నిస్వార్థత్వం, మహోన్నత త్యాగం, జీవితాన్ని బలిదానం చేయగల శీలం కలవాళ్ళను నేను విప్లవాదుల్లో చూచాను. ఇక్కడ జీవితం పరిశుభ్రంగా, ఉదాత్తంగా, సజీవంగావుంది. రూపాయలూ, అణాలు, పైసలకన్నా శరీరం. హృదయం గొప్పవని విశ్వసించిన మహాత్ముల్తోను, శీవిదర్పాలకన్నా, వాణిజ్య విస్తీర్ణావకాశాలకన్నా, ప్రపంచైకాధిపత్యానికన్నా, మురికికూపాల్లోపడి ఆహారంలేక శుష్కించిపోయే అనాథ శిశువుల ఎముకలగూడును కప్పే జీర్ణమలిన వస్త్రమే ప్రధానంగా భావించే ఉదారాశయుల్తోనూ నేను పరిచయమేర్పర్చుకొన్నా. ఉదాత్త ప్రయోజనమూ, కార్యశూరత్వమూ నన్ను చుట్టేసినై. ఉజ్జ్వలమైనరోజుల్లో చిరబాధా సంతప్తమూ మానవతా పరిపూర్ణమూవి దుర్వినియోగమైనప్పటికీ చిట్టచివరకు ప్రమాదాన్నుంచి సంరక్షింపవలసిన క్రీస్తుయొక్క పవిత్రకలశం

నిరంతరం నాకళ్లముందు జాజ్వల్యంగా ప్రకాశిస్తూండగా ప్రశాంత నిశాసమయాల్లో గడిపా.”

పూర్తిగా విభిన్న స్వరూపందాల్చిన ఆయన్ను నేనింతకుముందు చూచినట్లుగా, ఇప్పుడూ మరో వ్యక్తిగా మారి నాముందు సాక్షాత్కరించాడు. ఆయన్లోఉన్న దైవత్వంతో ఆయన కనుబొమలు ప్రకాశవంతాలైనై. ఆయన్నొక తేజస్సావరించినట్లుగా ఆయన కళ్లు ఇంకా మహోజ్వలంగా ప్రకాశించినై. కానీ తక్కినవాళ్లు ఆ తేజఃపుంజాన్ని చూడలేరు. బహుశా నా ఆనందబాష్పాలూ, అనురాగం నా దృష్టిలో మాంద్యాన్ని కలిగించినందువల్లనే అనుకుంటా నేనా స్వరూపాన్ని చూడగల్గింది. ఎట్లాగైతేనేమి నా వెనకాల కూర్చున్న విక్‌సన్‌లో ఏమాత్రం కదలికా కలగలేదు. ఎందుకంటే ఆయన ‘ఇదంతా వట్టిభ్రమ’ అని పెద్దగా ఆక్షేపించడం నేను విన్నా.

ఉన్నతవర్గాలకు సంబంధించిన వ్యక్తుల్తో పరిచయమేర్పడి, ఉన్నతస్థానాలాక్రమించుకొన్నవాళ్లతో భాయీ భాయీ అంటూ భుజాలు భుజాలు రాచుకొంటూ తిరిగేంతవరకూ తాను సమాజంలో ఎట్లా పైకి వచ్చాడో అదంతా ఎర్నెస్టు చెప్పాడు. తర్వాత ఆయన దుర్భ్రమ తొలిగిపోయిన విషయం చెప్పాడు. ప్రేక్షకులకు మొగమిచ్చకాల మాటలద్వారా కాకుండా ఆయన వర్ణించి చెప్పాడు. మట్టిలో ఉన్న ఏకత్వానికి ఆయన ఆశ్చర్యపడ్డాడు. జీవితం రమణీయమైంది, కరుణార్ద్రమైందీ కాదని నిర్ధారణైంది. తన చుట్టూ ఆవరించిన స్వార్థానికి భయపడిపోయినాడు. ప్రజ్ఞావిశేషాల్తో కూడుకొన్న జీవితం వ్యంగ్యంకావడం ఆయన్ని మరింతగా చకితుణ్ణి చేసింది. విప్లవవాదుల్లోనుంచి కొత్తగా వచ్చినప్పుడు అధికారవర్గాల్లోగల మౌఢ్యానికి ఆయన చకితుడైనాడు. బ్రహ్మాండమైన చర్చీలు, బాగా డబ్బిచ్చిపోషించే మతబోధకులూ ఉన్నప్పటికీ, పాలకవర్గంలో ఆడా మగా అంతా కేవలం

భౌతికవాంఛాపరులే. చిన్న చిన్న తీయని ఆదర్శాలు, ప్రియసుభాషితాలూ వాళ్లు వాగేమాట నిజమే. ఐనప్పటికీ వాళ్లుగడిపే జీవితానికి ప్రధాన కీలకం భౌతికతత్వమే. వాళ్లకు యధార్థమైన నైతిక ప్రవర్తనేలేదు. ఉదాహరణకు : క్రీస్తు బోధించిందీ, తర్వాత ఇప్పటివరకూ ఎవరూ బోధించందీ అది.

"యుద్ధవ్యతిరేక దూషణలుచేసి శాంతిదేవతకు స్వాగతం పల్కుతూంతపల్కి కొని వాళ్లచేతులకు తుపాకులందించి తమ యంత్రాగారాల్లో సమ్మెచేసేవాళ్లను కాల్చివేయమని ప్రోత్సహించిన గోముఖ వ్యాఘ్రాలను కలుసుకొన్నా. బహుమానం సంపాదించుకోడానికి పరస్పరం చంపుకొనే ద్వంద్వయుద్ధాన్ని అమానుషమని తీవ్రంగా నిరసిస్తూ నిప్పులు గ్రక్కుతూ అదే సమయంలో శిశువుల పవిత్రరక్తంతో ఎర్రబారిన చేతులుగల హీరోడ్ కన్నా, కల్తీ ఆహారపదార్థాల్తో ప్రతిసంవత్సరం లక్షలాది పసిపిల్లలప్రాణాల్ని బలిగొంటున్న పయోముఖ విషకుంభుల్తోటీ నాకు పరిచయం కలిగింది.

"కులీన లక్షణాలుగల్గి సాధువుగా కనపడుతున్న ఈ పెద్దమనిషి,- రహస్యంగా విధవల్ని, అనాధుల్ని నిలువుదోపిడి చేస్తున్న కార్పొరేషన్ల చేతులో కీలుబొమ్మ. దిష్టిబొమ్మగా ఉన్న డైరెక్టరు. మంచి మంచి ఉద్గ్రంధాలు సేకరిస్తూ సారస్వతారాధకుడిగా కనపడే ఈ పెద్దమనిషి - గాడిద దవడలూ, కాటిక కనుబొమ్మలూ గల మ్యునిసిపాల్టీ యజమానిని లంచమిచ్చి కొన్నాడు. పేటెంటు మందుల ప్రకటనలను ప్రచురించే ఈ పత్రికా సంపాదకుడు - పేటెంటు మందుల నిజస్వరూపాన్ని తన పత్రికలో ప్రచురించమని నేను ధైర్యంచేసి అడిగానని నన్ను ప్రజాసామాన్యాన్ని రెచ్చగొట్టే వెధవనని దూషించాడు. ఆదర్శవాదానికి సంబంధించిన రమణీయార్థాల్ని గూర్చి, భగవంతుని సుగుణసంపదనుగూర్చి, ప్రశాంతంగా మాట్లాడే ఈ వ్యక్తి - వ్యాపారంలో తనతోటి భాగస్తుల్ని నిలువునా ముంచేసాడు. చర్చికి

మూలస్తంభంగా, విదేశీ మతసంస్థలకు విరివిగా వ్యాస ప్రదానంచేసే మహా మహునిగా ఉన్న ఈ మనిషి – అర్ధజీతాల్తో రోజుకు పదిగంటలు చొప్పున తన షాపుల్లో ఆ యువతులచేత పని చేయించుకొంటూ వాళ్ళను వ్యభిచారిణులుగా తయారయ్యేటట్లుగా స్వయంగా ప్రోత్సహించాడు. విశ్వవిద్యాలయాలకు భూరిదానాలుచేసి, బ్రహ్మాండమైన దేవాలయాలు కట్టించిన ఈ మహామహుడు – రూపాయలూ అణాలకోసమని నిండు కోర్టులో తప్పుడు ప్రమాణంచేసాడు. రైలురోడ్డును గుత్తకు తీసుకొన్న ఈ వ్యక్తి – రహస్యంగా తక్కువడబ్బు మంజూరుచేసి పౌరుడిగా, ఘరానా మనిషిగా, క్రైస్తవారాధకుడుగా తానాడినమాట తప్పాడు. ఇంకా ఆయన ఇటువంటి మొదరా చాలా మంజూరుచేసాడు. ఈ శాసనసభ్యుడు నిరక్షర కుక్షియైన యజమాని చేతిలో కీలుబొమ్మ. ఆయన పాదదాసుడు. ఈ గవర్నరు – ఈ సుప్రీంకోర్టు న్యాయాధిపతీ ఇంతే. వీళ్లు ముగ్గురూ రైలురోడ్డు ప్యాసులుమీద ప్రయాణాలు చేస్తుంటారు. మేదకుడిమాదిరిగా కనపడే ఈ పెట్టుబడిదారుడికి, యంత్రం, యంత్రపు యజమాని, ప్యాసులిచ్చే రైలురోడ్లు ఉన్నయ్."

"అందువల్ల స్వర్గంలో ఉండటానికి బదులుగా నిర్జీవమైన వాణిజ్యమనే పెద్ద ఎడారి మధ్యలో ఉన్నానని గ్రహించా. ఒక్క వ్యాపార విషయం మినహాయిస్తే నాకు మాంద్యంతప్ప ఇంకేమీ గోచరించలేదు. కుళ్లు కంపుకొట్టే ప్రాణాల్తో ఉన్నవాళ్ళను నేను చాలమందిని చూచినప్పటికీ, పరిశుభ్రంగా, ఉదాత్తంగా, సజీవంగా ఉన్నవ్యక్తి ఒక్కడైనా నాకూ కనిపించలేదు. నాకు కనపడ్డదల్లా అంతులేని స్వార్థపరత్వం, అమానుషత్వం, కేవల కుక్షింభరత్వం, అనుభవపూర్వకమైన భౌతికతత్వంమాత్రమే." అని ఆయన అన్నాడు.

వాళ్ళను గురించీ, తనలో తొలిగిపోయిన భ్రమను గురించీ ఎర్నెసు ఇంకా ఎక్కువగా వాళ్ళకు చెప్పాడు. ప్రజ్ఞా విషయంలో వాళ్ళంటే ఆయనకు తలయీపనగాయ పుట్టింది. నైతికంగా, ఆధ్యాత్మికంగా వాళ్ళాయన ఎముకలు కొరుక్కుతిన్నారు. అందుకనే పెట్టుబడిదారుల్లో లేని పరిశుభ్రత, ఉదాత్తతా, సజీవ లక్షణాలూ గల్గిన తన విప్లవవాదుల మధ్యకు పోవడానికే ఆయన చాలా ఇష్టపడ్డాడు.

“ఇక ఇప్పుడు మీకు ఆ విప్లవాన్ని గూర్చిన విషయాన్ని మనవి చేస్తా” అన్నాడాయన.

ఆయన మొగం వాచేటట్లు పెట్టిన చీవాట్లు వాళ్ళ నేమాత్రం కదిలించలేదని నేను మొదటగా చెప్పాలి. నాచుట్టుప్రక్కల కూర్చున్న వాళ్ళ మొగాల్నొక్కసారి పరకాయించి చూచా. ఆయన ఆరోపణలన్నింటికీ తాము అతీతులమనే భరవాసాతోటే వాళ్ళున్నారు. (వాళ్ళ నైతికవిషయాన్ని తూర్పారపట్టినందువల్ల వాళ్ళేమీ చలించరు, అని ఆయన నాతో ఇంతకుముందు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చినై. ఐనప్పటికీ, ఆయన భాషాగాంభీర్యం మిస్ బ్రెంట్‌వుడ్‌ను సమ్మోహితురాలిని చేసిందని గుర్తించా. రాబోయ్యే కీడు తెలుసుకోని ఆందోళన పడ్తున్నట్లామె గోచరించింది.

ఎర్నెస్టు విప్లవసైన్య వర్ణనతో ఉపన్యాసం ప్రారంభించాడు. ఆసైన్యానికి ఎంతబలం వుందో అంకెలతోసహా చెప్తూంటే (వివిధ దేశాల్లో ఎన్ని వోట్లు వచ్చినయ్యో) సభలోకూర్చున్న వాళ్ళల్లో తహతహ బైలుదేరింది. వాళ్ళ మొగాల్లో వ్యాకులత్వం గోచరించింది. పెదవులు బిగబట్టిన వాళ్ళను చూచా. చిట్టచివరికి యుద్ధం ముగిసింది. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోవున్న పదిహేనులక్షలతో కలుపుకోని తక్కిన ప్రపంచంలోవున్న రెండుకోట్లముప్పై అయిదు లక్షల సంఖ్యాబలంగల అంతర్జాతీయ సోషలిష్టులనుగూర్చి ఆయన విపులీకరించాడు.

"1 కోటి 50 లక్షల సంఖ్యాబలంకల ఇటువంటి సైన్యం, పాలకుల్ని పాలక వర్గాల్ని నిలవేసి తమ గతేమిటో నిర్ధారించుకోనేటట్లు చేస్తుంది. మీకు దిక్కులేదు! మీ దగ్గరఉన్నదంతా మాకుకావాలి. మీ దగ్గరున్నదంతా మేం స్వాధీనంచేసుకోనేదాకా తృప్తిచెందం. అధికార పాశాలూ, మానవజాతి గమ్యస్థానం మా చేతుల్లోకి రావాలి. ఇవిగో మా చేతులు- ఇవి చాలా బలిష్టమైనవి. మీ ప్రభుత్వాన్ని, మీ భవనాల్ని, మీ సర్వసంపదల్నీ మీ దగ్గరనుంచి గుంజుకోబోతున్నాం. ఆ రోజుతో చేలోపనిచేసే రైతుమాదిరిగా, మీ పట్టణాల్లో అర్ధాకలితో నీరసించిపోయి పనిచేసే గుమాస్తామాదిరిగా, మీరూ మీ తిండికోసం పరిశ్రమిస్తారు. మా చేతులివిగో! ఇవి చాలా పటిష్టాలైన హస్తాలు! ఇది ఈవిప్లవ సైన్య నినాదం'' అని అన్నాడాయన.

ఇట్లా మాట్లాడ్తూ ఆయన తన బ్రహ్మాండమైన భుజస్కంధాలనుంచి రెండు చేతులూ చాచాడు. గుఱ్ఱపునాడాలుకొట్టే ఆయన చేతులు గద్ద గోళ్ళవలె గాలిని పిసికేస్తున్నాయ్. తన ప్రేక్షకుల్ని చీల్చిచెండాడి అణగ ద్రొక్కడానికన్నట్లుగా బారలుచాచిన చేతుల్తోఉన్న ఆయన, ప్రబల కార్మిక తేజోమూర్తి. శక్తిమంతమైన, సుపుష్టమైన, భయాత్మకమైన విప్లవమూర్తి ముందట శ్రోతలందరూ భీతావహులై, కుంచించుకుపోవడం నేను గమనించా. స్త్రీలందరూ పూర్తిగా కృంగిపోయారు. వాళ్ళ మొగాలమీద భయం తాండవమాడుతోంది. మొగవాళ్ళ విషయంమాత్రం అట్లాలేదు. వాళ్లు సోమరిపోతులైన ధనికులు కారు. కార్యోన్ముఖులైన భాగ్యవంతులు. వాళ్లు యోధులు. గొంతుల గొణగొణ ధ్వనులు బైలుదేరి కొంతకాలం గాలిలో అటూ ఇటూ ఊగులాడి తర్వాత చప్పబడి ఊరుకొన్నయ్. ఆదిమ మానవుడిలోవున్న మాత్సర్యద్వేషకౌటిల్యాలకు ప్రతిచిహ్నమైన గుఱగుఱ ధ్వని అది. ఆరాత్రి ఈ గుఱగుఱ ధ్వనిని అనేక పర్యాయాలు

విన్నా. తామే ఈ ధ్వనినిచేస్తున్నామన్న జ్ఞాత్వా వాళ్ళకేకోశానాలేదు. అది వాళ్లకు తెలియకుండానే బైలుదేరిన తోడేళ్ళ గుఱ గుఱ ధ్వని. ఆ క్షణంలో నేనువాళ్ల మొగాల్లో ఏర్పడ్డ కాఠిన్యాన్ని, వాళ్ల కళ్ళల్లో మెరసిన యోధ కాంతినీ చూచా. వాళ్లు సర్వసులభంగా తమ ప్రపంచాధిపత్యాన్ని వదులుకో రన్నదికూడా బాగా అర్థమైంది.

ఎర్నెస్టు తన ఎదురుదాడిని సాగించాడు. పెట్టుబడిదారీవర్గం, సమాజంపై దురధికారం చెలాయించినందువల్లనే, అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో 15 లక్షల విప్లవవాదులు ఏర్పడడానికి కారణమని నిందారోపణచేశాడు. ఉపకరణాలుగానీ, యంత్రాలుగాని లేకుండా శక్తిని ఉత్పత్తిచేసే సహజసామర్థ్యంగల నేటి అనాగరిక మానవుల ఆర్థికపరిస్థితినీ, గుహానివాసియైన ఆదిమ మానవుడి ఆర్థికస్థితినీ రేఖామాత్రంగా చిత్రించాడు. తర్వాత ఆయన, యంత్రాల అభివృద్ధినీ, సాంఘిక నిర్మాణాన్నీ తెలియజేసి, అందువల్ల ఈ రోజున నాగరిక మానవుని ఉత్పత్తిశక్తి అనాగరిక మానవుడి శక్తికన్నా వేయి రెట్లు పెరిగిందని చెప్పాడు. "వెయ్యిమందికి కావలసిన ఆహారాన్ని ఏడుగురు ఉత్పత్తిచేయగలరు. ఒక్క వ్యక్తి, రెండువందలయాభైమందికి సరిపడే చెప్పుల్నీ బూట్లనూ చేయగలడు. సమాజ సక్రమ యాజమాన్యంవల్ల నేటి నాగరిక మానవుడు గుహానివాసియైన ఆదిమమానవుడికన్నా ఎంతో ఉపయోగకారి అన్న విషయాన్ని దీనిమూలకంగా మనం నిర్ధారించవచ్చు. కానీ అతడట్లా ఉన్నాడా? పరిశీలిద్దాం. ఈనాడు సంయుక్త రాష్ట్రాల్లో 150 లక్షల మంది దరిద్రజీవనం చేస్తున్నారు. దరిద్రజీవనం అంటే ఆహారంలేనందువల్ల, సామాన్యమైన శ్రామికశక్తి నిర్వహించడానికి వీలులేని బ్రతుకన్నమాట. కార్మిక శాసనం అనే తతంగం ఉన్నప్పటికీ ఈనాడు సంయుక్తరాష్ట్రాల్లో 30 లక్షల మంది పనిచేసే పిల్లలున్నారు. పన్నెండు సంవత్సరాల్లో వీళ్ళ సంఖ్య రెట్టింపవుతుంది. ఈ సందర్భంలోనే, సమాజ

యజమానులైన మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతా. 1910 వ సంవత్సరంలోని జనాభా లెక్కల్ని మీరెందుకు ప్రకటించలేదు? మీరు భయపడ్డారని నేను సమాధానం చెపుతున్నా. ఇప్పటికి సంఘటితమౌతున్న విప్లవం, ఆ నికృష్ట జీవితసంఖ్యలవల్ల ఇదివరకే ముంచుకు వచ్చేది."

"నేను మొదట్లో చేసిన ఆరోపణకు మళ్ళీవస్తా. ఆధునిక మానవుని ఉత్పత్తిశక్తి గుహానివాసియైన ఆదిమమానవుని శక్తికన్నా వెయ్యింతలు ఎక్కువైనప్పుడు, ఈనాడు సంయుక్తరాష్ట్రాల్లో, తగిన ఆహారం, తగిన వసతి లేకుండా అల్లాదే బిల్లా అంటూండే 150 లక్షల మంది అనాథులెందుకున్నారు? ఈ నాడు సంయుక్త రాష్ట్రాల్లో 30 లక్షల బాలకార్మికులెందుకున్నారు? పెట్టుబడిదారీవర్గం అక్రమ యాజమాన్యంవహించింది. ఇది సరైన నిందారోపణ. ఆదిమ గుహానివాసికన్నా ఆధునిక మానవుడు నికృష్టజీవితం గడుపుతున్నందువల్ల, ఇతడి ఉత్పత్తిశక్తి ప్రాచీనుడికన్నా వేయిరెట్లు అధికమన్న యదార్థాలవల్ల, పెట్టుబడిదారివర్గం దుష్టాధికారం చేసిందని తేల్చడంతప్ప మరో సమాధానంచెప్పడం సాధ్యంకాదు. నాపై అధికారంచెలాయించే మీరే అక్రమయాజమాన్యం వహించారు. స్వార్థంతో ఘోరంగా మీరు దురధికారంచేసారు. ఈవిషయంమీద మీ మొత్తంవర్గం సంయుక్తరాష్ట్రాల్లో ఉండే ఈ 15 లక్షల విప్లవాదులకు సమాధానం చెప్పలేనట్లే, ఈ రాత్రి, ఇక్కడ, మీరు నాకు ముఖాముఖిగా సంతృప్తి కరంగా సమాధానం చెప్పలేరు. మీ రొక్క అక్షరంముక్క సమాధానం చెప్పలేరు. సమాధానం చెప్పమని నేను మిమ్మల్ని సవాలు చేస్తున్నా. పైగా ఇప్పుడు ఇంకో విషయంగూడా ధైర్యంతో చెపుతున్నా. నేను నా ఉపన్యాసం పూర్తిచేసిన తర్వాత మీరు సమాధానం చెప్పలేరు. తదితర విషయాన్ని గురించి మీరు తగినంత పదజాలంతో మాట్లాడినా, ఈవిషయానికి వచ్చేటప్పటికి మీ నాలుకలాడవు."

"మీరు మీ యాజమాన్యంలో దెబ్బతిన్నారు. మీరు నాగరికతను కసాయిదుకాణం చేశారు. మీరింతకాలం అంధులుగా, దురాశాపరులుగా ఉన్నారు. (ఇవ్వాళమాదిరిగానే) సిగ్గూయెగ్గూలేకుండా లేచి శాసనసభల్లో పిల్లాజెల్లా పనిచెయ్యకపోతే లాభాలురావడం దుస్సాధ్యం అని ప్రకటించారు' నేను చెప్పేమాటల్నే మీరు ఆధారంగా తీసుకోవద్దు. మీరు వ్యతిరేకంగా అంతా రికార్డయి ఉంది. మధురాదర్శాల్లో, ప్రియ సుభాషితాల్లో మీరు మీ చైతన్యాన్ని జోకొట్టుకున్నారు. అధికారంతో, ఐశ్వర్యంతో మీరు కొవ్వెక్కారు. విజయగర్వంతో మదించారు. తేనెతుట్టెచుట్టూ మూగి ఉన్న సోమరిపోతు తేనెటీగల సమూహాన్ని సమూలంగా నాశనంచేయడానికి, పరిశ్రమించే తేనెటీగలపైకి దూకినప్పుడు, సోమరిపోతు తేనెటీగలకున్న జీవి తాశవంటిదే మీరు మమ్మల్ని గూర్చి ఉంది. సమాజయాజమాన్యంలో మీరు విఫలులైనారు. మీనుంచి యాజమాన్యం గుంజుకోవాలి. తదితరమైన శ్రామికవర్గాన్ని కూడగట్టుకొని మీనుంచి యాజమాన్యం లాక్కొంటామని 15 లక్షల శ్రామికులూ చెపుతున్నారు. ఓ యజమానుల్లారా! ఇదీ విప్లవం! మీ చేతనైతే ఆపండి." అన్నాడు.

కొంతకాలంవరకూ మనోజ్ఞంగా ఆ గదిలో ఎర్నెస్టు స్వరం ప్రతిధ్వనించింది. నేనిదివరకు విన్నట్లుగానే తర్వాత గొంతుల గుసగుసలు వినపడినై. కర్నల్ వాన్ గిల్బర్ట్ తమ్ము గుర్తించడానికని ఒక డజనుమంది గొడవచేస్తూ నిలబడ్డారు. మిస్ బ్రెంట్‌వుడ్ భుజాలు కదలడం నేను చూశా. ఆమె ఎర్నెస్టునుచూచి పరిహాసంగా నవ్వుతూన్నదని అనుకొన్నందున ఆక్షణాన నాకు కోపంవచ్చింది. తర్వాత అది నవ్వుకాదని, మూర్ఛ అని కనిపెట్టా. అదృష్టకరమైన ఈ ఫిలోమత్ క్లబ్బుకు ఈ పిట్టపిడుగును తీసుకువచ్చినందు కామె నిలువునా కంపించిపోయింది.

కోపంతో కందగడ్డలాగా తయారైన మొగాల్తో మాట్లాడడానికి అనుమతికోసం తనవేపుచూస్తూ నిలబడ్డ ఆ డజనుమంది వ్యక్తుల్ని కర్నల్ వాన్ గిల్బర్ట్ చూడలేదు. ఆయన మొగమే క్రోధపూర్ణమైఉంది. చేతు లూపుతుంటూ ఆయన అమాంతం లేచి నిలబడ్డాడు. ఒక్కక్షణం అర్థంపర్థంలేని మాటలేవో మాట్లాడాడు. ఆటుతర్వాత ఆయన్లోనుంచి వాక్ ప్రవాహం బైలుదేరింది. కానీ ఆ ఉపన్యాసం ఒక వందవేల డాలర్లు తీసుకొనే లాయరు ఉపన్యాసమూ కాదు, పూర్వంమాదిరిగా ఆలంకారికంగా మాట్లాడిన వ్యక్తి వాగ్ధోరణీకాదు.

"మిథ్యావాదాలమీద మిథ్యావాదాలు! ఒక్కగంటలో ఇన్ని అబద్ధాలవాదల్ని, నాజన్మంలో ఇంతవరకెన్నడూ వినలేదు. పైగా, నీకో విషయం చెప్పాలి. నీవుచెప్పిన కొత్తవిషయం ఏమీలేదబ్బాయ్! నీవు పుట్టకముందే నేనీ విషయమంతా కాలేజిలో చదువుకున్నా. ఇంచుమించు రెండుశతాబ్దాలకు పూర్వమే నీ యీ సోషలిస్టుసిద్ధాంతాన్ని జీన్ జాక్వెస్ రూసో చెప్పాడు. నిజంగా, మళ్లీ మట్టిలోకి పోవడమిది! తల్లకిందు తత్త్వం! మన శారీరకశాస్త్రం ఇది కానిపని అని చెపుతోంది. మిడిమిడి జ్ఞానం అపాయకరమన్నమాట అక్షరాలానిజం. నీ పిచ్చి సిద్ధాంతాలద్వారా ఈ రాత్రిదానికి నీవు లక్ష్యమన్నది తేల్చావ్. మిథ్యావాదాలమీద మిథ్యావాదాలు! నా జీవితంలో ఎన్నడూ ఇన్ని శుద్ధఅబద్ధవాదాల్తో ఇంతగా నాకు అసహ్యం కలగలేదు. అపరిపక్వమైన నీ సామాన్యీకరణ, నీ తెలివితక్కువ హేతువాదనల్తో మరీ ఏవగింపుకలిగింది!" అని వాన్గిల్బర్ట్ బొబ్బపెట్టాడు. అతడు ద్వేషంతో చేతివేళ్లు మెలిపెట్టుకుంటూ కూర్చున్నాడు. ఆడవాళ్ళ పెదవులమీద అంగీకార సూచకాలు నాట్యంచేసినై. మొగవాళ్ళదగ్గర్నుంచి దృఢాంగీకారాలు వచ్చినై. మాట్లాడడంకోసం హడావుడిచేసే డజనుమందిలో అరడజనుమంది ఒక్కసారే మాట్లాడడం ప్రారంభించారు. ఆ

గందరగోళం వర్ణించడానికి వీల్లేనిది. మిసెస్ పెర్టెన్‌వైత్ విశాలకుడ్యాలిటు వంటి దృశ్యాన్నెప్పుడూ దర్శించలేదు. వీళ్లు మెత్తగా కనపడే పారిశ్రామిక అధిపతులు! వీళ్లు సామాజికాధినేతలు! సాయంకాలపుదుస్తుల్లో బుస్సలు కొట్టే అనాగరికులు వీళ్లే! వాళ్లి ముల్లెలకోసమని ఎర్నెస్టు చేతులు చాచే టప్పటికి వాళ్లు నిజంగా నిలువునా కంపించిపోయారు. ఆయన రెండు చేతులూ, లక్షల విప్లవవాదుల చేతుల్లాగా వాళ్లి కళ్ళకు సాక్షాత్కరించిన్నై.

కానీ ఎర్నెస్టుమాత్రం ఇటువంటి క్లిష్టపరిస్థితుల్లోగూడా మనస్థైర్యాన్ని కోల్పోలేదు. కర్నల్ వాన్‌గిల్బర్ట్ కూర్చోనీ కూర్చోకముందే ఎర్నెస్టు అమాంతంగా లేచి ముందుకువచ్చాడు.

“తేపకొక్కడు!” అని ఆయన వాళ్ళను గర్జించాడు. విశాలమైన ఆయన ఊపిరితిత్తుల్లోనుంచి వచ్చిన ఈ గర్జారావం, మానవ జంఝూనిలాన్ని మ్రింగేసింది. కేవలం తన మూర్తిత్వంవల్లనే గందరగోళాన్ని అరికట్టి ప్రశాంతాన్నేర్పర్చాడు.

“తేపకు ఒక్కడు,” అని ఆయన ప్రశాంతంగా మళ్ళీ అన్నాడు. “కర్నల్ వాన్‌గిల్బర్ట్‌కు సమాధానం చెప్పనియ్యండి. తర్వాత మిగిలిన మీరంతా వద్దురుగాని. కానీ ఒకొక్కక్కళ్ళు ఒకొక్కసారి అన్న సంగతి జ్ఞాపకముంచుకోండి. మంది ప్రదర్శనాలిక్కడ పనికిరావు. ఇదేమీ ఫుట్‌బాల్ రంగస్థలంకాదు.”

“ఇక మీవిషయం” అంటూ ఆయన కర్నల్ వాన్ గిల్బర్ట్ వేపు తిరిగి తన సంభాషణ కొనసాగించాడు. “నేను చెప్పిందానికి మీరేమీ సమాధానం చెప్పలేదు. నామేధశ్శక్తినిగూర్చి మీరు కేవలం ఆగ్రహపూరితమైన పిడివాదం చేసారు. మీరుచేసే పనిలో మీకది ప్రయోజనకారి కావచ్చు. కానీ నాతో మీరట్లా మాట్లాడలేరు. చేతిలో టోపీపెట్టు

కోని నా కూలీపెంచమనిగాని, నేను పనిచేసే యంత్రించుంచి నన్ను కాపాడ మనిగానీ దేవురించే కార్మికుణ్ణిగాదు. కూలీ బానిసల్తో వ్యవహారించేటప్పుడు మినహా, మీరు నాతో వ్యవహరించేటప్పుడు సత్యంవిషయంలో మొండిగా ఉండటానికి వీల్లేదు. వాళ్లు మీరు ఎదురు సమాధానంచెప్పడానికి సాహసించరు. ఎందుకంటారా? మీచేతుల్లో వాళ్ల తిండీ తిప్పలూ, వాళ్ల జీవితాలూ ఇరుక్కుపోయినై. "

"నేను పుట్టకముందే మీరు కాలేజీలో నేర్చుకొన్నామని చెప్పిన 'మళ్లీ మట్టిలోకే' అన్న సిద్ధాంతానికివద్దాం. అనుమతించండి. దీనివల్ల మీరు ఓనమాలుకూడా నేర్చుకోలేదని చెబుతున్నా. గణితశాస్త్రవిభేదాల్తో జైబులుకేమాత్రం సంబంధం ఉందో సోషలిష్టు సిద్ధాంతానికీ ప్రకృతికీ అటువంటి సంబంధం ఉంది. వ్యాపారజగత్తు మినహాయిస్తే, మీ వర్గం శుద్ధ మొద్దు అని నేనన్నా. అయ్యో! మీరు మీ తెలివితేటలద్వారా నా ప్రకటనకు సాక్షీభూతులైనారు. "

తన వందవేలడాలర్ల లాయరుకు జరిగిన తీవ్రప్రతిఘటనకు మిస్ బ్రెంట్‌వుడ్ తమాయించుకోలేకపోయింది. ఆమె మూర్ఛ భయంకరంగా పరిణమించింది. ఆమె పిచ్చి పిచ్చిగా నవ్వడం, ఏడవడం ప్రారంభించింది. ఆమెను తక్కినవాళ్లు సహాయంపట్టి ఆ గదిలోనుంచి తీసుకువెళ్లారు. అప్పటికది నయమే. ఎందుకంటే ముందున్నది ముసళ్ళ పండుగ.

మధ్యలోవచ్చిన ఆటంకం తొలిగిపోయిన తర్వాత ఎర్నెస్టు మళ్ళీ ఉపక్రమించాడు. "నామాటే ఖాయమని తీసుకోవద్దు. స్వయంగా మీ సాధికారవచనాలే, మీరు తెలివితక్కువ దద్దమ్మలని ఏకగ్రీవంగా రుజువు చేస్తయ్. మీరు స్వయంగా అద్దెకుతెచ్చుకొన్న విజ్ఞానప్రదాతలే మీది తప్పని చెపుతారు. నెమ్మదస్తుడైన మీ సాంఘికశాస్త్ర కనిష్ఠసహాయ ఉప

న్యాయనిర్ణేత దగ్గరికి పోయి, 'మళ్ళీ ప్రకృతికే' అన్న రూసో సిద్ధాంతానికీ, సోషలిస్టు సిద్ధాంతానికీ భేదమేమిటని అడగండి. మీ ధనికవర్గ శ్రేష్ఠ ప్రామాణిక రాజకీయార్థిక శాస్త్రజ్ఞుల దగ్గరకీ, సాంఘికతత్వవేత్తల దగ్గరికీ పోయి అడగండి. మీరు పోషించే పుస్తకభాండాగారాల బీరువాల్లో దాచి ఉంచిన పుస్తకాల్లో ఈ విషయానికి సంబంధించిన గ్రంథాలు తెరచి దాన్లో ఉన్న ప్రతిపుటనూ ప్రశ్నించండి. 'మళ్ళీ ప్రకృతికే' అన్నదానికీ, సోషలిజానికీ ఏమీ సామ్యంలేదనే; ఇన్నీ ఇచ్చే ఏకైకసమాధానం. పైగా, 'మళ్ళీ మట్టికే' అన్న సిద్ధాంతం, సోషలిస్టు సిద్ధాంతం పరస్పర వ్యతిరేక సిద్ధాంతాలని అవన్నీ ముక్తకంఠంతో జవాబిస్తయి. నేనింతకుముందు చెప్పినట్టుగా నామాటనే విశ్వసించవద్దు. మీ రెజన్నానా చదవని మీ సొంతపుస్తకాల్లోనే మీ తెలివితక్కువతనం అక్షరనిక్షిప్తమై ఉంది. ఇక మీ తెలివితక్కువతనానికి సంబంధించినంతవరకూ, మీరు మీ వర్గానకంతకూ సాక్ష్యంగాఉన్నారు."

"కర్నల్ వాన్‌గిల్బర్టు మహాశయా! మీకు న్యాయశాస్త్రం, వ్యాపారం తెలుసు. కార్పోరేషన్లకెట్లా సేవచేయాలో, చట్టాన్ని మలచి లాభాలెట్లా ఎక్కువచేయాలో మీకు తెలుసు. అది మంచిదే. దానికే అంటిపెట్టుకొని ఉండండి. మీరు పేరుకొక మనిషి, ఘటికులైన న్యాయవాదులు. కానీ మీకు చారిత్రిక విషయంలో ప్రవేశంలేదు. మీకు సాంఘికశాస్త్రంయొక్క తూర్పూ పడమరాకూడా తెలియదు. మీ జీవశాస్త్రం ఇక్ష్వాకుల కాలంనాటిది."

ఇక్కడ కుర్చీలో కర్నల్ వాన్‌గిల్బర్టు గిలగిల్లాడిపోతున్నాడు. గదంతా పరిపూర్ణప్రశాంతంగా ఉంది. ప్రతివ్యక్తీ మంత్రిబద్ధుడై, పక్షవాతం వచ్చినట్లయిపోయి చలనంలేకుండా కూర్చున్నాడు అని చెప్పవచ్చు. కోర్టులో ఏ కర్నల్‌వాన్ గిల్బర్టు లేస్తే జడ్జీలుసైతం గజగజా వణికిపోతారో, అటువంటి ఘటికుడైన కర్నల్ వాన్‌గిల్బర్టుకు జరిగిన, ఇటువంటి భయంకర మహాఘోర

ప్రస్తావన ఇంతకుముందెన్నడూ విన్నదీకాదు — కలలో గూడా ఊహించిందికాదు — నమ్మటానికికూడా శక్యమైందికాదు. కానీ ఎర్నెస్టు ఎప్పుడూ ప్రతికక్షికి నిలవడానికి నీడ ఇవ్వడు.

"ఇది మిమ్మల్ని అధిక్షేపించడానికి కాదనుకోండి. ఏ వ్యక్తి వృత్తి ఆ వ్యక్తిది. మీరు మీవృత్తికే కట్టుబడి ఉండండి. నేను నావృత్తికి అంటిపెట్టుకొని ఉంటా. మీరు ప్రత్యేకత్వాన్ని సంపాదించారు. చట్టానికి సంబంధించిన విజ్ఞాన విషయం వచ్చినప్పుడు, చట్టాన్ని ఎంత బాగా త్రోసిరాజనవచ్చో, లేక కార్పొరేషన్లను దోచుకోడానికి క్రొత్తచట్టాన్ని లాభదాయకంగా ఎట్లా ఉపయోగించుకోవచ్చో, అన్నవిషయంవచ్చినప్పుడు నేను మీ పాదాక్రాంతుణ్ణవుతా. కానీ, నా వృత్తియైన సాంఘికతత్త్వవిషయం వస్తేమటుకు, మీరు నాపాదధూళినాశ్రయించాల్సిందే. దీన్ని జ్ఞాపకం పెట్టుకోండి. మీ న్యాయశాస్త్రం ఒక్కరోజుకు సంబంధించిన సాధనమాత్రమే. మీరు ఆ సాధనతో ఒక్కరోజుకన్నా ఎక్కువ ఉండటానికి అనర్హులు అన్నదికూడా గుర్తుంచుకోండి. కాబట్టి చారిత్రక విషయాలమీదా, సాంఘిక విషయాలమీదా మీరు చేసిన కుతర్కాలూ, తొందరపడి ఉద్రేకంతో చేసిన సిద్ధాంతీకరణలూ వృథా కంఠశోష." అన్నాడు ఎర్నెస్టు.

ఎర్నెస్టు ఒక్కక్షణం ఆగి, కోపంతో నల్లబారి ముడతలుబడ్డ అతని మొగం, దడదడ కొట్టుకొంటున్న అతని గుండె, వణకుతున్న అతని శరీరం, కోపంతో పిడికిలి బిగుస్తూ తెరుస్తూ ఉన్న అతని తెల్లని చేతులూ పరిశీలిస్తూ, అతణ్ణిగూర్చి సాలోచనగా చూసాడు.

"ఊపిరి పీల్చుకుంటానికి మీకు కొంత వ్యవధి కావాల్సినట్లున్నది. నేను మీకా అవకాశం ఇస్తా. నేను మీ వర్గంపై నిందారోపణచేశా. నేను చేసిన నిందారోపణ తప్పని చూపించండి. ఆధునిక మానవుడి నికృష్ట

జీవితాన్ని ఎవరి శ్రమశక్తి లేకపోతే లాభాలు రావడానికి అవకాశంలేదో ఆ సంయుక్తరాష్ట్రాల్లో ఉన్న 30 లక్షల బాలబానిసల్ని, అర్ధాకలితో, గోచిపాతల్తో ఆకాశంక్రింద తలదాల్చుకొనే 150 లక్షల ప్రజల్ని మీకు ఎత్తిచూపించా. సాంఘిక నిర్మాణంద్వారా, యంత్రోపయోగం వల్ల ఆధునిక మానవుడి ఉత్పత్తిశక్తి, గుహానివాసియొక్క ఉత్పత్తిశక్తికన్నా వేయిరెట్లు గొప్పదనికూడా చూపించా. ఈ రెండు సత్యవిషయాల వల్ల పెట్టుబడిదారివర్గం అక్రమయాజమాన్యం వహించిం దన్నది తప్ప మరో సారాంశం తీయడానికి వీల్లేదని ఉద్ఘాటించా. ఇదీ నా నిందారోపణ. ప్రత్యేకంగా అడుగడుగునా దీనికి సమాధానం చెప్పండని మిమ్మల్ని సవాలు చేసా. అంతేకాదు. నే నింకోటికూడా చేసా. మీరు సమాధానం చెప్పలేరని జోస్యం చెప్పా. నా అంచనా దెబ్బతీయడానికి మీకు అవకాశం ఉంది. నేను మాట్లాడింది అభూతకల్పన అని వీర న్నారు. కర్నల్ వాన్‌గిల్బర్ట్ మహాశయా! ఆ భూతకల్పన ఏమిటో చూపండి! మీ మీదా, మీ వర్గంమీదా నేనూ, మా పదిహేనువందలవేల మిత్రులూ చేసిన దోషారోపణకు సమాధానం చెప్పండి! ”

తాను అధ్యక్షతవహించానవీ, అవకాశం కావాలని ఆందోళనచేసే తక్కినవాళ్లకు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వాల్సిన సభామర్యాద తనకు ఉన్నదనీ కర్నల్ వాన్‌గిల్బర్ట్ పూర్తిగా మరచిపోయాడు. అతడు చేతు లూపుకుంటూ తటాలునలేచి నిలబడ్డాడు. అతని ఆలంకారిక వచనాలూ, ఆత్మనిగ్రహం గాలిలో అంతర్ధానమైపోయినై. ఎర్నెస్టుయొక్క చిన్న తనపు వయస్సు నొక్కసారి, ఆయన పర్జల్ని రెచ్చగొట్టేవాడని నిందిస్తూ ఒక్కొక్క సారి, శ్రామికవర్గం దమ్మిడీ విలువకూడా చేయుని వర్తి వాజమ్మరకం దని మొరటుగా దాన్నెదుర్కొంటూ మరొకసారి ఇట్లా అసందర్భంగా మాట్లాడాడు

"చెప్పే విషయానికి అంటిపెట్టుకోకుండా తలా తోకాలేని సంభాషణ చేసే మీవంటి లాయర్ని నేనింతవరకూ ఒకణ్ణయినా చూడలేదు. నేను చెప్పిన విషయానికీ, నా చిన్నతనపు వయస్సుకూ ఏమీ సంబంధంలేదు. అట్లాగే శ్రామికవర్గంయొక్క నిరర్థకత్వానికీ, నావయస్సుకూ సంబంధంలేదు. పెట్టుబడిదారీవర్గం దురధికారం చెలాయించిందని నేను ఆరోపించా. దానికి మీరు సమాధానం చెప్పలేదు. సమాధానం చెప్పడానికి ప్రయత్నంకూడా చేయలేదు. ఎందుకని ? మీకు చెప్పే సమాధానంలేనందువల్లనేనా ? ఇక్కడ సమావేశమైనవాళ్ళందర్లోకీ నీవు మొనగాడివి. నేను తప్ప ఇక్కడున్న ప్రతివ్యక్తీ మీ నోట్లోనుంచి ఎటువంటి సమాధానంవస్తుందోనని గుటకలు మింగుతున్నారు. ఎందుకంటే వాళ్లు చెప్పే సమాధానంలేదు. ఇక నావిషయమంటే, నేనింతకుముందు చెప్పినట్లుగా, మీరు సమాధానం చెప్పలేకపోవడమే కాకుండా, సమాధానం చెప్పడానికి ప్రయత్నంకూడా చేయరన్నది తెలుసు." అని ఎర్నెస్టు తనమీదకువచ్చిన ఎదురుదాడికి సమాధానం చెప్పాడు.

"ఇది సహించరానిది! ఇది అవమానం!" అని కర్నల్ వాన్ గిల్బర్టు క్రోధంతో కేకపెట్టాడు.

"మీరు సమాధానం చెప్పలేకపోవడం సహించరానిది." అని ఎర్నెస్టు గంభీరంగా మాట్లాడాడు. "మేధాసంపత్తి విషయకంగా ఎవరూ అవమానింపబడరు. అవమానం అనేది ప్రకృతిసిద్ధంగా ఉద్రేకానికి సంబంధించింది. తెప్పరిల్లండి! సమాజంపై పెట్టుబడిదారీవర్గం అక్రమ యాజమాన్యం వహించిందని విజ్ఞానయుక్తంగా నేనుచేసిన ఆరోపణకు విజ్ఞానయుతంగా సమాధానమీయండి."

కర్నల్ వాన్గిల్బర్టు కిమిన్నాస్తిగా కూర్చున్నాడు. ఎంతసాహసానికైనా తెగించేవాడికి, మాటల్తో ప్రతీకారంచేయలేని వ్యక్తి మొగం మీద

ద్యోతకమయ్యే కోపభూయిష్టమైన అహంభావ లక్షణాలు అతని మొగం మీద కనిపించినై.

“దిగుల్తో క్రుంగిపోవాకండి! ఆ నిందారోపణకు మీ వర్గంలో ఏ ఒక్కవ్యక్తీ, ఇంతవరకూ సమాధానం చెప్పలేదన్న సత్యంతో ఊరట చెందండి!” అన్నాడు ఎర్నెస్టు. తర్వాత మాట్లాడదామని తహతహలాడే వాళ్ళవేపు తిరిగి, “ఇక మీకు అవకాశంవచ్చింది. నిప్పులు కురిపించండి; కర్నల్ వాన్‌గిల్బర్టు ఇవ్వడానికి విఫలమైన సమాధానం ఇవ్వమని, మిమ్మల్ని సవాలుచేస్తున్నమాట మరచిపోవద్దు.” అన్నాడు.

ఆ చర్చలో చెప్పిన విషయమంతా వ్రాయడం అశక్యం. మూడు గంటల కాలంలో ఎన్నిమాటలు మాట్లాడవచ్చో నేనింతకు ముందు గ్రహించలేదు. ఏమైనా అది చాలా విజయవంతంగా ఉంది. తన ప్రత్యర్థులు రెచ్చిపోయినకొద్దీ కావాలని ఎర్నెస్టు వాళ్ళను మరింత రెచ్చగొట్టాడు. ఆయన విజ్ఞానమహోదధి. ఆయన తన నిశిత పదజాలంతో వాళ్ళను చీల్చి చెండాడు. వాళ్ల కుతర్కంలోని పొరపాట్లను ఎత్తిచూపించాడు. ఇది కుతర్కవిధానం. ఆ నిర్ణయానికీ, అసలువిషయానికీ సంబంధం ఆమడదూరం. ఏ సారాంశాన్నైతే మీరు రుజువుపర్చాలని ప్రయత్నించారో, అది రెండవ సాధరణీకరణంలోనే నిగూఢమైఉంది. అసలు సాధరణీకరణమే సత్యదూరంగా ఉంది. ఇది శుద్ధతప్పు. అది ఊహామాత్రమే. దాని తర్వాతది, గ్రంథస్థమై నిర్ణీతమైన సత్యసూత్రం మీద ఆధారపడినదానికి వ్యతిరేకమైన సిద్ధాంతం. ఈవిధంగా ఆచర్చ సాగింది. కొన్ని పర్యాయా లాయన గదకు బదులుగా కత్తిమూసి వాళ్ల భావనల్నీ, ఊహాల్నీ ఎడాపెడా చీల్చి చెండాడు. ఆయన ఎప్పుడూ సత్యవిషయాల్ని చెప్పమని కోరాడు. కేవలం సిద్ధాంతాల మీద చర్చించడానికి నిరాకరించాడు. ఆయన చెప్పిన సత్యవిషయాలు వాళ్ళకు మింగరాని పచ్చి ఎలక్కాయలైనై. వాళ్లు కార్మికవర్గంమీదికి

దాడిచేసినప్పుడల్లా "కుండ, చట్టిని నల్లగా ఉన్నావన్నట్లుగా; మీ మొగనే ముర్గ్గా ఉందని చెప్పడం నా నిందారోపణకు సమాధానం కానేకాదు." అని ప్రతిఘటించాడు. ఆయనింకా అక్కడున్న ప్రతివ్యక్తిని "మీవర్గం అక్రమ యాజమాన్యం వహించిందని నేను చేసిన ఆరోపణకు మీ రెందుకు సమాధానం చెప్పలేదు? మీ రితరవిషయాల్ని గురించి, ఇతరవిషయాలకు సంబంధించిన ఇతరవిషయాల్నీ మాట్లాడారు కానీ నాకు సూటిసమాధానం చెప్పలేదు. మీకు సమాధానం చెప్పడానికి ఏమీ లేకపోయినందువల్లనేనా?" అని అడిగాడు.

చర్చంతా ముగింపుకువచ్చినతర్వాత విక్సన్ మాట్లాడాడు. ఆయనొక్కడే ప్రశాంతంగా ఉన్నాడు. తదితరుల కెవరికీ చూపని గౌరవాన్ని ఎర్నెస్టు ఆయనకు చూపించాడు.

"ఏరకమైన సమాధానం అవసరంలేదు. జరిగిన మొత్తం చర్చను ఆశ్చర్యంతో, విసుగుతో నేను ఆలకించాను. నావర్గానికి సంబంధించిన మహామహులారా! నాకు, మీతో విసుగెత్తిపోయింది. మీరంతా బళ్ళో పిల్లలమాదిరిగా పిచ్చిగా ప్రవర్తించారు. మీకు తెలియని నైతికశాస్త్రంలో జోక్యం కలగజేసుకొని, అర్థంపర్థం తెలియని సామాన్య రాజకీయవాది బూకరించి పెడబొబ్బలు పెట్టినట్లుగా ప్రవర్తించారు. మీరంతా పరాజితులయ్యారు. మీరు కేవలం మాటలపసతో అర్థంపర్థంలేని గంద్రగోళంచేసారు. ఎలుగ్గొడ్డుమీద ముసిరిన ఈగలమాదిరిగా అల్లరిచేసారు." అని విక్సన్ ప్రశాంతంగా, గంభీరంగా మాట్లాడి, ఎర్నెస్టును చూపిస్తూ, "మహాశయులారా! అదిగో ఎలుగ్గొడ్డు. మీ ఈగలమోత, దానిచెవులకు కాస్త చలనం కలిగించింది."

"పరిస్థితి బాగా విషమించింది. నామాట నమ్మండి. ఆ ఎలుగు ఈ రాత్రి మనల్ని త్రొక్కివేయడానికి తన పంజావిప్పి పైకి లంఘించింది.

అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో 1500 లక్షల విప్లవవాదులున్నారని చెప్పాడు. అది సత్యం. మన ప్రభుత్వాల్ని, మన రాజప్రాసాదాల్ని, ఇంకా తదితరమైన మన దేవేంద్రభోగాల్ని ఊడబెరుక్కోవడం వాళ్ల ఉద్దేశ్యం అని చెప్పాడు. ఒకమార్పు – ఒక గొప్పమార్పు సమాజంలో వస్తోంది. కానీ అదృష్టవశాత్తూ, ఈ ఎలుగు ఊహిస్తున్న మార్పు మాత్రం అదికాకుండా ఉంటే చాలా మంచిది. మనల్ని అణగత్రొక్కేస్తానని ఆ ఎలుగు చెప్పింది. మనమే ఆ ఎలుగును మట్టుగిస్తేనో ? ”

ఆ పెద్ద గదిలో బాగా అలజడి బైలుదేరింది. ఔనన్నట్లు ఒకళ్లకొకళ్లు తలలూపుకొన్నారు. వాళ్ళ మొగాలు గంభీరమైనై. వాళ్లంతా యోధులు. అది ముమ్మాటికీ తథ్యం.

“ కానీ, మాటల అలజడితో మనం ఎలుగును త్రొక్కివేయలేం, ” అని మిస్టర్ విక్సన్, ఏమాత్రం ఆవేశంలేకుండా ప్రశాంతంగా తన ఉపన్యాసాన్ని కొనసాగించాడు. “ మనం ఎలుగుబంటిని వేటాడుతాం. మనం ఎలుగుకు మాటల్తో సమాధానం చెప్పం. మనం చెప్పే సమాధానం ఆయుధాల్తోటే. మనం అధికారంలో ఉన్నాం. దీన్నెవరూ కాదనరు. ఈ అధికారప్రాబల్యంద్వారా, మనం ఇంకా అధికారంలోనే ఉంటాం.”

ఆయన వెంటనే ఎర్నెస్టువైపు తిరిగాడు. అదొక నాటకసన్నివేశంలాగా ఉంది. “ ఇక మా సమాధానం ఇది. నీతో మేం మాటల్తో వ్యర్థకాలక్షేపంచేయం. మీరు మీ బలిష్టాలైన హస్తాల్తో మా సౌధాలకోసం, మా సౌభాగ్యంకోసం మా మీదికి విరుచుకుపడ్డప్పుడు, బలం అంటే ఏమిటో మీకు మేం రుచిచూపిస్తాం. తుపాకుల, బాంబుల, టాంకుల భయంకర గర్జారావాల్లో మా సమాధానం మీకు వినిపిస్తుంది. మీ విప్లవాదులందర్నీ మా పాదాలక్రింద చీమల్ని రాచేసినట్లు రాచేస్తాం. మేం మీ మొగాల మీదగా త్రొక్కుకుంటూపోతాం. ఈ ప్రపంచం మాది. మేం దీనికి

అధినేతలం. ఇది మా అధీనంలోనే ఉండిపోతుంది. ఇక శ్రామికుల విషయానికి వద్దాం. చరిత్ర ప్రారంభంనుంచీ వాళ్లు అధోగతిలోనే ఉన్నారు. నేను చరిత్రను సక్రమంగా అధ్యయనం చేశా. నేనూ, నాకు సంబంధించినవాళ్లూ, మా తర్వాతవచ్చేవాళ్ళూ అధికారంలో ఉన్నంతవరకూ, వాళ్ళు అధోగతిలోనే ఉంటారు. ఒక్కటే పదం ఉంది. అది అన్ని పదాల్లోకి రాజా పదం. ఆ మాట – 'అధికారం.' దేవుడుగాదు, ధనదేవతా గాదు, అధికారం. ఈ మాట మీ నాలుకమీద నిత్యతాండవం చేసేటట్లుగా దీన్ని మీరు శతసహస్ర పర్యాయాలు ఉచ్చరించండి."

"నాకు సమాధానం లభించింది. ఇవ్వదగ్గ సమాధానం అదొక్కటే. అధికారం. శ్రామిక వర్గానికి సంబంధించిన మేమూ బోధించేదదే. మాకు తెలుసు. ఋజుత్వానికీ, ధర్మానికీ, మానవత్వానికీ సంబంధించిన వినతులు మిమ్మల్నేమాత్రం కదిలించవన్న విషయం మా కఠినానుభవాలద్వారా బాగా తెలుసుకున్నాం. దరిద్రజీవుల మొగాలమీదగా నడచిపోయే మీ పాదాలెంత కఠినంగా ఉంటయ్యో, మీ హృదయాలు అంత శిలామయాలు. కాబట్టే మేం అధికారాన్ని ప్రబోధించాం. ఎన్నికలరోజున మా బాలెట్ అధికారంద్వారా మీ దగ్గరనుంచి ప్రభుత్వాన్ని పడగుంజుకొంటాం–" అని ఎర్నెస్టు ప్రశాంతంగా మాట్లాడాడు.

"ఎన్నికల రోజున మీరు అత్యధికబలాన్ని సంపాదిస్తేమాత్రమేం? బాలెట్ పెట్టెద్వారా మీరు ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకున్నప్పుడు, దాన్ని మీ పరంచేయడానికి మేం నిరాకరిస్తామనుకో." అని మిస్టర్ విక్సన్ మధ్యలో ఒక సవాలు విసిరాడు.

"ఆ విషయంకూడా మేం ఆలోచించాం. మేం మీకు ఆయుధాల ద్వారా తగ్గ సమాధానం చెప్తాం. పదాలన్నిట్లోకీ అధికారం రాజా పదం అని మీరన్నారు. మంచిది. అది అధికారంగానే వుంటుంది. బాలెట్

పెట్టెద్వారా మేం అత్యధిక బలంతో విజయాన్ని సాధించిననాడున, రాజ్యాంగపద్ధతులద్వారా ప్రశాంతంగా మేం ఆక్రమించుకొన్న ప్రభుత్వాన్ని మీరు మాకు అప్పగించడానికి నిరాకరించిననాడు, మీరేంచేస్తారు అని మీరు మమ్మల్ని ప్రశ్నించారు. ఆ నాడు, బాంబులు, తుపాకులు, టాంకులు, తదితరమైన మారణాయుధాలద్వారా మేం మీకు తిరుగు సమాధానంచెప్తాం" అని నేను చెబుతున్నా.

"మీరు మానుంచి తప్పించుకుపోలేరు. మీరు చరిత్రను సరైనదృష్టితో చదివారన్నది నిజమే. చరిత్ర ప్రారంభంనుంచీ శ్రామికులు అధోగతిలో ఉన్నారన్నదీ యథార్థమే. మీరూ, మీ వాళ్లూ, మీ తర్వాత వచ్చే వాళ్ళూ అధికారంలో ఉన్నంతవరకూ, శ్రామికులు అధోగతిలోనే ఉంటారన్నది కూడా సత్యమే. నేను మీతో ఏకీభవిస్తా. మీరు చెప్పిందంతా నేను అంగీకరిస్తా. అధికారం తీర్పిస్తుంది. ఎప్పుడూ తీర్పుచెప్పేది అధికారమే. అది వర్గపోరాటం. పూర్వ భూస్వామ్య ఆడంబరాన్ని మీ వర్గం క్రిందికి లాగేసినట్లుగానే, మా శ్రామికవర్గం, మీ పెట్టుబడిదారివర్గాన్నీ అధఃపతనం చేస్తుంది. మీరు ఎంత నిర్దుష్టంగా చరిత్రను పఠించారో, అంత నిర్దుష్టంగానూ జీవశాస్త్రాన్నీ, సాంఘికశాస్త్రాన్నీ చదివితే, నేను వర్ణించిన ఈ అంతిమ ఫలితం తప్పించుకోడానికి వీల్లేనిదని మీకే స్పష్టమౌతుంది. ఒకటా, పదా, వెయ్యిసంవత్సరాలా అన్నది ముఖ్యంగాదు. మీ వర్గం తప్పకుండా అధఃపతనమౌతుంది. అదికూడా అధికారంద్వారానే జరుగుతుంది. మా మనస్సులుకూడా దాంతో మమేకమైపోయేటంతగా, శ్రామిక వర్గానికి సంబంధించిన మేం, ఆ పదాన్ని అనేక పర్యాయాలు జపించాం. అధికారం. అది రాజా పదం." అని ఎర్నెస్టు సమాధానం చెప్పాడు.

ఈ విధంగా ఫిలోమత్స్‌తో ఆ రాత్రి గడిచింది.

౬

ఆపాటికి, ముందు రాబోయే పరిస్థితుల్ని గూర్చిన హెచ్చరికలు మాకు శరవేగంతో తుప్పతిప్పలుగా వస్తున్నయ్. సోషలిస్టుల్ని, కార్మిక నాయకుల్ని తన ఇంట్లో సమావేశపర్చడం, బహిరంగంగా సోషలిస్టు సభలకూ సమావేశాలకూ హాజరుకావడంలో గల ఉద్దేశ్యమేమిటని మానాన్నను ఎర్నెస్టు ప్రశ్నించాడు. తననుగురించి ఇంతశ్రమ తీసుకొంటున్నందుకు మానాన్న ఎర్నెస్టునుగూర్చి కేవలం పరిహాసంచేసి ఊరుకొన్నాడు. ఈ కార్మికవర్గ నాయకుల్తోటీ, మేధావుల్తోటీ కలిగిన పరిచయంద్వారా నామటుకు నేను, ఇంకా చాలా విషయాలు గ్రహిస్తున్నా. కార్మికవర్గ ప్రపంచానికి సంబంధించిన యధార్ధ పరిస్థితుల్ని అవగాహన చేసుకొంటున్నా. నాఎదుట విశ్వరూప సాక్షాత్కారంచేసిన అనంతమైన తాత్త్విక, శాస్త్రీయ సామ్యవాద సారస్వతాన్ని చూచి కొంచెం భయపడ్డప్పటికీ, నాకు పరిచయమైన నిస్వార్ధత్వానికీ, ఉన్నతాదర్శాలకూ అత్యంత ప్రమోదాన్ని చెందా. త్వరత్వరగా అవగాహన చేసుకొంటున్నా. కానీ, అప్పటి మాపరిస్థితిలోఉన్న ప్రమాదాన్ని గుర్తించ కల్గినంత త్వరగామాత్రం అర్ధంచేసుకోలేదు.

హెచ్చరికలు వస్తున్నయ్. కానీ వాటిని నేను ఖాతరుచెయ్యలేదు. ఉదాహరణకొక్కవిషయంచూద్దాం. విశ్వవిద్యాలయం ఉన్న ఈ పట్టణంలో శ్రీమతులు పెర్టన్‌వైత్, విక్సన్‌లు సమాజంలో గొప్ప ప్రాబల్యాన్ని సంపాదించారు. వారివల్ల, నేను చాలా ముందడుగువేసేదానిననీ, ఆత్మస్థైర్యంకల యువతిననీ, అధిక ప్రసంగిననీ, ఇతరవిషయాల్లో పిలువని పేరంటంగా తయారయ్యేతుంటాననీ జనంలో ఒక అపోహ ఏర్పడింది. జాక్సన్ చేతివిషయంలో, పరిశీలనార్ధంగా నేను వహించిన పాత్రవుబట్టి వాళ్ళల్లో

ఇటువంటి అభిప్రాయాలు ఏర్పడడం అసహజమేమీ కాదుగే అనుకొన్నా. కానీ, సంఘంలో అటువంటి ప్రాబల్యాన్ని సంపాదించిన మధ్యవర్తుల హోదాలో ఉన్న ఆ ఇద్దరు కలిగించిన ఈ భావంవల్ల కలిగే ఫలితాన్ని నేను తక్కువ అంచనా వేసుకొన్నా.

నిజమే. సర్వసాధారణంగా నాతో దోస్తీగా తిరుగుతూండే స్నేహిత బృందం నాకు దూర దూరంగా తొలిగిపోతున్నారన్న విషయం గమనించా. కానీ, నేను ఎర్నెస్టును పెండ్లిచేసుకోడానికి చేసుకొన్న నిశ్చయానికి, నా చుట్టూ తిరిగేవాళ్లల్లో ఉన్న దృఢ అంగీకారంవల్లనే ఇది జరిగిందని సమాధానపడ్డా. నా వర్గానికి సంబంధించిన ఈ సాధారణ వైఖరి అయత్న కృతంకాదని, దీనివెనకాల పెద్ద గూడుపుఠాణీ ఉందనీ కొన్ని రోజుల తదనంతరం నాకు ఎర్నెస్టు విస్పష్టంచేసినతర్వాతగాని నాకు అసలు సంగతి తెలియలేదు. "నీ వర్గానికి సంబంధించిన శత్రువుకి నీవు ఆశ్రియం ఇచ్చావ్. ఆశ్రయమివ్వడమే కాదు, నీ అంతట నీవే నీ ప్రేమనుకూడా అతడికి అర్పణంచేశావ్. ఈ చర్య నీ వర్గానికి విద్రోహం. దీనికి తగ్గ శిక్ష అనుభవించకుండా తప్పించుకుపోతానని అనుకోవాకు." అని ఆయన చెప్పాడు.

కానీ, ఇదిజరగడానికి పూర్వం ఒకరోజు సాయంకాలం మానాన్న ఇంటికి తిరిగి వచ్చాడు. అప్పుడు ఎర్నెస్టుకూడా నాతో ఉన్నాడు. మా నాన్న ఆగ్రహంతో —ఆధ్యాత్మికమైన ఆగ్రహంతో ఉండడం గమనించాం. ఆయన నిజంగా కోపంగా ఉండడం అరుదు. కానీ, హద్దుదాటని కోపాన్ని అంగీకరిస్తాడు. అది ఒక ఔషధంవంటిదంటాడు. అప్పుడాయన గదిలో ప్రవేశించేటప్పుడు హద్దుమీరని కోపంలో ఉన్నాడు.

"నేను విల్‌కాక్సుతో ఫలాహారంచేసా. మీరేమనుకొంటున్నారు?" అని ఆయన అడిగాడు.

ఉద్యోగ విరమణానంతరం పింఛను పుచ్చుకొనే విశ్వవిద్యాలయాధ్యక్షుడుగా విల్ కాక్స్ పనిచేస్తున్నాడు. 1870 వ సంవత్సరంనాటి భావాల్తో బూజుపట్టిన తలకాయా ఆయనా. అప్పటినుంచి ఇప్పటివరకూ ఒక్క భావమైనా మార్చుకుంటే ఒట్టు.

"నన్నాహ్వానించాడు. నాకోసం మనిషిని పంపాడు." అని నాన్న కొంచెం ఆగాడు. మేమూ నిరీక్షించాం.

" ఓ! దానికేం అల్పాహారవిందు బాగానే సాగింది. అందుకు ఒప్పుకుంటా. కానీ నన్నాయన కొంచెం మందలించాడు. అందుట్లో నన్ను! ఆ వృద్ధజంబుకంగాడు."

"పందెం వేస్తా. నిన్నాతడెందుకు మందలించాడో నాకు తెలుసు." అన్నాడు ఎర్నెస్టు.

" ముమ్మాటికీ చెప్పలేవ్ !" అని నాన్న నవ్వేడు.

" మూడుసార్లదాకా దేనికి. ఒక్క ఊహలోనే చెప్పేస్తా. అందులోనే చెప్పబోయేది ఊహకూడా కాదు. అది అనుమానిక భావన. నీవ్యక్తిగత జీవితానికి, మందలించాడు." అని ఎర్నెస్టు తిరుగు సమాధానం చెప్పాడు.

" అందుకే ! నీవెట్లా ఊహించావ్ ? " అని నాన్న పెద్దగా అన్నాడు.

" అది జరుగుతుందని నాకింతకుముందే తెలుసు. ఇంతకుపూర్వమే దాన్నిగూర్చి నీకు హెచ్చరిక చేసా. "

" ఔను ! నీవు హెచ్చరించావు. " అని నాన్న ఆలోచన్లోపడి, " కానీ, నేను దాన్ని నమ్మలేదు. ఏమైనా, అది నాపుస్తకానికి ప్రబల సాక్ష్యంగా ఉపయోగిస్తుంది. " అన్నాడు.

"నాతోసహా, ఈ సోషలిస్టుల్ని, అన్నిరకాల రాడికల్సును మీ ఇంట్లో సమావేశపరుస్తూండే విధానాన్నే కొనసాగిస్తే; వచ్చే ప్రమాదముందు ఇదేపాటిది ?" అన్నాడు ఎర్నెస్టు.

"ఆ వృద్ధ విల్ కాక్స్ ఏంచెప్పాడో ఊరికే చెప్తావినండి. అన్నీ తనకు సంబంధంలేనివే ! అది చాలా చప్పగాఉందనీ, చిల్లిదమ్మిడీకూడా లాభంరాదనీ, ఏమైనా విశ్వ విద్యాలయ సాంప్రదాయాలకూ, విధానాలకూ అనుగుణ్యంగా లేదనీ చెప్పాడు. ఇట్లాగే ఇంకా ఏదో చెత్తవాగాడు. నేనతణ్ణి ఏదీ ప్రత్యేకించి వివరంగా చెప్పమని బాధించనూలేదు. అది అసభ్యమైందని అతడికి తెలియజేసా. అయినా అతడు తన ధోరణి మానకుండా శాస్త్రజ్ఞుగానన్ను తానెంతగా గౌరవించాడో, ప్రపంచమంతా ఏవిధంగా గౌరవించిందో లొడలొడ మాట్లాడుకు పోయాడు. అది అతడికి అంగీకారమైన పనిగాదు. దాని కాత డిష్టపడడంలేదని అర్థమైందినాకు."

"అతడు స్వేచ్ఛాజీవికాడు. బండకొయ్య ఎల్లకాలం సంతోషంతో ఎవ్వరూ మోయరు." అన్నాడు ఎర్నెస్టు.

"ఔను. నే నతడినుంచిరాబట్టిందీ ఈవిషయమే. ప్రభుత్వం ఇవ్వదలచుకొన్న మొత్తానికన్నా విశ్వవిద్యాలయానికి ఈసంవత్సరం ఇంకా ఎక్కువడబ్బు అవసరం అని అతడుచెప్పాడు. విశ్వవిద్యాలయ కామక్రోధాతీతమైన ఉన్నతాదర్శాలకూ, ప్రజ్ఞాసంపత్తికీ విఘాతం కలిగితే రెచ్చిపోయే కోటీశ్వరులదగ్గరనుంచి ఆడబ్బు రావాల్నని చెప్పాడు. విశ్వ విద్యాలయ ఉన్నతాదర్శ విఘాతానికీ, నాగృహజీవితానికీ సంబంధమేమిటని నేనతణ్ణి నొక్కి అడిగితే, యూరపులో విశ్రాంతితీసుకోడానికీ, పరిశోధన చేసుకోడానికీ నిండుజీతంమీద రెండుసంవత్సరాల శెలవిస్తానని అతడు నాతో అన్నాడు. ఐతే, ప్రస్తుత పరిస్థితులవల్ల నేను దానికి అంగీకరించలేదనుకోండి."

"మీరు అంగీకరిస్తే ఎంతో బాగుండేది." అని ఎర్నెస్టు గంభీరంగా అన్నాడు.

"అది లంచం" అని నాన్న ప్రతిఘటించాడు. ఎర్నెస్టు తలూపాడు.

"మీవంటి చెడుప్రవర్తన కల్గిన ప్రసిద్ధవ్యక్తితో నాకూతురు బహిరంగంగా తిరుగుతూండడం చూసినవాళ్ళంతా ఏవేవో అంటున్నారనీ, చెవులుకొరుక్కుంటున్నారనీ, నలుగురినోళ్ళల్లోబడి నానుతున్నదనీ ఇంకా ఏవేవో విషయాలు చెప్పాడా వెధవాయి. అట్లాఉండడం విశ్వవిద్యాలయపు హోదాకూ, గౌరవానికీ భంగకరమని వాగాడు. తాను స్వయంగా అభ్యంతరం చెప్పడంలేదనీ, పదిమందీ అనుకొంటున్న విషయాన్ని నేను అర్థంచేసుకోగలందులకు చెపుతున్నాననీ వదిరాడు."

ఎర్నెస్టు ఈవిషయాన్ని విని ఒకక్షణం ఆలోచించాడు. తర్వాత ఆయన మాట్లాడాడు. ఆయనమొగం గంభీరమైంది. అందులో కొద్ది కోపం గోచరించింది.

"కేవలం విశ్వవిద్యాలయాదర్శమేకాకుండా దీంట్లో యింకేదో ఉంది. అధ్యక్షుడైన విల్ కాక్స్ మీద ఎవరో వత్తిడి తీసుకువచ్చారు. అని మీ ఊహ." అని నాన్న ప్రశ్నించాడు. భయపడడానికిబదులు నాన్నలో ఆ విషయం తెలుసుకోవాల్నని ఆసక్తి కలిగించి.

"నా మనస్సులో మసక మసగ్గా ఏర్పడుతున్న భావన అందజేద్దామనుకొంటున్నా. ఈ సమాజం ఈనాడున్నంత భయంకరమైన పద్మవ్యూహంలో చరిత్రలో ఏనాడూలేదు. మన పారిశ్రామిక విధానంలో జరుగుతున్న శీఘ్రపరిణామాలు మత, రాజకీయ, సాంఘిక నిర్మాణాల్లోకూడా త్వరితగతిని మార్పులు తీసుకవస్తున్నయ్. సమాజ నిర్మాణంలో అగోచరమైన భయంకర విప్లవమేదో రాబోతున్నది. ఈ విషయం అస్పష్టంగా మాత్రమే ప్రతివ్యక్తీ భావిస్తున్నాడు. కానీ, ఇప్పుడీ రోజున అవన్నీ

గాలిలో తేలాడుతున్నాయ్. పెద్దగా, అస్పష్టంగా భయంకరంగా ఉన్న ఆ విషయాలు రేఖామాత్రంగానే కనపడుతున్నాయ్. అవి ఏ స్వరూపాన్ని ధరిస్తాయో నా మనస్సుకు ఆలోచన తట్టడంలేదు. మొన్నరాత్రి విక్సన్ మాట్లాడినదాన్ని మీరూ విన్నారు. నేను అనుభూతిపొందుతున్న ఏ నామ రహిత రూపరహితమైన విషయాలున్నయో, అవే అతడు చెప్పిన మాటల వెనకాలా ఉన్నయ్. వాటిని అతను దీర్ఘ భావనా విధానంద్వారా అర్థం చేసుకోని చెప్పాడు. " అన్నాడు ఎర్నెస్టు.

" మీరనేది ... ? " అని నాన్న ప్రారంభించి, ఆగాడు.

" ఇప్పటినుంచే ఈ భూమ్మీద బ్రహ్మాండమైన ప్రమాదకరమైన నీలి చ్ఛాయ ఏదో పడడానికి ప్రారంభిస్తున్నది అని నేననేది. కావాలంటే దాన్ని మీరు అల్పసంఖ్యాక ప్రభుత్వం అనండి. నేను ధైర్యంచేసి ఊహించి చెబుతున్నా. అది చాలా సమీపంలో ఉంది. దాని స్వభావమేమిటంటే దాన్ని మాత్రం ఊహించిచెప్పను. కానీ నేను చెప్పదలచుకొన్నదిది— మీరు చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో ఉన్నారు. అది ఎంత ప్రమాదకరమైందో కూడా నేను చెప్పలేను. దానివలన నా భయం మరింత ఎక్కువౌతున్నది. నా సలహా పాటించి, శెలవుకు వప్పుకోండి. "

" కానీ, అది పిరికితనం. " అని అభ్యంతరం తెలిపాడు నాన్న.

" అది పిరికితనమెన్నటికీ కాదు. మీరు వృద్ధులు. మీరు ప్రపంచంలో చేయాల్సిన పనిని చేసేశారు. అందులోనూ పెద్ద కృషిచేశారు. ప్రస్తుత పోరాటాన్ని యువశక్తిసామర్థ్యాల పరంచేయండి. యువకులమైన మేం చేయాల్సిన పనింకా బోలెడంత ఉంది. రాబోయే పరిస్థితులకు నాకు అండదండగా 'ఎవిస్' నిలబడుతుందిలే. రణరంగంలో ఆమె మీకు ప్రతినిధురాలుగా వ్యవహరిస్తుంది. "

"కానీ, వాళ్లు నన్నేం చేయలేరు. దేవుడిదయవల్ల నేను ఒకరి మీద ఆధారపడి బ్రతకవలసిన అగత్యంలేదు. అతడి విశ్వవిద్యాలయంమీద ఆర్థికంగా ఆధారపడ్డ ప్రొఫెసరునుగూర్చి వాళ్ళేరకంగా భయంకరంగా ప్రవర్తిస్తారోగూడా నాకు తెలుసు. కానీ, నేను స్వతంత్రుణ్ణి. నా జీతపు రాళ్లకోసమని ప్రొఫెసరుగా పనిచేయడంలేదు. నాకు స్వయంగావచ్చే రాబడితో ఒకళ్ల కింత పెట్టిగూడా మహాలక్షణంగా జీవితం సాగించగలను. ఇంతకూ వాళ్లు నాకు చేసే మహోపకారమేమిటంటే నా జీతం ఎగనామం పెట్టడం.

"కానీ మీరు సరిగ్గా గుర్తించలేదు. నేను భయపడ్తున్నదల్లా ఇది. మీ ప్రత్యేక ఆదాయం—మీ అసలుగాబడినే, మీ జీతాన్ని దోచేసినట్లుగా నిలువునా దోచేస్తారు." అని ఎర్నెస్టు జవాబిచ్చాడు.

నాన్న కొద్దిక్షణాలసేపు మౌనంగా ఉన్నాడు. ఆయన దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఆయన మొగంమీద ఏర్పడ్డనిర్ణయ రేఖలు నేను చూశా. చిట్టచివరకాయన మాట్లాడాడు.

"నేను శెలవు తీసుకోను." అని మళ్ళీ కొంచెంసే పాగాడు. "నేను నా పుస్తకాన్ని ముగిస్తా. మీరు పొరబడి ఉండవచ్చు. మీరు పొరపడ్డా పడకపోయినా నేను నా నిర్ణయాన్ని మాత్రం సుతారం వదలిపెట్టను."

"సరే. మీరు బిషప్ మూర్‌హౌస్ మార్గంలోనే నడుస్తున్నారు. మీరూ అటువంటి ప్రమాదంవైపే సాగిపోతున్నారు. మీ ఇద్దరిపనీ తీరే లోపల మీ రుభయులూ బికారులౌతారు." అన్నాడు ఎర్నెస్టు.

ప్రసంగం బిషప్‌మీదికి మరలింది. ఆయనతో తానేమి చేస్తున్నాడో వివరించమని మేం ఎర్నెస్టును అడిగాం.

"నేను చూపించిన నరకకూపాలు దర్శించిన తర్వాత, ఆయన మనోవ్యాధిలోపడ్డాడు. నేను ఆయన్ని మన ఫ్యాక్టరీల్లో పనిచేసే కొంతమంది కార్మికుల ఇండ్లకు తీసుకుపోయా. పారిశ్రామిక యంత్రంవల్ల నిరుపయోగులై

పడిపోయిన వాళ్లను చూపించా. ఆయన వాళ్ళ జీవితగాథల్ని ఆలకించాడు. ఆయనకు మురికికూపాల్ని చూపించా. త్రాగుడులో, వ్యభిచారంలో, నేరంలో సహజ దుర్వర్తనకన్నా లోతైన కారణం ఆయన కనుక్కున్నాడు. ఆయన మానసికంగా చాలా దెబ్బతిన్నాడు. ఇంకా అంతకన్నా అన్యాయమేమంటే, ఆయన మన స్వాధీనం తప్పిపోయాడు. ఆయన మరీ భావాత్మకుడైపోయాడు. ఆయన చాలా తీవ్రంగా కదిలిపోయాడు. ఇదివరకు మాదిరిగానే ఆయన క్రియాశూన్యుడు. విద్యావంతుల్లో మిషన్ కార్యకలాపాల్ని గూర్చి ఆయన మరీ భ్రమలోపడి, ఏవేవో నిరాధారాలైన ఉద్యమాలు ఆలోచిస్తున్నాడు. చర్చియొక్క పూర్వజీవానికి పునరుజ్జీవంపోసి, దాని సందేశాన్ని యజమానులందరికీ అందించడం తన విధ్యుక్తధర్మమని ఆయన భావిస్తున్నాడు. ఆయన అధికప్రయాసపడుతున్నాడు. రేపోమాపో పూర్తిగా దెబ్బతినబోతున్నాడు. ఆయనమీద ప్రమాదం ముంచుకురాబోతోంది. అది ఏ రూపాన్ని ధరిస్తుందో నేను ఊహించలేనుగూడా. ఆయన పవిత్రుడు. నిష్కల్మషహృదయుడు. అయితేనేం, క్రియాశూన్యుడు. ఆయన నా కందే పరిస్థితిలోలేడు. ఆయనకాళ్ళను నేను భూమిమీద నిలద్రొక్కి ఉంచలేను. గాలిలో ఆయన మహావేగంతో దూసుకుపోతున్నాడు. దీని తదనంతరం ఆయనకు సిలువవేయబడడమే. ఇటువంటి ఉన్నతవ్యక్తులు సిలువ వేయబడడానికే తయారుకాబడ్డున్నారు."

"మరి మీరో?" అని ప్రశ్నించా. నా చిరునవ్వు చాటున అనురాగానికి సంబంధించిన తీవ్రమైన తహతహ దాగుడుమూతలాడుతోంది.

"నేనుమాత్రంకాదు." అని ఆయన తిరిగి నవ్వాడు. "నేను ఉరితీయబడవచ్చు, లేక హత్యజేయబడవచ్చు. కానీ నన్నెప్పుడూ సిలువమీద కెక్కించరు. నేను అచంచలంగా దృఢంగా నేలమీద కాళ్ళూని నిలుచున్నా."

"ఐతే బిషప్‌కు సిలువఎక్కే పరిస్థితిని మీరెందుకు తీసుకు వచ్చారు? దానికంతా కారకులు మీరన్నది నిరాకరించరనుకొంటా." అన్నా.

"కోటానుకోట్లుగా దుర్భర నికృష్టజీవనం గడపుతున్నప్పుడు, నేనొక సుఖజీవిని ఎందుకు సుఖంగా బ్రతకనీయాలి?" అని ఎదురుప్రశ్న వేసాడు.

"అటువంటప్పుడు మరి నాన్నను శలవు అంగీకరించమని ఎందుకు సలహాఇచ్చారు?"

"ఎందుకంటే నేను పవిత్రుణ్ణీ, ఉదాత్తుణ్ణీ కాదు. నేను స్థైర్యం కలవాణ్ణీ,తొందరపడి ఉద్రేకంపొందనివాణ్ణీ స్వార్థపరుణ్ని కాబట్టి. నేనునిన్ను ప్రేమిస్తున్నానుగనుక. రూత్‌కుమాదిరిగా నీవాళ్లు నావాళ్ళుకానందున. బిషప్ విషయంచూస్తే, ఆయనకు కూతురులేదు. దానికితడు ఎంత తక్కువ మంచైనప్పటికీ ఫరవాలేదనుకో, ఐనప్పటికీ ఏమాత్రం అతడు రోదించినా, అది విప్లవంవల్ల కలిగే ఉపకారమే. ప్రతి చిన్నవిషయం విప్లవంలో పరిగణనకు వస్తుంది." అని ఎర్నెస్టు,సమాధానం చెప్పాడు.

నేను ఎర్నెస్టుతో అంగీకరించలేకపోయా. బిషప్ మూర్‌హౌస్ యొక్క ఉదాత్తస్వభావం నాకు బాగా తెలుసు. ఆయన న్యాయంకోసం ఎలుగెత్తి చాటడం, చాలీచాలని రోదనం అని నేను భావించలేకపోయా. కానీ, ఇంకనాకు జీవిత కఠోరసత్యాలు ఎర్నెస్టుకుమాదిరిగా సద్యస్ఫూర్తిలో లేవు. త్వరలో రాబోయే పరిస్థితుల్ని నాకు స్పష్టంగా దర్శనం చేయించడం కోసంగా ఆయన బిషప్ మూర్‌హౌస్ యొక్క నిరర్థకత్వాన్ని స్పష్టంగా అర్థంచేసుకొన్నాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకు, తనకు అమెరికా సంయుక్తరాష్ట్ర లేబర్ కమీషనర్‌గా ఉద్యోగమిస్తామని ప్రభుత్వందగ్గర్నుంచి వచ్చిన ఆహ్వానాన్ని, శుభవార్తగా నాకు ఎర్నెస్టు తెలియజేసాడు. నేను బ్రహ్మానందభరితురాలి

నైనా. జీతం మా నాన్న జీతానికన్నా చాలా పెద్దది. మా వైవాహిక జీవితాన్ని సురక్షితంగా గడుపుకోవడానికి సరిపోతుంది. ఆ ఉద్యోగం ఎర్నెస్టు అభిరుచికి సరిపోయింది. పైగా నాకు ఆయనమీదఉన్న ఈర్ష్యా గర్వాంకల్ల ఆయన శక్తి సామర్థ్యాలు గుర్తించడంవల్లనే అటువంటి ఉద్యోగం లభిస్తున్నదని శ్లాఘించా.

అప్పుడాయనకళ్ళల్లో చిరునవ్వు కాంతుల్ని చూచా. నన్ను చూచి ఆయన నవ్వుతున్నాడు.

"మీరు దాన్ని...... మీరుదాన్ని నిరాకరించబోవడంలేదుగదా?" అన్నా వణికేగొంతుతో.

"అది లంచం. దానివెనకాల విక్సన్ మృదుహస్తంఉంది. ఆయన వెనకాల ఆయనకన్నా ఇంకా గొప్పవాళ్ళచేతులున్నయ్. అది పూర్వకాలం నాటి పన్నుగడ. వర్గపోరాటం ఎంత ప్రాచీనమైందో, ఈ యుత్తుగడా అంత ప్రాచీన మైందే. కార్మిక సైన్యంలోనుంచి సేనాధిపతుల్ని దొంగి లించడం ఆ వ్యూహం. పాపం దెబ్బతిన్న కార్మికులు! ఈ రకంగానే పూర్వం ఎంతమంది కార్మిక నాయకుల్ని కొన్నారో నీకు తెలిస్తే ఇది తెలిసేది. ఒక సేనాధిపతినీ, ఆయన సర్వసైన్యాన్ని ఎదుర్కొనేదానికన్నా, ఇది కారు చౌక. పూర్వం ఇది జరిగింది. కానీ నేను దాన్ని కొక్కరించను. నాకు దాంతో బాగా తలపట్టిపోయింది ప్రేయసీ! నేను కార్మిక నాయకుణ్ణి. నేను అమ్ముడుపోలేను. ఇంకా తదితరమైన కారణం ఏమీ లేకపోయినప్పటికీ, వృద్ధుడైన మా నాన్నా, ఆయన చచ్చేదాకా పడ్డపాట్లూ నా స్మృతి పథంలో ఉన్నయ్. ఆ స్మృతి నన్నడ్డుపెడ్తుంది." అన్నాడు.

ధైర్యంగల ఈ నా బ్రహ్మాండనాయకుడి నేత్రాలు బాష్పపూరితాలైనై. తన సంతానాన్ని పోషించడంకోసం తన తండ్రి ఎటువంటి పచ్చి అబద్ధాలు

పలుకవలసి వచ్చిందో, ఎన్నెన్ని దొంగతనాలు చేయాల్సివచ్చిందో, ఎంత చెడుగా మారాల్సివచ్చిందో ఆ పరిస్థితిని ఎర్నెస్టు ఎప్పుడూ క్షమించలేడు.

"మా నాన్న చాలా మంచివాడు. ఆయన ఆత్మ మంచిదే. కానీ, ఆయన దుర్భరనికృష్టజీవితం దాన్నివంచి, అణగ్గొట్టి విరూపంచేసింది. పెద్ద మృగాలైన యజమానులు ఆయన్ని వికలమృగాన్ని చేసారు. మీ నాన్నకు మాదిరిగానే మా నాన్న ఇంకా జీవించి ఉండవలసినవాడే. ఆయనకు మంచి జీర్ణశక్తి ఉంది. కానీ ఆయన ఈయంత్రంలో దెబ్బతిన్నాడు. దాని లాభాల కోసం చచ్చేదాకా పనిచేశాడు. దాన్ని కొంచెం ఆలోచించు. లాభాల కోసం-ఆయన జీవితరక్తం, పరాన్నభుక్కులూ, సోమరిపోతులూ, సంఘాధినేతలూ, మృగస్వరూపులూ ఐన ధనికస్వాముల మదిరంగా, రత్నాలహారంగా అట్లాగే వాళ్ల ఏదో ఇంద్రియతర్పణ వస్తువుగా మారింది." అని ఎర్నెస్టు పూర్వం నా కోమారు చెప్పాడు.

---

౭

"బిషప్ మన శక్యంలోలేడు. ఆయన కేవలం ఊహాప్రపంచంలో ఊగిసలాడుతున్నాడు. ఇవ్వాళనుంచీ మన ఈ విషాద జగత్తును సంస్కరించబోతున్నాడు. తన పవిత్రసందేశాన్ని అందరికీ అందించబోతున్నాడు. ఈ సంగతి ఆయనే స్వయంగా నాతో అన్నాడు. నేటి రాత్రి I. P. H. కి అధ్యక్షతవహించబోతున్నాడు. తన పరిచయవాక్యాల్లో సందేశాన్నందజేస్తాడట!"

"ఆయన చెప్పేది వినడానికి నిన్ను కూడా తీసుకువెళ్ళేదా? ఆయన యెందుకూ పనికిరాకుండాపోయేమాట నిజమనుకో. దానివల్ల నీ గుండె

విచ్ఛిన్నమౌతుంది. ఆయన హృదయం శకలమైపోతుంది. ఐనప్పటికీ నీకిది గొప్ప గుణపాఠంగా ఉపయోగపడ్తుంది. ప్రేయసీ! నీవు నన్ను ప్రేమించడంవల్ల నేనెంతగా గర్వపడుతున్నానో నీకు తెలుసు. అందుకే నా పూర్తి సమర్థత నీకు తెలియజేద్దామనుకొంటున్నా. నన్ను గురించి నీ దృష్టిలో ఉన్న అర్హతాలేశానికి ప్రత్యామ్నాయంగా, నాది సక్రమమైన ఆలోచనని నీవు గుర్తించడంకోసం నా అహంభావం అరుస్తోంది. నావి కఠిన భావాలు. బిషప్‌వంటి ఉదాత్తవ్యక్తి వ్యర్థుడుకాబోతున్నందుకే, నేనింత కఠినంగా ఉండాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. కాబట్టి నీపీ రాత్రికి రా. ఇవ్వాళ జరగబోయే సంఘటనలు విషాదాన్ని కలిగించేవైనా, వాటివల్ల నీవు నాకింకా సన్నిహితురాలవవుతావని భావిస్తున్నా." అని ఎర్నెస్టు నాకు వ్రాసాడు.

ఆ రోజు రాత్రి I. P. H. తన సమావేశాన్ని శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిపింది. సమాజంలోని అవినీతిని చర్చించి, దాని నిర్మూలనోపాయాన్ని నిర్ణయించడంకోసం ఏర్పాటుచేయబడ్డ సమావేశమిది. బిషప్ మూర్‌హౌస్ అధ్యక్షపీఠాన్ని అలంకరించాడు. ఆయన వేదికమీదికివచ్చి కూర్చునేటప్పుడు, బాగా వణికాడు. ఆయన్లో ఉన్న అమితోద్రేకాన్ని గుర్తించా. ఆయన ప్రక్కగా బిషప్ డికిన్‌సన్; కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ నైతికశాఖలో ప్రధానాచార్యుడైన H. H. జోన్స్; ధర్మసంస్థ నిర్వాహకురాలైన మిస్ట్రెస్. W. W. హర్డు; అట్లాగే గొప్పదానకర్ణుడని పేరు గాంచిన ఫిలిప్ వార్డు; నైతికపథంలో, దాతృతాగుణంలో ఇట్లాగే ఇంచుమించుగా పేరు ప్రఖ్యాతులుపొందిన ఇంకా అనేకులూ ఆసీనులైనారు. బిషప్ మూర్‌హౌస్ ఉన్నపళానలేచి మాట్లాడడం మొదలు పెట్టాడు.

"నేను నా శకటం ఎక్కి వీధులగుండా వస్తున్నా. హఠాత్తుగా నా కళ్లు తెరిపిళ్లుపడ్డాయ్. నేను యథార్థవిషయాన్ని గమనించా. ఆ

భయంకర దృశ్యం చూడకుండా ఉండటానికి మొదట నా కళ్ళు రెండూ గట్టిగా చేతుల్తో మూసుకొన్నా. తర్వాత ఆ చీకట్లో నాకో ప్రశ్న ఉదయించింది. ఏమి చెయ్యాలి? ఏమి చెయ్యాలి? ఇంకా కొంచెంసేపైన తర్వాత ఆ ప్రశ్నే మరోరూపంలో కలిగింది. ప్రభువైతే ఏం చేస్తాడు? ఈ ప్రశ్నతో నా శూన్యహృదయంలో ఒక దివ్యజ్యోతి సాక్షాత్కరించింది. 'సాల్', డెమస్కస్‌కు వెళ్ళేటప్పుడు ఆయనకు స్పష్టంగా కనపడ్డరీతిగా, నాకు కర్తవ్యతా భాస్కరుడు సుస్పష్టంగా దర్శనమిచ్చాడు,"

"బండి ఆపించా. దిగా. కొంతసేపు మాట్లాడిన తర్వాత ఆ ఇద్దరు వ్యభిచారిణుల్నీ, నా బండిలో ఎక్కి నాతో రమ్మని వత్తిడిచేసా. ఏసుక్రీస్తు సక్రియ మార్గాన్నే అవలంబించినట్టయితే, ఈ ఇద్దరు అభాగ్య జీవులూ నా సోదరీమణులౌతారు. వాళ్ళమీద నేను చూపే ప్రేమాభిమానాలవల్లనే, వాళ్ళను పవిత్రులుగామార్చే అవకాశం ఉంది."

"నేను శాన్‌ఫ్రాన్సిస్కోలోఉన్న రమణీయ ప్రదేశాల్లో ఒకదాంట్లో నివసిస్తున్నా. నేను నివసిస్తున్న ఇల్లు వేయి డాలర్లవిలువచేస్తుంది. దాంట్లో ఉన్న సామాగ్రి, పుస్తకాలూ, కళాఖండాలూ ఇంటికన్నా ఎక్కువ ఖరీదే చేస్తయ్. నా ఇల్లు భవనం. కాదు. అదొక రాజప్రాసాదం. దాంట్లో అసంఖ్యాకులైన పరిచారకులున్నారు. ప్రాసాదాల సత్ప్రయోజన మేమిటో ఎన్నడూ నాకు తోచలేదు. నివసించడంకోసం నిర్మింపబడ్డయ్ అనుకొన్నా. కానీ, వాటి సత్ప్రయోజనం నాకిప్పుడు తెలిసివచ్చింది. ఆ బికారి జీవులిద్దర్నీ నా ప్రాసాదానికి తీసుకువెళ్ళా. వాళ్లూ నాతోబాటే నివసించబోతున్నారు. ఇటువంటి అభాగ్య సోదరీమణులకే నా ప్రాసాదంలోని ప్రతిగదిలో ఆశ్రయం కల్పిద్దామనుకొంటున్నా."

శ్రోతల్లో ఆందోళన మరీమరీ ఎక్కువౌతోంది. అందరూ గందర గోళంలోపడిపోతున్నారు, వేదికమీద కూర్చున్న వాళ్లమొగాల్లో అసహ

నత్వం, నిరాదృతిఅమితమౌతోంది. ఈ విషయం చెప్పేటప్పటికి, బిషప్ డికిన్‌సన్ లేచి ఆ వేదికనూ, ప్రదేశాన్నీ వదిలి విసుగ్గా చరచరా వెళ్ళిపోయాడు. బిషప్ మూర్‌హౌస్ మాత్రం వీటన్నిటినీ లక్ష్యపెట్టలేదు. ఆయన, తన నేత్రాలు కర్తవ్యతాదాత్మ్యంతో వెలుగులు విరజిమ్ముతుండగా ఉపన్యాసాన్ని కొనసాగించాడు.

"ఓ సోదర సోదరీమణులారా! ఈ నా చర్యలో నా కష్టాలన్నిటికీ పరిష్కారమార్గం కనుక్కున్నా. హాయశకటాలెందుకు ఉపయోగపడ్తయ్యో ఇంతకుముందు నాకు తెలియదు. ఇప్పుడు తెలిసింది. బలహీనుల్ని, వ్యాధిగ్రస్తుల్నీ, వృద్ధుల్నీ మోయడానికి ఉపయోగించుతై. సిగ్గూభిడియాలు వదిలేసినవాళ్లకు గౌరవాన్ని కలిగించడానికి అవి నిర్మింపబడ్డయ్."

"ప్రాసాదులెందుకున్నాను ఉపయోగపడ్తున్నయ్యో నా కింతకుముందు తెలియదు. కానీ, వాటి నెట్లా ఉపయోగపెట్టాలో ఇప్పుడు తెలిసింది. రోడ్లప్రక్కబడి నశించిపోతూన్న దురదృష్టజీవులకు వైద్యశాలలుగా, చికిత్సా కేంద్రాలుగా చర్చి ప్రాసాదాలు మారాలి."

ఆయన చాలాసేపు మాట్లాడకుండా ఆగాడు. తనలో ఉరుకులూ పరుగులూ తీస్తున్న ఊహల్ని అదుపులోకి తెచ్చుకొన్నాడు. వాటిని స్పష్టంగా విశదీకరించడానికి తనలోఉన్న కంపాన్ని జయించాడు.

"ప్రియసోదరులారా! నీతినిగురించి మీ కేమైనా చెప్పడానికి నేను అనర్హుణ్ణి. ఇతరులకు సహాయంచేయలేని దుర్భరిమల్లో చాలాకాలం నేను అసమర్థుణ్ణిగా అవమాన జీవితాన్ని గడిపా. కానీ, ఆ నా ఇద్దరు సోదరీమణులపట్ల నేను ప్రవర్తించిన విధానంవల్ల, ఉత్తమమార్గం తెలుసుకోవడం సులభమని నాకు తెలిసింది. ఏసుక్రీస్తులో, ఆయన మహోపదేశాల్లో విశ్వాసమున్నవాళ్ళకు, అనురాగ బాంధవ్యంతప్ప మనిషికీ మనిషికీ మధ్య మరో చుట్టరిక మేలేదు. పాపానికన్నా, మృత్యువుకన్నాగూడా అనురాగమే

బలవత్తరమైంది. అందుకే మీలో ధనవంతులైనవాళ్ళందరూ విస్పష్టంగా చేయాల్సినదాన్ని చెప్తున్నా. నేను చేస్తున్నదీ, చేయబోతున్నదీ మీరంతా తప్పకుండా చేయండి. మీలో ధనం పుష్కలంగా ఉన్న ప్రతివ్యక్తీ, మీ ఇంటికొక దొంగను తీసుకుపోయి, అతణ్ణి మీ సోదరుడిగా ఆదరించండి. ఒక నిర్భాగ్యురాల్ని తీసుకుపోయి సోదరిగా గౌరవించండి. ఇకప్పుడు శాన్‌ఫ్రాన్సిస్కో కు పోలీసుల్తో, మేజిస్ట్రేట్లతో ప్రమేయం ఉండదు. జైళ్ళన్నీ వైద్యశాలలుగా మారిపోతయ్. నేరమూ ఉండదు. నేరస్థుడూ ఉండడు.''

''ధనత్యాగమేగాకుండా, ఆత్మార్పణకూడా చేసుకోవాలి. క్రీస్తు చేసినట్లుగా మనమూ చేయాలి. ఈనాటి చర్చిసందేశమది. మన ప్రభు సూక్తుల్ని వదలి దూరంగా సంచరించాం. మనకు ఈ మాంసఘటాలమీద మమకారం మరింత ఎక్కువైంది. క్రీస్తుస్థానంలో ధనదేవతను ఆరాధించాం. ఈ గాథనంతా వివరించే పద్యం ఒకటి నాదగ్గిర ఉంది. మీకు దాన్ని చదివి వినిపిద్దామనుకొంటున్నా. తాను పాపాత్ముడైనా, సమాజంలోఉన్న అవినీతిని స్పష్టంగా అవగాహన చేసుకొన్న ఒకవ్యక్తి దాన్ని రచించాడు. (ఆస్కార్‌వైల్డు) అది కాథొలిక్ చర్చిమీద దండయాత్రగా మీరు పొరబడరాదు. అది అన్ని చర్చీలమీద దండయాత్ర. ప్రభుపంథా న్ని త్యజించి, ఆయనగొర్రెల్ని విడిచి, సౌఖ్యడోలికా విహారం చేస్తున్న చర్చీలన్నిటిమీదా ఎత్తిన విజయధ్వజమది. ఆ పద్యం ఇది :-

రజిత మృదంగవాద్యరవరాజి వినంబడె చర్చిగోపుర
వ్రజమున; మోకరిల్లిరి కరద్వయముల్ ముకుళించి నమ్రులై
ప్రజలు; తదంస భాగములపై భగవత్ ప్రతిరూపమోయనన్
విజయముచేసె, రోము సుపవిత్ర విభుం డధికార సంపదన్ !

హిమధవళాచ్ఛము అంగి ధరియించె జగద్గురు భాతి - స్నిగ్ధ ర
క్తిమ మగు పట్టుధట్టి కటిదీర్చె జగత్ప్రభురీతి - తాల్చె చూ
డమున సువర్ణ రత్నమకుటత్రియము - ఆపయి 'పోపు' ద
ర్పము వెలుగన్ మహా విభవరాజితుడై చనియెన్ గృహోనకున్.

యుగయుగాల వెనుక కొదిగి నామనసు
ఆ మహోదధి తీర భూమిలో నొంటి
సంచరించిన ప్రభు సందర్శనార్థ
మత్యంత శ్రద్ధతో అరసి వేసారి,
తలదాచుకొనుటకై తహతహలాడి
శూన్యఫలితుడనై సృక్కితి తుదకు ;
ప్రతి జీవి నివసింప వసతి లభించె
కాని, నాకర్మమే కాలి వ్యర్థముగ
కాళ్ళు బండలుగట్ట గాలింపవలసె ;
దోసెడు నీరమ్మొ దొరకక కడకు
దప్పిక ఎగదట్టి కుప్పగా కూలి
ఉప్పనౌ కన్నీరు చప్పరించితిని.

శ్రోతలందరూ దానికి ఉద్రిక్తులయ్యారు. కానీ ఎవళ్లూ కదల్లేదు. బిషప్ మూర్‌హౌసుకు ఇదంతా తెలియదు. ఆయన తన మార్గాన్ని స్థైర్యంతో అనుసరించారు.

"కాబట్టి, మీలో ఉన్న ధనికులకూ, తక్కిన అందరు ధనవంతులకు చెపుతూన్న విషయమిది. మీరంతా ప్రభువుయొక్క గొర్రెల్ని మళ్ళీ

లేకుండా అణగద్రొక్కేసారు. మీ హృదయాలు పాషాణకర్కశాలైనై. దేశంలో చెలరేగే ఆర్తారవాల్ని వినకుండా మీరు చెవులు మూసుకున్నారు. మీరు వినకుండా ఉంటూన్న బాధాసంతప్త విషాదారావాలు తప్పకుండా వినేరోజు వస్తుంది. అందుకనే నేను చెపుతున్నా—"

ఈ విషయం వచ్చేటప్పటికి, ఇంతకుముందుగానే కుర్చీలోనుంచిలేచిన H. H. జోన్సు, ఫిలిఫ్ వార్డులు బిషప్‌ను వేదికనుంచి తీసుకువెళ్ళారు. శ్రోతలందరూ నిశ్చేష్టులైకూర్చున్నారు. బజార్లోకి వచ్చినతర్వాత ఎర్నెస్టు చాలా భీకరంగా నవ్వాడు. ఆయన నవ్వు నన్ను కంపింపజేసింది. అప్పటిదాకా అణచిపెట్టుకొన్న శోకాశ్రువులు నా హృదయాన్ని బ్రద్దలుచేసుకుని బైటికి ఉరికేఅంత పనైంది.

"ఆయన తన సందేశాన్నందించాడు. ఆయన హృదంతరంలో నిగూఢమైన ఆర్ద్రతా, మానవత్వమూ పెల్లుబికివచ్చినై. ఆయన్ని పోషించిన క్రైస్తవసమాజం, ఆయనకు మతిభ్రమణ కలిగిందని నిర్ధారించారు. ఆయన్ని వాళ్లెంత తొందరగా వేదికనుంచి తీసుకుపోయారో గమనించావా? ఈ దృశ్యానికి నరకంలో విరగబడి నవ్వుండాలి."

"అంతేకాదు. బిషప్ ఈ రాత్రి చేసిందానికీ, చెప్పిందానికీ ప్రతివాళ్ళల్లో గొప్ప అభిప్రాయం ఏర్పడుతుంది." అన్నా.

"అట్లాగే అనుకో" అని ఎర్నెస్టు పరిహసించాడు.

"అది సంచలనాన్ని కలిగిస్తుంది. ఆయన మాట్లాడుతుంటే పత్రికా విలేఖరులు చేతులుపడేటట్లు వ్రాస్తూండడం మీరు చూడలేదు?" అని నా వాదాన్ని స్థిరపరచుకున్నా.

"రేపువచ్చే పత్రికల్లో ఆయన ఉపన్యాసంలో ఒక్క వాక్యంకూడా ప్రకటితంకాదు."

"నేను దాన్ని నమ్మను" అని అరిచా.

"కొంచెం నిదానించిచూడు. ఆయన చెప్పిన విషయంలో ఒక్క వాక్యం, ఒక్క భావం పత్రికల్లో కనపడదు. దినపత్రికలు? ప్రతిదినం వార్తల్ని అణగద్రొక్కేవి!"

"కానీ, పత్రికావిలేఖర్లో? వాళ్లను నేను చూచానే." అని అభ్యంతరం చెప్పా.

"ఆయన చెప్పినవాటిల్లో ఒక్కమాటకూడా అచ్చుమొగం చూడదు. సంపాదకుల్ని నీవు మరచిపోయావ్. వాళ్లు అమలుపరుస్తున్న సిద్ధాంతం ద్వారానే వాళ్ళకు జీతాలు ముడ్తున్నయ్. సంఘంలో వేస్మ్యాదుకున్న విషయాలకు ప్రముఖప్రమాదాన్ని కలిగించే ఏ విషయంకూడా అచ్చేయకుండా ఉండడమే వాళ్లసిద్ధాంతం. తరతరాలుగా వస్తూన్న నైతికధర్మాలకు బిషప్ ఉపన్యాసం పెద్ద గొడ్డలిపెట్టు. ఆ ఉపన్యాసం పూర్వ విశ్వాసాలకు విద్రోహకరమైంది. ఇంకా ఆ విద్రోహకర ఉపన్యాసాన్ని కొనసాగించనీయకుండా ఉండేటందుకు వాళ్ళాయన్ని తీసుకువెళ్ళారు. ఆయన విద్రోహకర ఉపన్యాసాన్ని నంగనాచుల్లాగా పత్రికలన్నీ ప్రచురించకుండా మౌనంగా ఊరుకుంటై. సంయుక్తరాష్ట్రాల పత్రికలు? అవ్వి పెట్టుబడిదారి వర్గంయొక్క పాదచ్ఛాయల్లో అభివృద్ధిచెందేవి. తరతరాలనాటి వ్యవస్థను చెక్కుచెదరకుండా, దానికి అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని మలచి, దానికి సేవచేయడమే పత్రికల పరమావధి."

"జరగబోయేదిచెప్తా విను! బిషప్ ఆరోగ్యంసరిగాలేదనీ, ఆయన అత్యంత పరిశ్రమచేస్తున్నాడనీ, గతరాత్రి ఆయన బాగా దెబ్బతిన్నాడనీ మాత్రమే రేపటి పత్రికలు ప్రచురిస్తయ్. కొన్ని రోజులు గడచినతర్వాత వచ్చేవార్త ఏమిటంటే, ఆయనకు మతి చాంచల్యం కలిగిందనీ, అందుకని

దయార్ద్రులైన మతాచార్యులు ఆయనకు కొంతకాలం విశ్రాంతి ప్రసాదించారనీ, దాని తర్వాత ఈ రెండువిషయాల్లో ఏదో ఒకటి జరుగుతుంది. బిషప్ తన తప్పిదాన్ని గుర్తించి ఇంకేరకమైన భ్రమలు లేకుండా విశ్రాంతినుంచి వచ్చి మళ్ళీ పూర్వపు తరహా జీవితం గడపడమో, లేకపోతే తనపిచ్చినే వదలిపెట్టకుండా పట్టుకు వ్రేలాడడమో. అప్పుడు పత్రికల్లో సానుభూతిపూర్వకంగా కరుణార్ద్రంగా, పాపం బిషప్‌కు మతి చాంచల్యం కలిగిందన్న వార్త రావచ్చు. ఆ తర్వాత ఆయన తన మనోదృశ్యాలన్నీ దాచుకొని నాల్గుగోడలమధ్యా కుమిలేటట్లుగా పరిత్యజింపబడ్డాడు. ''

'' ఈ విషయంలో మీరు అమితంగా ఊహించారు! '' అన్నా పెద్దగా

'' సంఘందృష్టిలో అది నిజంగా పిచ్చికళే. పిచ్చిపట్టకపోతే, ఏ నిజాయితీగలవ్యక్తి, పతితులైన స్త్రీలను, దొంగల్నీ తన ఇంటికి తీసుకుపోయి తన సోదరీమణులుగా సోదరులుగా తనతో నివసించమని కోరుతాడు? క్రీస్తు ఇద్దరు దొంగలమధ్య మరణించాడన్నది వాస్తవమే. కానీ అది మరోగాథ. పిచ్చితనమో? మరొకరితో ఏకీభవించలేని మానసికవిధానం ఎప్పుడూ తప్పే. అందుకని ఆ వ్యక్తిమనస్సు తప్పుదారిబట్టిందన్న మాట. తప్పుడు మార్గం పట్టిన మనస్సుకూ, పిచ్చెక్కిన మనస్సుకూ మధ్య సరిహద్దెక్కడ ఉంది? ఒకవ్యక్తియొక్క సరియైన నిర్ణయాల్తోటి మరొకబుద్ధికల్గిన వ్యక్తి పూర్తిగా విభేదించడమనేది ఊహించరానిది. ''

'' ఇవ్వాళ సాయంకాలపు పత్రికలో దీనికో మాంచి ఉదాహరణ ఉంది. సంత బజారుకు దక్షిణంగా 'మేరి మాకెన్నా' నివసిస్తోంది. ఆమె దరిద్రురాలు. ఐనప్పటికీ నిజాయితీయైన మనిషి. దేశభక్తి కలిగిందికూడా. కానీ, అమెరికా పతాకనుగురించీ, ఆ పతాక ఇస్తుందనుకొన్న రక్షణచిహ్నాన్ని గూర్చీ ఆమెకు పొరపాటు అభిప్రాయాలున్నయ్. ఆమెకు జరిగిన సంగతిది.

ఆమె భర్త ప్రమాదానికి గురై మూడుమాసాలపాటు వైద్యశాలలో పడక వేసాడు."

"నిన్న ఆమెను వెళ్ళగొట్టారు. కానీ ఆమె మొదట అమెరికా పతకాన్ని ఎగరేసి, దాని క్రింద నిలబడి, ఈ పవిత్ర పతాకరక్షణలో తనను శరీరం కొయ్యబారిపోయే చలిలో నడివీధిలోకి వెళ్ళగొట్టడం అన్యాయమని చాటింది. అందుకు ఏమిజరిగింది? ఆమెను నిర్బంధించారు. ఆమె పిచ్చిదని నిందారోపణచేసారు. ఇవ్వాళ అమెను ఉన్మాదచికిత్సలో నిపుణులైన వైద్యులు పరీక్షించారు. అమె పిచ్చిదని నిర్ధారించారు. 'నాపా' పిచ్చిఆస్పత్రిలో పడేసారు." అన్నాడు ఎర్నెస్టు.

"కానీ అది మరీ అసంగతం. నేను ఒకపుస్తకంయొక్క శైలివిషయంలో ప్రతివ్యక్తితో విభేదిస్తాననుకోండి. అందుకని వాళ్లు నన్ను పిచ్చి ఆస్పత్రికి పంపించవుగా." అని అభ్యంతరంచెప్పా.

"ముమ్మాటికీ నిజమే. కానీ, ఆరకమైన భేదాభిప్రాయంవల్ల సంఘానికేమీ హానికల్గదు. అక్కణ్ణేఉంది భేదం. మేరిమెకెన్నా, బిషప్‌ల అభిప్రాయభేదాలు సంఘానికి ప్రమాదం కలిగిస్తయ్. దరిద్రులంతా అద్దెలు కట్టడానికి నిరాకరించి, అమెరికా పతాక ఛాయల్లో తలదాచుకొంటే ఏమిటి? భూస్వామ్యం పతనమౌతుంది. బిషప్ దృక్పథాలుకూడా సంఘానికి అటువంటి ప్రమాదాన్ని కలిగించేవే." అని ప్రత్యుత్తరమిచ్చాడు.

కానీ ఇంకా ఆయనచెప్పింది నేను నమ్మడానికి నిరాకరించా.

"నిదానించి చూడు!" అన్నాడు ఎర్నెస్టు. నేను నిరీక్షించా.

మరునాడు నేను అన్ని పత్రికలకోసం పంపా. అంతవరకూ ఎర్నెస్టు సరిగ్గానే చెప్పాడు. బిషప్ మూర్‌హౌస్ చెప్పిన మాటల్లో ఒక్క మాట కూడా అచ్చుకాలేదు. ఒకటి రెండుపత్రికల్లోమాత్రం ఆయన భావ

తీవ్రతలో వశం తప్పిపోయాడని కొద్దిగా చెప్పారు. ఐనా ఆయన తర్వాత మాట్లాడిన వాళ్ళందరి ఉపన్యాసాలు పేజీలు పేజీలుగా ముద్రించారు.

కొన్ని రోజులైన తర్వాత, అతిపరిశ్రమవల్ల సంభవించిన అనారోగ్యాన్ని పోగొట్టుకొనేందుకు విశ్రాంతికోసం దూరదేశాలకు పోయాడన్న విషయం ప్రచురితమైంది అంతవరకూ బాగానే ఉంది. కానీ అందులో పిచ్చెక్కిన విషయంకానీ, నరాల దౌర్బల్యమన్న విషయంగానీ కొంచెంగానైనా లేదు. ఎర్నెస్టు, ఏ భయంకరమైన సిలువ ఎక్కి శిక్షపడుతుందని ముందుగానే దీర్ఘాలోచన చేసి చెప్పాడో, అటువంటి శిక్షార్హమైన మార్గాన్ని అనుసరించాల్సిన విధి బిషప్‌కు పడుతుందని నేను కలలోగూడా ఊహించలేదు.

# ౮

ఎర్నెస్టు సోషలిస్టు టికెట్ మీద కాంగ్రెస్‌కు పోబోయేటప్పుడు మానాన్న ప్రత్యేకంగా పేరుపెట్టిన 'లాభనష్టాల' విందును ఏర్పాటుచేసాడు. ఎర్నెస్టు దానిని 'యంత్రవిధ్వంసకుల' విందు అన్నాడు. నిజంగాచూస్తే, అది వ్యాపారస్తులవిందు, అయితే వాళ్లు ఛోటావ్యాపారస్తులనుకోండి. 2 వేల డాలర్ల పెట్టుబడికి మించిన వ్యాపారంలో వాళ్లెవళ్ళూ ఆసక్తికలిగినవాళ్లుగా నాకు తోచలేదు. వాళ్లు నిజానికి మధ్యతరగతికి సంబంధించిన వ్యాపారస్తులు.

సిల్వర్‌బర్గులో తేయాకు, కాఫీ వస్తువులు మొదలయినవి అమ్మే పెద్ద సంస్థయైన ఓవెన్ అండ్ కంపెనీకి సంబంధించిన ఓవెన్ వచ్చాడు. ఆ సంస్థకు చాలాచోట్ల అనుబంధసంస్థలున్నయ్. మేము కావలసిన వస్తుసంభారమంతా వాళ్ళ దగ్గర్నే కొనుక్కుంటాం. ఔషధాలు విక్రయించే పెద్ద సంస్థయైన

కోవాల్డ్, హాసబరన్ కంపెనీకి చెందిన ఇద్దరు భూస్వాములూ వచ్చారు. కాంట్రకోస్ట జిల్లాలో ఉన్న పెద్ద రాతిగని యజమాని మిస్టర్ అస్మన్‌సెన్ కూడా ఉన్నాడు. చిన్న ఫ్యాక్టరీలలో, చిన్న వ్యాపారసంస్థల్లో, చిన్న కర్మాగారాల్లో వాటాదారులుగాగానీ, యజమానులుగాగాని ఉన్న ఇంకా చాలామంది కూడా వచ్చారు. క్లుప్తంలో చెప్పాలంటే వాళ్ళంతా కొద్ది కొద్ది పెట్టుబడిదారులు.

వాళ్లంతా తెలివితేటలుకల్గిన, ఆసక్తికలిగించే మనుష్యులు. వాళ్లు స్పష్టంగా సరళంగా మాట్లాడారు. కార్పొరేషన్లమీదా, గుత్తసంస్థల మీదా వాళ్ళందరికీ మంట. 'గుత్తసంస్థల నడుం విరగ్గొట్టడం' వాళ్ల మతం. పరపీడనకు గుత్తసంస్థలే ప్రధాన స్థానాలు. అక్కడున్న వాళ్లందరూ చెప్పిన శోకగాధ ఇదే. రైల్వేలు, టెలిగ్రాఫ్, విపరీత లాభాల మీద ఆదాయపు పన్ను విధించే సంస్థ మొదలైన గుత్తసంస్థలను ప్రభుత్వం స్వాధీనంచేసుకొని, విపరీత లాభాలను తుదముట్టించి, వాటిని కోరలుతీసిన పాముల్లాగా చేయాలని వాళ్ళంతా ముక్తకంఠంతో ఉద్ఘోషించారు. స్థానికంగా ఆ యా పట్టణాల్లో నీరు, గ్యాస్, టెలిఫోనులు, ట్రాములు మొదలైన ప్రజాసౌకర్యాలు సక్రమంగా నిర్వహింపబడటానికి వీటిపై పురపాలక సంస్థలే యాజమాన్యం వహించాలనికూడా, ఇదేవిధంగా అభ్యర్థించారు.

మిస్టర్. ఆస్మన్‌సెన్ తాను రాళ్లగని యజమానిగా అనుభవించిన సంకటగాధా పరంపర కథనమే ప్రత్యేకంగా చాలా అభిరుచి కలిగించింది. పెద్ద భూకంపంవచ్చి శాన్‌ఫ్రాన్‌సిస్కో సర్వనాశనమైపోయిన సందర్భంలో భారీగా వ్యాపారం సాగినప్పటికీ, తన గనిమీద మాత్రం తనకు చిల్లి దమ్మిడీ కూడా లాభంలేదని ఆయన వప్పుకొన్నాడు. ఆరు సంవత్సరాలపాటు శాన్‌ఫ్రానిసిస్కో పునర్నిర్మాణం సాగింది. ఆయన వ్యాపారం నాల్గింతలనుంచీ ఎనిమిదింతలదాకా పెరిగింది. ఐనప్పటికీ ఆయన బాపుకొన్నదీలేదు.

"నాకన్నా నా వ్యాపారాన్నిగూర్చి రైలుశాఖకే కొంచెం బాగా తెలుసు. ఒక సెంటును నేనెంత ఖర్చుపెడ్తానో దానికి తెలుసు. నా కంట్రాక్టు షరతులూ దానికి తెలుసు. దాని కీసంగతులన్నీ ఎట్లా తెలుసునో నేను ఊహిస్తున్నా. నా ఉద్యోగుల్లోనే దాని గూఢచారులుండి ఉండాలి. నేను కాంట్రాక్టుచేసిన వాళ్లందరితోటి దానికి పరిచయం ఉండి ఉంటుంది. ఎందుకంటే ఇది వినండి. నేనొక పెద్ద కంట్రాక్టుచేసినప్పుడు, దానిలోని షరతులవల్ల కొంచెం లాభాలు వస్తయ్యనుకొన్నప్పుడు, రాళ్లగనినుంచి మార్కెట్టుకు ఆ రాళ్లను తీసుకుపోవడానికయ్యే రైల్వే పన్నును వెంటనే ఎక్కువచేస్తారు. దానికి కారణం చెప్పరు. రైల్వేశాఖ, నాకువచ్చే లాభాలు గుటకాయస్వాహా చేస్తుంది. అటువంటి పరిస్థితుల్లో, రైల్వేశాఖను తాను విధించిన పన్నువిషయం పునారాలోచించమని ఎంత ప్రయత్నంచేసినా లాభంలేకపోయింది. పైగా, ప్రమాదాలు సంభవించినప్పుడూ, రాళ్ళను త్రవ్వించడానికి కూలీ ఎక్కువ ఇవ్వవలసినప్పుడు, తక్కువ లాభాల్తో కాంట్రాక్టులు చేసినప్పుడూ రైల్వేశాఖవారిచేత పన్ను తగ్గించే ప్రయత్నాల్లో విఫలుణ్ణయినా. ఫలితమేమిటి ? కొద్దిగాని గొప్పగాని నా లాభాలెప్పుడూ రైల్వేశాఖకే ముట్టినై."

"అన్ని ఖర్చులూపోను నీకు మిగిలిన మొత్తం, రైల్వేశాఖే తానుగని ఆధిపత్యం వహించి, దాని యజమానిగా నీకు ముట్టచెప్పే జీతంతో సమాన మన్నమాట." అని ఎర్నెస్టు మధ్యలో అడ్డుతగిలాడు.

"అవును. అదే. కొద్దిరోజులక్రితమే గత పది సంవత్సరాల లెక్కలు తనిఖీ వేయించా. ఆ పది సంవత్సరాల్లోనూ నాకు వచ్చిన ఆదాయం, యజమానిగా పుచ్చుకునే జీతంతో సమమైందని తేలింది. రైల్వే శాఖే ఆ గని ఆధిపత్యవహించి, దాన్ని నడపటానికి నన్ను నియమించి నట్లైంది." అన్నాడు మిస్టర్ అస్మన్‌సెన్.

"కానీ ఒక్క భేదం ఉంది. నీవు సాహసించి శిరసావహించిన కష్టనష్టాల్ని అది భరాయించాల్సి ఉండేది." అని ఎర్నెస్టు నవ్వాడు.

"చాలా సత్యమైనమాట." అని అస్మసెన్ దిగాల్తో అన్నాడు. వాళ్లుచెప్పేవన్నీ చెప్పనిచ్చి ఎర్నెస్టు వాళ్లను ఎడాపెడా ప్రశ్నించడం మొదలెట్టాడు. ఆయన మిష్టర్ ఒవెన్‌తో ప్రారంభించాడు.

"మీ రిక్కడ బస్తీలో సుమారు ఆర్నెల్లక్రితం ఒక బ్రాంచి పెట్టారు గదూ?"

"అవును." అన్నాడు మి. ఒవెన్.

"మరి అప్పటినుంచి మూలల్లో ఉన్న చిన్న చిన్న కిరానాదుకాణాలు మూడు ముండమోసిపోవడం గమనించా. దానికంతా కారణం మీ బ్రాంచి స్టోరేగదూ ?"

"మా ముందు వాళ్లు తట్టుకోలేరు." అని ఒవెన్ మందహాసంచేస్తూ అంగీకరించాడు.

"ఎందుకని ?"

"మాది వాళ్ళకన్నా పెద్దపెట్టుబడి. పెద్దవ్యాపారంచేస్తే, తక్కువ దుబారా, ఎక్కువ సమర్థతా ఉంటై."

"మీ బ్రాంచిస్టోరు తక్కిన మూడుదుకాణాల ఆదాయాన్ని గుంజుకొంది. అదీ సంగతి. కానీ, ఆ మూడుదుకాణాల యజమాన్లగతేమైందో చెప్పండి?"

"అందులో ఒకడు మాకు సరకులు రవాణాచేసే ఉద్యోగంలో మా దగ్గర్నే కుదుర్కొన్నాడు. తక్కిన ఇద్దరి సంగతి ఏమైందోమటుకు నాకు తెలియదు."

వెంటనే ఎర్నెస్టు మి. కొవాల్టు వేపు తిరిగాడు.

"మీరు ధరలు తగ్గించి చాలా అమ్మారు, మీరు అణగద్రొక్కాలని ప్రయత్నించిన చిన్న చిన్న ఔషధాలయాలుకలవాళ్ళ పని ఏమైంది? "

"వాళ్ళల్లో ఒకడైన మి. హాస్‌ఫర్డర్, మా వైద్య సలహాశాఖలో పని చేస్తున్నాడు." అన్నాడు.

"వాళ్ళకు వచ్చే లాభాల్ని మీరు గుంజుకున్నారుగదూ ?"

"ఔను. మేం వ్యాపారం చేసేది అందుకనే."

"ఎర్నెస్టు వెంటనే మి. అస్మన్‌సెన్ వేపు తిరిగి, "మరి మీరో? రైల్వే రవాణాశాఖ మీలాభాల్ని దిగమ్రింగినందుకు మీకు విసుగెత్తిపోయిందిగదూ?" అని ప్రశ్నించాడు.

మి. అస్మన్‌సెన్ ఔనని తలూపాడు.

"మీకుమాత్రమే లాభాలు కావాలని అన్నమాట మీరుకోరేది? "

మళ్లీ మి. అస్మన్‌సెన్ అంగీకారసూచకంగా శిరః కంపన చేసాడు.

"ఇతర్లనుంచి ?"

సమాధానంరాలేదు.

"ఇతర్లనుంచి ?" అని మళ్ళీ ప్రశ్నించాడు ఎర్నెస్టు.

"లాభాలు సంపాదించే మార్గమదే." అని మి. అస్మన్‌సన్ కచ్చితంగా జవాబిచ్చాడు.

"ఐతే, వ్యాపారక్రీడ అంటే, ఇతర్లనుంచి లాభాలు సంపాదించడం, మీదగ్గర్నుంచి మాత్రం ఇతర్లు లాభాలు సంపాదించుకోకుండా కట్టుదిట్టం చేసుకోవడమన్నమాట. అదీ అసలువిషయం. ఔనా ?"

మి. అస్మన్‌సెన్ సమాధానం చెప్పేలోగా ఎర్నెస్టు మళ్ళీ ఇదేప్రశ్న వేయాల్సి వచ్చింది. అప్పుడు అస్మన్‌సెన్ ఈవిధంగా చెప్పాడు.

"ఔను అదే. కానీ, ఇతర్లు అన్యాయంగా లాభాలు గడిద్దామని అనుకోనంతవరకూ, వాళ్లుకూడా లాభాలు సంపాదించడానికి మా అభ్యంతరం ఏమీలేదు."

"అన్యాయంగా సంపాదించడమంటే, పెద్దమొత్తంగా అని మీ అభిప్రాయం. ఐనప్పటికీ, మీమటుకు మీరు పెద్దపెద్ద లాభాలు గడించుకోడానికి మీకేమీ ఆటంకంలేదు?......సుమ్మాటికీ లేదుగదూ?"

మి. అస్మన్‌సెన్, ఉన్న బలహీనతను సరసంగా అంగీకరించాడు. ఈ సందర్భం వచ్చేటప్పటికి, ఎర్నెస్టు వెక్కిరించిన మరోవ్యక్తి ఉన్నాడు. ఆయన మి. కాల్విన్. ఆయన పూర్వం పాలుపెరుగు సరఫరా సంఘాన్ని నడిపాడు.

"కొంతకాలంకిందితం మీరు పాలగుత్తసంస్థతో పోట్లాడారు. ఇప్పుడు రాజకీయాల్లో ప్రవేశించారు. ఈ పరిస్థితి ఎందువల్ల వచ్చింది?" అని ఎర్నెస్టు ఆయన్ని ప్రశ్నించాడు.

"ఓహో! నేనా పోరాటాన్ని వదిలిపెట్టలేదు. ఆ గుత్తసంస్థతో పోరాడడానికి అనుకూలమైన ఏకైకమైన రాజకీయ రంగంద్వారానే కృషి చేస్తున్నా. అసలున్నసంగతి చెప్పనీయండి. కొన్ని సంవత్సరాలకిందితం మాపాలు, వెన్నా సరఫరాసంఘం మా అనుకూలమైన పరిస్థితుల్లో గడిచింది." అని సమాధానంచెప్పాడు మి. కాల్విన్. ఆయన కుస్తీపట్టే వస్తాదు ఫక్కీలో ఉన్నాడు.

"కానీ మీలోమీరు పోటీలు పడ్డారుగదూ?" అని ఎర్నెస్టు అడ్డు తగిలాడు.

"నిజమే. అందుకే లాభాలు గూబల్లోకివచ్చినై. మేమంతా సమైక్యంకావడంకోసం ప్రయత్నించాం. కానీ, ప్రత్యేక పాల సరఫరా సంఘవ్యక్తులు కలిసిరాలేదు. అప్పుడు పాల గుత్తసంస్థ ఏర్పడింది."

“స్టాండర్డు ఆయిల్ కంపెనీనుంచి పెద్ద పెట్టుబడితో ఆర్థికసహాయం పొందిీ” అన్నాడు ఎర్నెస్టు.

“ఔను. కానీ దానిసంగతి మాకప్పుడు తెలిసిందిగాదు. దాని ఏజెంట్లు మాదగ్గిరికి ఒక షరతుతో వచ్చారు. ‘మాలో కలవండి. లాభాలు పొందండి.’ ‘లేకపోతే బైటనేఉండండి. నష్టపడండి!’ ఇదీ వాళ్ళ నిర్ణయం. చాలామందిమి దానిలో కలిసాం. కలవనివాళ్లు దెబ్బతిన్నారు. ఓ! అదిమాకు మొదట్లో లాభదాయకంగానే ఉంది. పాలధర నాల్గింతలు పెరిగింది. అందులో ఒకభాగం మాకువచ్చింది. తక్కిన ముప్పాతిక గుత్త సంస్థకు చెల్లింది. మళ్ళీ పాలధర పెంచారు. కానీ ఆ పెరుగుదలలో మాకేమీ అదనంగా రాలేదు. మామొరలన్నీ అరణ్యరోదనాలైనై. అధి కార మంతా గుత్తసంస్థచేతిలో ఉంది. మేమంతా పాచికలమని అప్పుడు తెలుసుకొన్నాం. ఆఖరికి అదనంగా పెరిగిన ధరలో నాల్గోవంతు మాకు నిరాకరించబడింది. తర్వాత ఆ గుత్తసంస్థ మా రక్తమాంసాల్ని పిండేసింది. మేమేంచేయగలం? మేం పిప్పిగా మిగిలాం. పాల సరఫరా వ్యక్తులు అదృశ్యమైపోయారు. ఇక మిగిలింది గుత్తసంస్థ ఒక్కటే.” అని మి. కాల్విన్ అంగీకరించాడు.

“కానీ రెండుసెంట్లు పెరిగిన పాలధరలో మీరు పోటీపడి ఉండే వాళ్ళేననుకొంటున్నా.” అని కొద్దిగా అందించాడు ఎర్నెస్టు.

“మేమూ అదే అనుకొన్నాం. ప్రయత్నించాం.” అని కాల్విన్ ఒక్క క్షణమాగి, “దానివల్ల మేందెబ్బతిన్నాం. మాకన్నా కారుచౌకగా గుత్త సంస్థ పాలు అమ్మకల్గుతుంది. మేం అసలుక్కూడా నష్టం వచ్చేటట్లు అమ్ముతూంటే అది కొద్దిలాభంకూడా వచ్చేటట్లు అమ్మకల్గుతుంది. నేనా సాహసంలో 50వేల డాలర్లు లోలాభంతిన్నా. మాలో చాలామంది దివాలా

తీసారు. అసలు పాలసరఫరాచేసే వ్యక్తులే నామరూపాలులేకుండా పోయారు.''

"అందువల్ల, గుత్తసంస్థ మీలాభాలు కాజేసిందన్నమాట. శాసనసభ ద్వారా గుత్తసంస్థ లేకుండాచేసి మళ్ళీ మీలాభాలు మీరు సంపాదించుకో డానికి మరిమీరు రాజకీయాల్లో ప్రవేశించారుగదూ?''

మి. కాల్విన్ మొగం వికసించింది. "పాలసరఫరా వ్యక్తులకు నేను నా ఉపన్యాసాల్లో చెప్పేది అదే. మూడు ముక్కల్లో చెప్పాలంటే, మా ఉద్దేశ్యం అదే."

"ఐనప్పటికీ, పాలు సరఫరాచేసే ప్రత్యేక వ్యక్తులకన్నా గుత్తసంస్థ చౌకగా పాలు ఉత్పత్తి చేయగల్గుతుందికదూ?'' అని ప్రశ్నించాడు ఎర్నెస్టు.

"దానికున్న అద్భుత నిర్మాణపటిమవల్లా, పెద్ద పెట్టుబడివల్లా, కొత్త యంత్రాలవల్లా అది ఎందుకు ఉత్పత్తి చేయగూడదు?''

"ఈ విషయంలో వివాదమే లేదు. అది కచ్చితంగా చేస్తుంది. పైగా చేస్తున్నదికూడా.''

తన దృక్పథాన్ని వివరించడానికి మి. కాల్విన్ ఇక్కడొక రాజకీయ ఉపన్యాసం దంచాడు. తక్కిన వాళ్ళంతా అతనితో మనస్ఫూర్తిగా ఏకీభ వించారు. గుత్తసంస్థను నాశనం చేయడమే వాళ్ళందరి నినాదం.

"పిచ్చిగుంపు. వాళ్ళు చూడగల్గినంతవరకూ విస్పష్టంగా చూచారు. కానీ వాళ్ళు వాళ్ళ నాసికాగ్రాలవరకే చూస్తున్నారు." అని ఎర్నెస్టు మెల్లగా నాతో అన్నాడు.

కొంతసేపైన తర్వాత ఆయన మళ్ళీ ఉపక్రమించాడు. ఆయన తన ప్రజ్ఞావిశేషంవల్ల ఆ సాయంకాలమంతా అందర్నీ ముగ్ధుల్ని చేయగల్గాడు. "నేను మీరు చెప్పిందంతా చాలా జాగ్రత్తగా విన్నా. మీరు సనాతన పద్ధ తుల్లో వ్యాపారక్రీడ చేస్తున్నారని నాకు స్పష్టంగా అర్థమైంది. లాభా

ల్లోటే మీజీవితాలు నిమగ్నాలైనై. కేవలం లాభాలు సంపాదించడానికే మీరు సృష్టింపబడ్డారనే దృఢవిశ్వాసం మీలో ఉంది. ఉన్న చిక్కల్లా అక్కణ్ణే. మీరు లాభాలు సంపాదించుకొనే మధ్యలో గుత్తసంస్థ వెలిసి మీలాభాలన్నీ గద్ద తన్నుకు పోయినట్లుగా ఒక్కసారి తన్నుకుపోతుంది. మధ్యలో వచ్చిపడే బెడదే ఇది. మీలాభాలకు ఆటంకాన్ని కలిగించేదాన్ని నాశనంచేయడమే మీ అభిప్రాయమనుకొంటా."

"మీరు చెప్పిందంతా నేను జాగ్రత్తగా విన్నా. మీ అందర్నీ ఒక్కమాటలో చెప్పవచ్చు. మిమ్మల్ని ఆ పేరుతో పిలుస్తా. మీరు యంత్ర విధ్వంసకులు. యంత్రవిధ్వంసకుడంటే ఎవరో మీకు తెలుసా? చెప్తా ఉండండి. 18వ శతాబ్దంలో ఇంగ్లండులో పురుషులూ, స్త్రీలూ తమ తమ కుటీరాల్లో చేమగ్గాలమీద గుడ్డ నేసారు. ఈ కుటీరపరిశ్రమా విధానం చిక్కు పంచాంగం—తాబేటి నడకగలది. గుడ్డ నేయడానికి చాలా ఖర్చు అయ్యేది. దాంతోపాటు ఆవిరియంత్రం, శ్రమను తగ్గించే యంత్రం వచ్చినై. ఒక పెద్ద ఫ్యాక్టరీలో కొన్ని వేల మగ్గాలు ఒక ప్రధాన యంత్రం ద్వారా నడపబడుతై. చేనేత మగ్గాలమీద నేసే దానికన్నా ఎన్నో రెట్లు ఎంతో చౌకగా త్వరితకాలంలో గుడ్డ తయారవుతుంది. ఇక్కడ ఫ్యాక్టరీలో కలిసికట్టుతనం ఉంది. దానిముందు పోటీ అంతర్ధానమైపోయింది. తమకోసం చేమగ్గాలమీద పనిచేసికొన్న పురుషులూ, స్త్రీలూ ఇప్పుడు ఫ్యాక్టరీల్లోకిపోయి యంత్రపు మగ్గాలమీద పనిచేయడం ప్రారంభించారు. కానీ ఈ పని చేయడం తమకోసం కాదు. పెట్టుబడిదారులకోసం. పైగా యంత్రపు మగ్గాలమీద పనిచేయడానికి పిల్లలు తయారయ్యారు. తక్కువ జీతాలకే పనిచేస్తున్నందువల్ల వీళ్లు పెద్దవాళ్ల నోటిముందు జీవనం తీసారు. దీనివల్ల పురుషులకు గడ్డురోజులేర్పడినై. వాళ్ళ జీవనస్థాయి పడిపోయింది. వాళ్లు కూటికి జరగక అల్లాడి ఆకులు మేసారు. ఇంతకష్టానికీ కారణం

యంత్రాలనే వాళ్ళన్నారు. అందుకని వాళ్లు యంత్రాల్ని విధ్వంసం చేయడానికి ఉద్యమించారు. వాళ్ళకు జయంకలగలేదు. వాళ్లు కటిక మూర్ఖులు.”

“ఐనప్పటికీ మీరు వాళ్ళనుంచి గుణపాఠం నేర్చుకోలేదు. ఒక శతాబ్దన్నరకాలంగడచిన తర్వాత మళ్ళీ ఇవ్వాళ మీ రా యంత్రవిధ్వంసనకు ప్రయత్నం చేస్తున్నారు. గుత్తసంస్థ యంత్రాలు మీ కన్నా సమర్థతో చౌకగా తయారుచేసాయని మీరే అంగీకరించారు. దాంతో మీరు పోటీ చేయలేకపోవడానికి కారణం ఇదే. ఇవ్వాళ యంత్రాల్ని ధ్వంసం చేస్తా మంటున్నారు. ఇంగ్లండులో ఇదివరకున్న మూర్ఖులకన్నా మీ రింకా రెండాకులు ఎక్కువ చదువుకున్నారు. పోటీచేద్దామని మీరు ప్రయత్నాలు సాగిస్తూంటే, మరోవంక గుత్త సంస్థ మిమ్మల్ని తుడిచిపెట్టేస్తోంది.”

“మీరంతా చెప్పేది ఒకటే—పోటీలు పోవడం; సమైక్యంకావడం. ఒవెన్ మహాశయా! ఇక్కడ బర్క్లీలో మీ బ్రాంచి తక్కిన ముగ్గురు చిన్న దుకాణదారుల్ని అణచేయడంద్వారా పోటీలేకుండా చేసారు. మీ సమైక్యత గొప్పఫలితాన్ని ఇచ్చింది. ఐనప్పటికీ మీ మీదకువచ్చే ఇతర-అంటే గుత్త సంస్థ సమైక్యతకు మీరు బాధపడి గగ్గోలుపెడ్తున్నారు. ఎందుకంటే, మీరు గుత్తయజమానులుకారుగాబట్టి. మొత్తం అమెరికా సంయుక్తరాష్ట్రానికి మీరే కిరానా గుత్తాధికారులైనట్లైతే, మీరు మరో పాట పాడేవారే. ‘గుత్తాధికారులు వర్ధిల్లాలి’ అనే పాట అది. ఇంకా, మీ ఈ అల్పసమైక్యత గుత్తసంస్థ కాకపోవడమే. దానికి తగిన తోడుకూడా లేదన్న సంగతి కూడా మీకు తెలుసు. మీ ఆశయాల్ని పరమపవిత్రం చేసుకోడానికి ఉద్యమించారు. మీరూ మీ బ్రాంచి స్టోరులూ ఈ చదరంగపుటెత్తుల్లో పావులని భావిస్తున్నారు. ప్రబల శక్తులు తలెత్తుతున్న సంగతీ, అవి రోజు రోజుకూ శక్తిమంతాలౌతున్న సంగతీ మీరు గమనిస్తూనే ఉన్నారు.

రైలురోడ్డు, నూనె, ఉక్కు, బొగ్గు, గుత్తసంస్థల కవచహస్తాలు మీలాభాల మీదకు ప్రసరించి ఇక్కడకాస్త, అక్కడకాస్త చొప్పున అపహరిస్తున్నవని మీరు బాధపడుతున్నారు. మీకు వచ్చేలాభాల్లో చిట్టచివరి దమ్మిడీతో సహా మొత్తం గుంజుకోని ఆఖరికి మీ నెత్తిన చేతులుపెడ్తారన్న సంగతి మీకు తెలుసు."

"మహాశయా! మీరు జూదం బాగా చేతగాదు. మీ అఖండ ఐక్యతద్వారా ఇక్కడ బల్లకాలో ఉన్న మూడు చిన్న కిరానాదుకాణాల్ని నామరూపాలులేకుండా చేసినతర్వాత, మాఅంతవాళ్లు లేరని బొమ్మ విరుచుకు తిరిగారు. సమర్థతనుగురించీ, వ్యాపార నైపుణ్యాన్ని గురించీ మహోపన్యాసాలు చేసారు. ఆమూడు చిన్న దుకాణాల్ని నాశనంచేసి, వాటికి వచ్చే లాభాల్ని కూడా గుంజుకోని ఆడబ్బుతో మీరు మీభార్యను యూరపు యాత్రకు పంపించారు. అది చిన్నచేపను పెద్దచేపను మ్రింగే ఫక్కీ. వాళ్లను మీరు మ్రింగారు. కానీ, మీకన్నా పెద్దచేపలు మిమ్మల్ని మ్రింగుతున్నాయ్. అందుచే మీరు గగ్గోలెత్తుతున్నారు. మీరు నేచెప్పే విషయమే, పరిస్థితే ఇక్కడ బల్లముందు కూర్చున్న మిగతావాళ్లందరికీ అక్షరాలా అనువర్తిస్తుంది. మీరందరూ లబలబలాడుతున్నారు. మీరంతా ఓడిపోయే ఆటను ఆడుతున్నారు. మరి మీరంతా దానికోసం లబోదిబో అని ఆక్రందిస్తున్నారు."

"కానీ, మీరు గగ్గోలుపెట్టినప్పుడు ఉన్నదున్నట్లుగా నేను చెప్పినట్లుగా మీరు పరిస్థితిని వెల్లడించలేదు. ఇతర్లనుంచి లాభాలు పిండుకోవడం ఇష్టమనీ, మీదగ్గర్నుంచి ఇతర్లు లాభాలు పిండుకోడానికి ప్రయత్నిస్తున్నందు వల్లనే ఇంత రభసాపస్తున్నామనీ మీరు చెప్పలేదు. చెప్పరు. ఆ విషయంలో మీరు హుషారైనవాళ్లు. మీరింకేదో చేస్తారు. మి. కాల్విన్ చేసినట్లుగా మీరు ఫోటో పెట్టుబడిదారి రాజకీయోపన్యాసాలు చేస్తున్నారు. ఆయన చెప్పిం

దేమిటి? ఆయన చెప్పినవాటిల్లో నేను గుర్తుంచుకొన్న కొన్ని పదజాలా లివిగో."

మా అసలుసిద్ధాంతాలు మంచివి. 'ఇప్పుడీ దేశానికి కావలసిందేమి టంటే' అమెరికన్‌కు సంబంధించిన ప్రధాన విధానాలు అంటే 'అందరికీ స్వేచ్ఛావకాశాలు' 'ఈజాతి పుట్టిన స్వేచ్ఛా ఆదర్శం' 'మన ప్రాచీన సిద్ధాంతాలకు పోదాంపదండి.'

" 'అందరికీ స్వేచ్ఛావకాశాలు' అని ఆయన అంటున్నాడంటే, ఏ స్వేచ్ఛావకాశాలైతే గుత్తసంస్థ తనకు ఈయడానికి నిరాకరించిందో, ఆలాభాలు పిండుకొనే స్వేచ్ఛావకాశాలు అన్నమాట ఆయన అభిప్రాయం. దీనిలో అసంగతమైన విషయ మేమిటంటే, మీరు దీన్ని నమ్మేటంతగా ఈ పదాన్ని వాడారు. మీ స్వల్పవిధానంలో మీ సహచరుల్ని నిలువుదోపిడీ చేయ డానికి మీరు అవకాశం కావాలని కోరుతున్నారు. కానీ, మీకు స్వేచ్ఛ గావాలని మిమ్మల్ని మీరు భ్రమలో ముంచుకొంటున్నారు. మీరంతా చిన్నినాపొట్టకు శ్రీరామరక్ష అనేవాళ్లు. కానీ మీమాటల్లో ఉన్న తమాషా మీరు దేశభక్తులనే నమ్మకం కలిగేటట్లు చేస్తోంది. లాభాలు సంపాదిద్దామనే కేవలం స్వార్థమైన మీ కాంక్షను, పీడత ప్రజానీకానికి సహాక రించే పరహితార్థ భావంగా మార్చివేస్తున్నారు. ఇప్పుడురాండి. మనలో మనమే. ఈ ఒక్కసారైనా నిజాయితీగా ఉండండి. అసలువిషయాన్ని కచ్చితంగా పరిశీలించండి. దాన్ని నిక్కచ్చిగా చెప్పండి."

అందరిమొగాలూ కోపంతో ఎర్రబారిపోయినై. కొంచెం భయం కూడా గోచరించింది. ప్రశాంతంగా ఉన్న ఈ యువకునిచూచి, ఆయన వాగ్ధాటికీ, గడ్డెనిగడ్డని పిలిచే ఆయన నిర్భయ సత్యవాక్యాలకూ కొంచెం భయపడిపోయారు. మి. కాల్విన్ కచ్చితంగా సమాధానంచెప్పాడు.

"మరెందుకని కాదు ?" అని ఆయన ప్రశ్నించాడు. "ఈ రిపబ్లిక్కు స్థాపించబడిన నాటి మన పూర్వీకుల మార్గాలకు మనమెందుకు తిరోగమించకూడదు ? సహించడానికి వీలుకానిదైనప్పటికీ మిస్టర్. ఎవర్‌హార్డ్ ! మీరు సత్యాన్నే ఎక్కువగా చెప్పారు. కానీ ఇక్కడ మనలో మనం ఉన్నదున్నట్లుగా మాట్లాడేద్దాం. ఉన్న ముసుగంతా తొలిగించేసి, ఎవర్‌హార్డ్ చెప్పినట్లుగా ఆ కచ్చితమైన సత్యాన్ని అంగీకరిద్దాం. చిన్న పెట్టుబడిదారులమైన మనం లాభాలకోసం తాపత్రయపడుతున్నామన్న మాటా, గుత్తసంస్థ మన దగ్గర్నుంచి లాభాలు గుంజుకొంటున్నమాటా నిజమే. మన లాభాలు మనకే ఉండేటందుకుగాను మనం ఆ గుత్తాధికారుల్ని నాశనంచేద్దామంటున్న మాటా నిజమే. మన మెందుకు ఆ పని చేయగూడదు ? ఎందుకని ? ఎందుకని నేను మిమ్మ అడుగుతున్నా ? "

"ఆ, ఇప్పుడువచ్చాం మనం విషయసారాంశానికి." అని ఎర్నెస్టు ఆనందంతో అన్నాడు. "చెప్పడం చాలా కష్టసాధ్యమైన విషయమైనా, ఎందుకు కాదో మీకు చెప్పడానికి ప్రయత్నిస్తా. మీరంతా వ్యాపారాన్ని గూర్చి కొద్దిగా నేర్చుకొన్నారు. కాని మీ రసలు సాంఘిక పరిణామాన్ని గూర్చి లేశం గూడా నేర్చుకోలేదు. ఆర్థికపరిణామంలో ఈనాడు మీరు పాతా క్రొత్తా సంధిలో ఉన్నారు. కానీ మీరది అర్థంచేసుకోలేదు. అదే ఇంత గాభరాకు ముఖ్యకారణం. మీ రెందుకు తిరోగమించలేరు ? ఎందుకంటే మీరు చేయలేరుకాబట్టి. నీటిని కొండనైకి మరలించడం దుస్సాధ్యమైనట్లే, ఆర్థికపరిణామ ప్రవాహాన్ని అదివచ్చిన మార్గంలో వెనక్కి మరలించడం మీచేత కానిపని. సూర్యుణ్ణి గిబియన్ మీద నిశ్చలంగా నిలబడేటట్లుగా జాషువా చేశాడు. కానీ మీరు ఆ జాషువాను తలదన్నిపోతున్నారు. మీరు ఆకాశంలో సూర్యుణ్ణి తిరోగమనం చేయించేటట్లున్నారు.

మధ్యాహ్నం నుంచి ప్రొద్దుటివరకూ దాని పదార్ని గుర్తించడానికి అవకాశం ఉంది."

"శ్రమ తగ్గించే యంత్రాలు వచ్చిన తర్వాత, నిర్మాణయుతమైన ఉత్పత్తిజరుగుతున్న ఈనాడు, సమైక్యతవల్ల సామర్థ్యం హెచ్చిన ఈ దినాల్లో మీ రీ ఆర్థిక భాస్కరుణ్ణి ఒక తరానికివెనక్కి నెట్టుకుపోవడానికి చూస్తున్నారు. పెద్ద పెట్టుబడిదారులు, పెద్దయంత్రాగారాలు, రైలురోడ్లులేని కాలమది. కొద్దిమంది చిన్న పెట్టుబడిదారులు ఆర్థిక అరాచకంలో పరస్పరం శిఖపట్లగోత్రులుగా ఉన్న రోజులవి. ఉత్పత్తి ప్రాథమికదశలో ఉండి, దుబారాగా ఉండి, ఎవరికివారే యమునాతీరేగా ఉండి, ఎక్కువ ఖర్చుతో గూడిన రోజులవి. నా మాట నమ్మండి. జాషువా పని చాలా తేలికైంది. ఆయనకు సహాయకారిగా జహోవా ఉన్నాడు. కానీ, చిన్న పెట్టుబడిదారులైన మిమ్మల్ని దేవుడు పరిత్యజించాడు. చిన్న పెట్టుబడిదారుల సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆ సూర్యుడు మళ్ళీ ఉదయించడు. కానీ, ఆ సూర్యుణ్ణి కదలకుండా ఉంచడం మీ చేతుల్లోనూలేదు. మీరు అణగారిపోతున్నారు. సమాజంలోనుంచి మీరు పూర్తిగా ఊడ్చిపెట్టుకొనిపోయే దుర్దినాలు వచ్చినై."

"ఇది పరిణామ శాసనం. ఇది దైవప్రవచనం. పోటీకన్నా సమైక్యత బలిష్ఠమైంది. పర్వతగుహల్లో నివసించిన ఆదిమ మానవుడు అల్పజీవి. అతడు సుసంఘటితపడి తన శత్రువులైన క్రూరమృగాలతో పోరాడాడు. అవి పోటీపడే జంతువులు. ఆదిమ మానవుడు సంఘటిత జంతువు. అందుకే అతడు తక్కిన జంతువుల మీద ప్రాబల్యం వహించాడు. అప్పటినుంచీ మానవుడు అధికతరంగా సుసంఘటితమాతూ ఉన్నాడు. సుసంఘటితత్వానికీ పోటీకీ ఎడమొగం పెడమొగం. వేలశతాబ్దాల దీర్ఘపోరాటంలో

పోటీ ఎప్పుడూ నానాటికి తీసికట్టుగా తయారౌతూ వచ్చింది. పోటీ పక్షాన చేరిన ఏ వ్యక్తి వాసరే అణగారిపోవాల్సిందే. ''

" మరి గుత్తయజమానులు పోటీవల్లనే పైకివచ్చారుగదా, " అని మిస్టర్. కాల్విన్ అడ్డుతగిలాడు.

'' నిజమే. ఆ గుత్తాధికారులే స్వయంగా పోటీని నాశనంచేశారు అందుకనే, మీరే స్వయంగా చెప్పినట్లుగా, మీరింకా పాలసరఫరా సంస్థలో ఉండలేకపోయారు. '' అని సమాధానం చెప్పాడు ఎర్నెస్టు.

ఆ సాయంకాలం మొట్టమొదటిసారిగా హైలుదేరిన నవ్వులు అందర్లోనూ వ్యాపించినై. మి. కాల్విన్‌గూడా తననుగురించి తానే నవ్వుకొన్నాడు.

"ఇప్పుడు మనమంతా గుత్తాధికారులమీదికి కత్తిదూస్తున్నాం కాబట్టి, కొన్ని విషయాలు చక్కచేసుకొందాం. నేను కొన్ని ప్రకటనలుచేస్తా. మీరు వాటితో ఏకీభవించకపోతే చెప్పేయండి. మౌనంగా ఉన్నారంటే అంగీకరిస్తున్నారన్నమాట. చేమగ్గానికన్నా, యంత్రపు మగ్గం చౌకలో ఎక్కువ గుడ్డను తయారుచేస్తుందన్నది నిజంగాదా ? '' అని ఆయన ఆగాడు. కానీ ఎవరూ మాట్లాడలేదు. " అటువంటప్పుడు, యంత్రపు మగ్గాన్ని ధ్వంసంచేసి,ఎక్కువ చిక్కుతోకూడిందీ, ఎక్కువడబ్బు ఖర్చయ్యేదీ అయిన చేమగ్గాన్ని ఆశ్రయిస్తామనడం చాలా అనాలోచితమైన పనికాదా !'' అంగీకారంగా తలలూగినై.

" కొన్నివేల ఛోటా పోటీదారులకన్నా, సంఘటితమైన గుత్త సంస్థలు ఇంకా ఎక్కువ సమర్థతతో, ఎక్కువచౌకగా ఉత్పత్తి చేయగల్గుతున్నది నిజంగాదా?'' ఇప్పటికీ ఎవరూ అభ్యంతరంచెప్పలేదు. "అటువంటప్పుడు, సమర్థమైన, అల్పవ్యయంతో కూడుకొన్న ఆ సమైక్యతను విచ్ఛి

న్నం చేయడం తెలివితక్కువతనం కామా ?" చాలా సేపటివరకూ ఒక్కరూ సమాధానం చెప్పలేదు. తర్వాత మి. కొవాల్టు మాట్లాడాడు.

"ఇక ఇప్పుడు మనం చేయాల్సిందేమిటి? గుత్తాధికారుల ఆధిపత్యం నుంచి తప్పించుకోవాలంటే వాటిని నాశనంచేయడ మొక్కటే మాకు కన పడుతున్న మార్గం" అన్నాడు. ఆక్షణంలో ఎర్నెస్టు రోషావిష్టుడైనాడు.

"నేను మీకు మరోమార్గం చూపిస్తా!" అని బొబ్బపెట్టి, "సమర్థతతో, అల్పవ్యయంతో ఉత్పత్తిచేస్తున్న అద్భుతాలైన ఆ యంత్రాల్ని నాశనం చేయనక్కర్లేదు. వాటిని అదుపులో పెడదాం. వాటి సమర్థతవల్లా, అల్పవ్యయంవల్లా మనం లాభంపొందుదాం. వాటిని మనకోసం నడుపు కొందాం. ఆ అద్భుతయంత్రాలకు ప్రస్తుత యజమానులైన వాళ్లందర్నీ అవతలికి నెట్టేద్దాం. ఆయంత్రాల్ని మనకోసం మనమే స్వాధీనంచేసు కొందాం. ఇప్పటివరకూ భూమండలంలో లేనటువంటి ఆర్థిక సాంఘిక సమైక్యత అది. గుత్తసంస్థలకన్నా బలిష్టమైన సమైక్యత అది. అదే సామ్య వాదం. పరిణామమార్గంలో అదిఉంది. ఇంకా ఎక్కువ సమైక్యతతో సమైక్యతను ఎదిరిద్దాం. అదే విజయపక్షం. మా సోషలిస్టుల పక్షాన్న చేరండి. విజయపక్షంతో కార్యరంగంలో ప్రవేశించండి!"

ఈవిషయానికి వచ్చేటప్పటికి కొంత అనంగీకారం బయలుదేరింది. కొందన్నట్లుగా తలలూపారు. కొన్ని మాటలుకూడా వినపడ్డయ్.

"సరే. మీకు ఉన్న విషయాల్ని తారుమారుచేసి చెప్పేవాళ్లుగా ఉండడానికి వప్పుకొంటారన్నమాట." అని ఎర్నెస్టు నవ్వాడు. "మీరు మళ్ళీ మృగపాత్ర ధరించడానికి కోరుతున్నారన్నమాట. మృగదశకు తిరోగ మిద్దామనుకొన్నవాళ్లు ఊరూ పేరూలేకుండా సోదిలోకిరాకుండా పోయినట్లే మీరూ నశించిపోతారు. ప్రస్తుతమున్న గుత్తసంస్థలకన్నా ఇంకా బలవత్తర సమైక్యత జనించినప్పుడు మీగతేమాతుందో అన్నది ఎప్పుడైనా

అడిగారా? సమైక్యతకుకూడా సమైక్యతైన సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితాల్లో ఈ గుత్తాధికారులు తామంతా సమైక్యమైనప్పుడు మీ రెక్కలుడుం టారో మీ రేనాడైనా ఆలోచించారా?"

ఆయన వెంటనే మి. కాల్విన్ వేపు తిరిగాడు.

"ఇదినిజం కాదేమో మీరుచెప్పండి? పాతరాజకీయ పార్టీలు గుత్త యజమానుల చేతుల్లో ఉన్నందున మీరు మరోరాజకీయపార్టీని ఏర్పర్చాల్సిన అగత్యత ఏర్పడింది. మీ ప్రచారానికి ముఖ్యమైన ప్రతిబంధకులు గుత్త యజమానులే. మీరు వచ్చే ప్రతి ఆటంకానికీ కారకులు గుత్తాధికారులే. ఇది నిజమౌనా కాదా? నాకు చెప్పండి."

మి. కాల్విన్ ఉద్దుకుచుకొన్నట్లు మౌనంగా కూర్చున్నాడు.

"ఊఁ! చెప్పకుపోండి!" అని ఎర్నెస్టు ఉసిచ్చాడు.

"మేం ఆర్గన్ ప్రభుత్వ శాసనసభను ఆక్రమించుకొన్నదీ, తీవ్రమైనా ఆత్మరక్షణశాసనంకోసం కృషిచేసేంపీ యథార్థమే. కానీ, గుత్తసంస్థల చేతుల్లో కీలుబొమ్మైన గవర్నర్‌దాన్ని త్రోసిరాజన్నాడు. మేం కాలొరెడోలో గవర్నర్‌ను ఎన్నుకొన్నాం. కానీ అక్కడి శాసనసభ ఆయన్ని అధికారంలో ప్రవేశించడానికి నిరాకరించింది. రెండు పర్యాయాలు మేం జాతీయ ఆదాయపుపన్నును తీర్మానించాం. ప్రతిదఫా, సుప్రీంకోర్టు దాన్ని రాజ్యాంగ విరుద్ధమని పుట్టుకలోనే నెట్టేసింది. న్యాయస్థానాలు గుత్త యజమానుల చేతుల్లో ఉన్నయ్. ప్రజలమైన మేం మా న్యాయాధిపతులకు తగినట్లుగా డబ్బిచ్చుకోలేం. కానీ, మేం ......... రోజు వస్తుంది—"

"గుత్తసంస్థలు శాసనవిధానాలపై ఆధిక్యత సంపాదించే రోజూ, గుత్తసంస్థలు సుసంఘటితమై అదే ప్రభుత్వంగా మారినరోజూ అనేగా," అని ఎర్నెస్టు సంభాషణకు అడ్డుతగిలాడు.

"ఎన్నటికీ కాదు! ఎన్నటికీ కాదు!" అన్న అరుపులు వినపడ్డయ్. ప్రతివాడూ ఉద్రేకపూరితుడై క్రోధావిష్టుడైనాడు.

"అటువంటిరోజు వచ్చినప్పుడు మీరేం చేస్తారో నాకుచెప్పండి." అని ఎర్నెస్టు ప్రశ్నించాడు.

"మా బలంతో విజృంభిస్తాం!" అని మి. అస్మన్‌సెన్ బొబ్బపెట్టాడు. ఆయన నిర్ణయంతో చాలాగొంతుకలు శృతికల్పినై.

"అది అంతర్యుద్ధమౌతుంది." అని ఎర్నెస్టు వాళ్లకు హెచ్చరిక చేసాడు.

"అంతర్యుద్ధమైతే కానీయండి. మా ప్రాచీనులు చేసిన కర్తవ్యాన్ని మేం మరచిపోలేము. మా స్వేచ్ఛకోసం మేం పోరాడుతాం, చస్తాం." అని మి. అస్మన్‌సెన్ ప్రత్యుత్తరమిచ్చాడు. ఆయనతోపాటు తక్కిన వాళ్ల కంఠాలు తోడుకలిసినై.

ఎర్నెస్టు చిరునవ్వునవ్వాడు.

"గౌరవనీయులారా! మీ విషయంలో స్వేచ్ఛ అంటే ఇతర్లనుంచి లాభాలు పిండుకునే స్వాతంత్ర్యమన్న విషయాన్ని మనం ఇంతకుముందు సక్రమంగా అంగీకరించామన్నది మరచిపోకండి!" అన్నాడాయన. అక్కడ వాళ్లందరిలో కోపం నాట్యమాడింది. ఇప్పుడది ఇంకా స్థాయిత్వాన్ని పొందింది. కానీ ఎర్నెస్టు ఆ గందరగోళాన్ని అదుపులోకి తెచ్చి, తన గొంతుక విప్పాడు.

"ఇంకో ప్రశ్న. మీరు మీబలంతో విజృంభించినప్పుడు, మీరు చెప్పేకారణం ఏమిటంటే, 'ప్రభుత్వం గుత్తాధికారుల చేతుల్లోఉందికాబట్టి' అన్నది జ్ఞాపకం ఉంచుకోండి. కాబట్టి మీ బలానికి ప్రతిపక్షంగా ఆ ప్రభుత్వం మీమీదికి పోలీసుల్ని, నావికాదళాన్ని, మిలిటరీని, ఒక్కమాటలో చెప్పాలంటే అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో సంఘటితపర్చబడిన యుద్ధ పరిక

రాలన్నీ ప్రయోగిస్తారు. అప్పుడు మీ బలం ఎక్కడుంటుంది ?" వాళ్ల మొగాల్లో దైన్యం గోచరించింది. మళ్ళీ వాళ్లు కోలుకో నేలోపల్నే, ఎర్నెస్టు మళ్ళీ ఎదురు దాడిచేశాడు.

కొన్నాళ్ళ క్రితం మన సామాన్య సైన్యం 50 వేలవరకే ఉండేదన్న విషయం మీకు జ్ఞాపకమేకదా ? సంవత్సరం సంవత్సరానికి పెరిగి పెరిగి ఈనాడు మూడువందల వేలయింది. " మళ్ళీ ప్రారంభించాడు.

" ఇంతేకాదు. లాభాలనే మీ అత్యంత ప్రీతికరమైన భ్రాంతి స్వరూపాలకోసం జాగ్రత్తగా మీరు రాత్రింబవళ్లూ పలవరిస్తూన్నప్పుడు, మీ ప్రాణ ప్రాణమైన పోటీకోసం నైతిక ధర్మసూత్ర నిర్మాణంచేసేలోగా, కలయికవల్ల ఇంకా ఇంతకన్నా అమితప్రయోజనకరాలైన, అత్యావశ్యకాలైన గొప్ప గొప్ప విషయాల్ని సాధించవచ్చు. సైన్యమొకటుంది. "

"అదిమా బలం ! దాంతో మేం సామాన్యసైన్య దండయాత్రను ఎదిరిస్తాం. " అని మి. కోవాల్టు అరిచాడు.

" మీరు కూడా సైన్యంలో చేరుతారు. స్వేచ్ఛకోసం అంతర్యుద్ధం చేసే మీ సోదరుల్ని రక్తప్రవాహంలో స్నానంచేయించడానికి మిమ్మల్ని మెన్, ఫ్లారిడా లేక ఫిలిప్పయిన్, లేకపోతే మరెక్కడకో పంపుతారు. అదే సమయంలో, కాన్సాస్‌నుంచో, విస్‌కన్‌సిన్‌నుంచో లేక మరే ఇతర రాష్ట్రం నుంచో మీ సోదరులే సైన్యంలోచేరి ఇక్కడకు కాలిఫోర్నియాకువచ్చి మీ అంతర్యుద్ధాన్ని రుధిరవాహినిలో ముంచెత్తుతారు. " అని ఎర్నెస్టు తిరుగు సమాధానం చెప్పాడు.

ఇప్పుడు వాళ్ళంతా బాగా దెబ్బతిన్నారు. మాటామంతీలేకుండా కూర్చున్నారు. తర్వాత మిస్టర్. ఓవెన్ సణిగాడు.

" మేం సైన్యంలోచేరం. అదే తేలుస్తుంది. మేమంత తెలివి తక్కువవాళ్ళం కాము. " ఎర్నెస్టు నిర్దాక్షిణ్యంగా నవ్వాడు.

" సమైక్యతవల్లకలిగే ఫలితమేంటో మీరింకా అర్థంచేసుకోలేదు. మీరు చేయగలిగిందేమీలేదు. మీరు సైన్యంలోకి పట్టుబలవంతాన తీసుకోబడ్తారు. "

" సివిల్ లా అంటూ ఒకటుందిగా ? " అని మిస్టర్ ఒవెన్ గట్టిగా మాట్లాడాడు.

" ప్రభుత్వం సివిల్‌లాను తీసేసినప్పుడు ఉండదు. ఆ రోజున మీరు మీ బలంతో విజృంభిస్తాం అని అనుకొన్నప్పుడు మీ బలాన్నే మీ మీదకి ఉసికొల్పుతారు. మీకు ఇష్టమున్నా లేకపోయినా మిమ్మల్ని సైన్యంలోకి తీసుకొంటారు. ఇంతకుముందే ఎవరి నోటినుంచో. హేబియస్‌కార్పస్ అన్నమాటలు విన్నా. హేబియస్‌కార్పస్‌కు బదులుగా మీకు శవపరీక్ష జరుగుతుంది. మీరు సైన్యంలోచేరడానికి నిరాకరిస్తే, లేకపోతేమీరు చేరిన తర్వాత వాళ్ల ఆజ్ఞల్ని ధిక్కరిస్తే, మిమ్మల్ని తలకాయలేని కోర్టుమార్షల్ శిక్ష వేసి కుక్కల్ని కాల్చేసినట్లు నిలువునా కాల్చేస్తారు. అదీ శాసనం !. "

" అదికాదు శాసనం. అటువంటి శాసనమంటూలేదు. అబ్బాయ్! నీవు కలలుగంటున్నావ్. అందాకా ఎందుకు, సైన్యాన్ని ఫిలిప్పయిన్ దీవులకు పంపిస్తారని అన్నావ్. అది రాజ్యాంగ విరుద్ధం. సైన్యాన్ని దేశాంతరానికి పంపకూడదని రాజ్యాంగం ప్రత్యేకంగా పేర్కొన్నది. " అని మి. కాల్విన్ తన వాదన సమర్థించుకొన్నాడు.

" దాంతో రాజ్యాంగానికేం నిమిత్తం ? న్యాయస్థానాలు గుత్తాధికారుల చేతుల్లో కీలుబొమ్మలు. పైగా, నే నిదివరకే చెప్పినట్లుగా అది శాసనం. 9 సంవత్సరాల తరబడి అది శాసనంగా చెలామణి అవుతున్నది. మహాశయులారా ! " అని ఎర్నెస్టు మాట్లాడాడు.

"మమ్మల్ని సైన్యంలోకి పట్టుబలవంతాన చేర్చుకోవడం, మేం నిరాకరిస్తే గొర్రెతలకాయ కోర్టు మార్షల్తో కాల్చిచంపడం శాసనమంటావుగదూ!" అని మి. కాల్విన్ అవహేళనాపూర్వకంగా మాట్లాడాడు.

"అవును. కచ్చితంగా అదే" అని ఎర్నెస్టు సమాధానం చెప్పాడు.

"ఇదేమిటి? మేం ఇటువంటి శాసనాన్ని ఇంతకుముందెన్నడూ విన్నదికాదే?" అని మా నాన్న ప్రశ్నించాడు. మా నాన్నకు కూడా ఇది క్రొత్తవిషయమని నేను గ్రహించా.

"రెండు కారణాలవల్ల ఇది మీ కింతకు పూర్వం తెలియదు. మొదటి కారణం, ఆ శాసనాన్ని అమలుపర్చడానికి ఇంతవరకూ అవసరంరాలేదు. అవసరంకలిగి ఉన్నట్లైతే మీ రింతకుముందే దాని ప్రభావం చవిచూచి ఉండే వాళ్లు. రెండో కారణం, ఏ విధమైన చర్చలూ గిర్చలూ లేకుండా ఆ శాసనం రహస్యంగా కాంగ్రెసునుంచి శాసనసభకు వచ్చి హాజరువేసుకొంది. వార్తాపత్రికలు ఈ విషయాన్నిగూర్చి ఏమీ ప్రచురించలేదనుకోండి. కానీ సోషలిస్టులమైన మాకీ విషయం తెలుసు. మేం దీన్ని మా పత్రికల్లో ప్రచురించాం. కానీ మీరు మా పత్రికలెన్నడూ చదివిన పాపాన పోలేదు." అన్నాడు ఎర్నెస్టు.

"మీ రింకా కలలుకంటున్నారనే నేను నొక్కిచెపుతున్నా. దేశం దాన్నెప్పుడూ అంగీకరించి ఉండి ఉండదు!" అని మి. కాల్విన్ గట్టిగా మాట్లాడాడు.

"కానిదేశం దాన్ని అంగీకరించింది." అని ఎర్నెస్టు ప్రత్యుత్తర మిచ్చాడు.

"ఇక నా కల విషయానికివస్తే—" అని ఆయన తన జేబులో చేతులు పెట్టి ఒక చిన్న కరపత్రాన్ని తీసి—"ఇది కలేమో చెప్పండి." అని ప్రశ్నించాడు. ఆయన దాన్ని విప్పి చదవడం ప్రారంభించాడు.

"ఒకటో సెక్షను. 18 సంవత్సరాలకు పైబడి 45 సంవత్సరాలకు లోబడ్డ దృఢకాయుడైన ప్రతి పౌరుడూ తనకు సంబంధించిన రాష్ట్రంలో, భూభాగంలో, కొలంబియా జిల్లాలో తప్పకుండా సైన్యంలో చేరాలి !"

"ఏడవ సెక్షన్. ఏ ఉద్యోగైనా లేక సైన్యంలోచేరిన ఏ వ్యక్తైనా"- మహాశయులారా! ఒకటో సెక్షన్ జ్ఞాపకముంచుకోండి. మీరందరూ సైన్యంలో చేర్చుకోబడ్డవాళ్ళే - సైన్యంలోచేరిన ఏ వ్యక్తైనా, ఇక్కడ నియమించిన విధంగా ఏ ఆఫీసరైనా పిలిచినప్పుడు తాను హాజరుకావడానికి నిరాకరించినా, అలక్ష్యంచేసినా అతడు కోర్టుమార్షల్ విచారణకు గురౌతాడు. కోర్టుమార్షల్ ఏ శిక్ష విధిస్తుందో దాన్ని అతడు అనుభవించాలి."

"ఎనిమిదో సెక్షన్. సైనికోద్యోగులనుగాని, సైనికుల్నిగాని, విచారణచేసే కోర్టుమార్షల్లు, కేవలం సైనికాధికారులతోనే ఉంటయ్."

"తొమ్మిదో సెక్షన్. సంయుక్తరాష్ట్రాల్లో కార్యరంగంలో దూకడానికి సైన్యాన్ని పిలిచినప్పుడు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో సామాన్యమైన సైన్యానికి యుద్ధానికి సంబంధించిన ఏ ఏ సూత్రాలూ, నిబంధల్నూ అనువర్తిస్తయ్యో, అవే వీళ్ళకూ అనువర్తిస్తయ్."

"మహాశయులారా! అమెరికా పౌరులారా! సోదర సైనికులారా! మీరున్న పరిస్థితి అది. తొమ్మిదిసంవత్సరాలక్రితం సోషలిస్టులమైన మేము, ఈ శాసనం కేవలం శ్రామికులకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడిందని తలచాం. కానీ, అది మీకుగూడా వ్యతిరేకంగా ఉద్దేశింపబడినట్లు కన్పడుతోంది. అనుమతించిన కొద్ది చర్చలో కాంగ్రెస్ వ్యక్తియైన విలె, 'జన సామాన్యాన్ని గొంతుపట్టుకోడానికి, సిబ్బందిని రిజర్వుచేయడానికి' అని చెప్పాడు. మహాశయులారా! మీరు జనసామాన్యం— 'ఎన్నికష్టాలున్నాసరే ప్రాణాన్ని, స్వేచ్ఛను, ఆస్తిపాస్తుల్ని రక్షించడానికి నిర్ణయించిన బిల్లు ఇది' అని చెప్పాడు.

ఇక రేపెప్పుడో మీరు మీబలంతో విజృంభించడమంటే, జ్ఞాపకముంచుకోండి, గుత్తాధికారుల ఆస్తిపాస్తులకోసం విజృంభిస్తున్నారు. గుత్తాధికారుల స్వేచ్ఛను అరికట్టడానికి విజృంభిస్తున్నారు. శాసనంప్రకారం మిమ్మల్ని మీరే అణగదొక్కుకోడానికి. మహాశయులారా! మీకోరలు పెరికేసారు. మీ గోళ్ళు ఊడగొట్టారు. పెరికిన కోరల్తో, ఊడిన గోళ్ళతో మీరు మీ బలంతో విజృంభించిననాడు, నత్తగుల్లల సమూహం ఏమాత్రం అపకారం చేయగల్గుతుందో మీరూ అంతే.''

''నేను దాన్ని నమ్మను! అటువంటి శాసనమంటూ లేనేలేదు. అది సోషలిస్టులైన మీరంతా కల్పించిన అభూతకల్పన.'' అని కోవాల్ట్ అరిచాడు.

''ప్రతినిధులసభలో ఈ బిల్లు 1902 జులై 30 వ తేదీన ప్రవేశ పెట్టబడింది. ఈబిల్లును ఒహియో రాష్ట్రప్రతినిధియైన డిక్ ప్రవేశపెట్టాడు. అది అంచలన్ని వెంటవెంటనే దాటింది. 1903 జనవరి 14 వ తేదీన దాన్ని శాసనసభ ఏకగ్రీవంగా అంగీకరించింది. తర్వాత ఒక్క వారంరోజులకే అమెరికా అధ్యక్షుడు దాన్ని ధృవీకరించాడు.''

---

# 6

తాను బట్టబయలుచేసిన రహస్యవిషయాల్తో గాభరాతో అట్టిట్టై పోయిన వాళ్ల మధ్యలో ఎర్నెస్టు మళ్ళీ మాట్లాడడం ప్రారంభించాడు.

''ఇవ్వాళ రాత్రి, మీలొక డజనుమంది, సోషలిజం అసాధ్యమని చెప్పారు. మీరు అసాధ్యాన్ని నొక్కి వక్కాణించారు. తప్పించుకు

పోవడానికి వీల్లేనిదాన్ని స్పష్టీకరిస్తా అనుమతించండి. ఛోటా పెట్టుబడి దారులైన మీరు నామరూపాలులేకుండా పోవడ మొక్కటే తథ్యం కాకుండా, పెద్దపెద్ద పెట్టుబడిదారులూ, గుత్త యజమానులూ ఊరూ పేరూ లేకుండా పోవడంకూడా తథ్యం. జ్ఞాపకముంచుకోండి! పరిణామ ప్రవాహం ఎన్నటికీ తిరోగమనం సాగించదు. అది ఇంకా ముందుముందుకు సాగుతుంది. అది పోటీనుంచి సమైక్యతకూ, చిన్న సమైక్యతనుంచి పెద్ద సమైక్యతకూ, పెద్ద సమైక్యతనుంచి ఇంకా పెద్దసమైక్యతకూ, అక్కణ్ణుంచీ, అన్నిటికన్నా బ్రహ్మాండమైన సమైక్యతకల్గిన సోషలిజానికీ ప్రవహిస్తుంది."

"నేను కలలుగంటున్నానని మీరన్నారు. మంచిది. నేను నాకలను గురించిన లెక్కల్ని చెప్తా. కానీ ముందు మీకో సవాలుచేస్తున్నా. మీకు చేతనైతే నా లెక్కలు తప్పులని నిరూపించండి. పెట్టుబడిదారివర్గ విచ్ఛిన్నత తథ్యమని నేను దానిమీద అభివృద్ధిచేస్తా. అది ఎందుకు తప్పకుండా విచ్ఛిన్నం కావాలో నేను నాలెక్కలద్వారా నిరూపిస్తా. ప్రారంభిస్తున్నా. నేను అసంగతంగా చెపితే హెచ్చరికచేయండి."

"మొట్టమొదట మనం ఒక ప్రత్యేక పారిశ్రామిక విధానాన్ని పరిశీలిద్దాం. నేనెప్పుడైనా మీరేకీభవించని విషయాన్ని చెపితే వెంటనే అడ్డుతగలండి. చెప్పుల ఫ్యాక్టరీ ఒకటుంది. ఈ ఫ్యాక్టరీ చర్మం కొని చెప్పులు తయారుచేస్తుంది. ఇందులో ఒక వందడాలర్ల విలువచేసే చర్మం ఉంది. ఆ చర్మం ఫ్యాక్టరీలోకి పోయి చెప్పులరూపంలో బైటపడుతుంది. ఈ చెప్పులరూపం విలువ రెండువందల డాలర్లు చేస్తుందనుకొందాం. ఏమి జరిగింది ? చర్మం అసలువిలువకు మరోవంద డాలర్లు విలువ వచ్చి చేరింది. అది ఎట్లా వచ్చి చేరింది? గమనిద్దాం."

"శ్రమశక్తీ, పెట్టుబడీ కలిసి అదనంగా ఈ వంద డాలర్లవిలువను చేర్చింది. పెట్టుబడి, ఫ్యాక్టరీని యంత్రాన్ని నెలకొల్పి, ఖర్చులన్నీ భరిం

చింది. శ్రామికులు శ్రమశక్తిని ఉపయోగించారు. పెట్టుబడి, శ్రమ శక్తులయొక్క సమైక్యకృషివల్ల మరో వందడాలర్ల విలువ వచ్చిచేరింది. ఇంత వరకు మీరంతా అంగీకరించారా?"

అక్కడున్నవాళ్ళంతా అంగీకారసూచకంగా తలలూపారు.

"శ్రమశక్తీ, పెట్టుబడీ కలిసి అదనంగా ఈ వంద డాలర్ల విలువను చేర్చినతర్వాత, దాన్ని పంచుకోడానికి తలపడినై. ఈ భాగపంపిణీ లెక్కలు భిన్నాల్లో ఉన్నయ్. అందుకని మన సౌకర్యార్థం ఆ అంకెను ఇంచుమించుగా పూర్ణాంకంగా మార్చుకుందాం. తన భాగంక్రింద, పెట్టుబడి 50 డాలర్లు తీసుకొంటుంది. శ్రమశక్తి, కూలీరూపంలో తనభాగంక్రింద 50 డాలర్లు తీసుకొంటుంది. భాగం విషయంలో ఉన్న చిక్కుల్లోకి మనం పోలేదు. ఎన్ని చిక్కులున్నా ఫరవాలేదు. ఏదో ఒక శాతంలో భాగ పరిష్కారమైంది. ఇక్కడజాగ్రత్తగా గమనించండి. ఈ ప్రత్యేక పారిశ్రామికవిధానం ఎటువంటిదో, తక్కిన పారిశ్రామిక విధానాలు కూడా అటువంటివే. నేను చెప్పింది ఒప్పేనా?"

మళ్ళీ వాళ్లంతా ఎర్నెస్టుతో ఏకీభవించారు.

"శ్రమశక్తి తన 50 డాలర్లు తీసుకొని ఆ చెప్పుల్ని తిరిగి కొనుక్కుందామనుకొన్నదనుకుందాం. అది 50 డాలర్ల విలువగల వస్తువుల్నే తిరిగి కొనుక్కోగలదు. అదిస్పష్టమే. కాదా?"

"ఇప్పుడు మనం ఈ ప్రత్యేకపారిశ్రామిక విధానంనుంచి, చర్మం, ముడిపదార్థాలు, ఎగుమతులు, అమ్మకం మొదలైనవన్నీ కల్గిన సంయుక్త రాష్ట్రాల మొత్తం పారిశ్రామిక విధానానికి వద్దాం. పూర్ణాంకంకోసం మనం అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో ఒక సంవత్సరంలో ఉత్పత్తయ్యే మొత్తంసంపద నాల్గు లక్షలకోట్ల డాలర్లు అనుకొందాం. అప్పుడు శ్రమశక్తి కూలీద్వారా ఆ సంవత్సరకాలంలో తనభాగంక్రింద రెండు లక్షలకోట్లడాలర్లు

తీసుకొంటుంది. అసలు ఉత్పత్తయైన సంపద నాల్గు లక్షలకోట్ల డాలర్లు. దీనిలో శ్రమశక్తి తిరిగి ఎంత కొనగలదు? రెండు లక్షలకోట్లు. దీన్ని గురించే విధమైన వాదంలేదని నమ్ముతున్నా. పెట్టుబడిదారివిధానంలో ఉన్న లక్షోపలక్షల దురాగతాలవల్ల, శ్రమశక్తి మొత్తంలో సగంకూడా తిరిగి కొనుక్కోలేదు."

"మళ్ళీ అసలు విషయానికివద్దాం. శ్రమశక్తి రెండు లక్షలకోట్లు తిరిగి కొనుక్కుంటుందనుకుందాం. దానివల్ల సహేతుకంగా తేలేవిషయ మేమంటే, శ్రమశక్తి రెండు లక్షలకోట్లు మాత్రమే భరాయించగలదన్న మాట. ఇంకా లెక్కతేలాల్సినమొత్తం రెండు లక్షలకోట్లు మిగిలుంది. ఈ మిగతా రెండు లక్షల కోట్లను శ్రమశక్తి, తిరిగి కొనుక్కొని భరాయించే శక్తిలేదు."

"శ్రమశక్తి తనకువచ్చిన రెండు లక్షలకోట్లనుకూడా భరాయించలేదు. దానికాశక్తిఉంటే, దానికి సేవింగ్సుబ్యాంకులో ఏ విధమైన డిపాజిట్లు ఉంచ డానికి వీల్లేదు." అన్నాడు మి. కొవాల్ట్.

"సేవింగ్సు బ్యాంకుల్లో ఉన్న కార్మికుల డిపాజిట్లు రిజర్వుఫండు వంటిది. ఎంత త్వరగాచేస్తారో అంతవేగంతో ఖర్చయ్యే సొమ్మది. ముసలి తనం కోసం, జబ్బుకోసం, ప్రమాదాలకోసం, అంత్యక్రియలకోసం మిగుల్చు కొనే డిపాజిట్లివి. సేవింగ్సుబ్యాంకుల్లో నిలవచేసుకొనే డబ్బు, రేపటి భోజనంకోసం బల్లమీద పెట్టుకొన్న రొట్టెముక్కలాంటిది. మీరు చెప్పి నట్లుకాదు. తన కూలీ కొనదగ్గ మొత్తాన్ని శ్రామికులు భరాయిస్తారు.

"పెట్టుబడికి రెండు లక్షలకోట్లు మిగులుతై. అది దాని ఖర్చులుపోను, మిగిలినదాన్ని భరాయించగలదా? పెట్టుబడి తన భాగంకింద వచ్చిన మొత్తాన్ని భరాయించగలదా?"

ఎర్నెస్టు తన సంభాషణ ఆపి అక్కడున్నవాళ్లను ఖచ్చితంగా ప్రశ్నించాడు. వాళ్లు తలలూపారు.

"నాకు తెలియదు" అని వాళ్ళల్లో ఒకడు ఉన్నదున్నట్లు చెప్పేశాడు.

"కొంచెంసేపు ఆగి ఆలోచించండి మీకే తెలుస్తుంది. పెట్టుబడి తన భాగాన్ని వ్యయంచేయగల్గితే పెట్టుబడి మొత్తం ఎక్కువ కాదు. అదెప్పుడూ ఒకే మొత్తంలో ఉంటుంది. సంయుక్తరాష్ట్రాల ఆర్థికచరిత్ర మీరు పరిశీలిస్తే, పెట్టుబడిమొత్తం నిరంతరం అభివృద్ధిచెందుతోందన్న విషయాన్ని గ్రహిస్తారు. పెట్టుబడి తన భాగాన్ని వ్యయంచేయలేదన్న విషయం దీనివల్ల తేల్తోంది. ఇంగ్లండు మన రైల్వేబాండ్లన్నీ కలిగున్న సమయం మీకుగుర్తుందా? కొన్ని సంవత్సరాల తర్వాత మనం మన బాండ్లను తిరిగి కొనుక్కున్నాం. దాని అర్థమేమిటి? పెట్టుబడి వ్యయంచేయలేని మిగిలిన మొత్తంతో వాటిని కొన్నామన్నమాట. ఈనాడు అమెరికా సంయుక్తరాష్ట్రంలోని పెట్టుబడిదారులు వందల వందల మిలియన్ల విలువచేసే మెక్సికన్ బాండ్లు, రష్యన్ బాండ్లు, ఇటాలియన్ బాండ్లు, గ్రీషియన్ బాండ్లూ కలిగి ఉన్నారంటే అర్థం ఏమిటి? ఆ వందలాది మిలియన్లు, పెట్టుబడి తాను వ్యయంచేయలేని తన భాగానికివచ్చిన ధనమని అర్థం. ఇంకా ఏమిటంటే, పెట్టుబడిదారి విధానం మొట్టమొదటనుంచీ, పెట్టుబడి తన భాగానికివచ్చిన డబ్బును ఎన్నడూ వ్యయంచేయలేదు."

"ఇప్పుడిక విషయానికి వద్దాం. ఒక సంవత్సరంలో సంయుక్తరాష్ట్రాల్లో 4 లక్షలకోట్ల డాలర్లు ఉత్పత్తవుతున్నది. శ్రామికులు, 2 లక్షల తిరిగి కొనుక్కొని ఖర్చుపెడ్తున్నారు. పెట్టుబడి మిగతా రెండు లక్షల కోట్లు ఖర్చుపెట్టలేదు. ఖర్చుకాకుండా మిగిలిన ధనం చాలా ఉంది. ఈ మిగుల్తో ఏంచేయాలి? శ్రామికులు ఆ మిగిలినదాంట్లో ఏ మాత్రం భరాయించలేరు. ఎందుకంటే, శ్రామికులు తమ డబ్బంతా యిదివరకే ఖర్చుపెట్టేసారు. పెట్టుబడి ఈ మిగతాను భరించలేదు. ఎందుకంటే, దాని స్వభా

వాన్ననుసరించి అది భరాయించ గల్గిందంతా ఇదివరకే భరించింది ఇంకా బోలెడు మిగులుఉంది, దానితో ఏమి చేయగలం? దాన్ని ఏమిచేయాలి?"

"దాన్ని విదేశాల్లో అమ్మేస్తారు." అని మి. కోవాల్టు అందించాడు.

"కచ్చితంగా అదే జరుగుతుంది." అని ఎర్నెస్టు అంగీకరించి, "ఈ మిగులువల్ల మనకు విదేశపు మార్కెట్టు కావాల్సిన అవసరం కలుగుతోంది. దీన్ని విదేశాల్లో అమ్మేస్తారు. దీన్ని విదేశాల్లోనే అమ్మాలి. దాని పీడ వదిలించుకోనే మార్గం మరొకటేమీలేదు. ఖర్చుగాకుండా అత్యధికంగా మిగిలిన ఆ మొత్తం, విదేశాల్లో అమ్మకమై, మనం ప్రేమతో పిలిచే, 'వాణిజ్య సమానత' గా మారుతుంది.. ఇంతవరకు మీరందరూ అంగీకరించి నట్లేగా?" అన్నాడు.

"ఈ వాణిజ్యానికి సంబంధించిన ఓ, న, మాలు విపులీకరించడం వృథా కాలక్షేపం. మాకివి తెలుసు." అని మి. కాల్విన్ ఘాటుగా మాట్లాడాడు.

"ఈ ఓ, న, మాల ద్వారానే ఈవిషయాన్ని జాగ్రత్తగా మీకు విపులీకరించి, మిమ్మల్ని అంగీకరింపచేస్తున్నా. అందులోనే ఉంది గొప్ప దనం. మరి వీటితోటే ఇప్పటికిప్పుడు మిమ్మల్ని అంగీకరింపచేయబోతున్నా. ఇదీవిషయం." అని ఎర్నెస్టు తిరుగుసమాధానం చెప్పాడు.

"తన విధానాలను అభివృద్ధిచేసుకొన్న పెట్టుబడిదారిదేశం అమెరికా సంయుక్తరాష్ట్రం. పెట్టుబడిదారి మార్గాన్ననుసరించిన దాని పారిశ్రామిక విధానంవల్ల దానికి ఖర్చుగాని మిగులు ఉంది. దాన్ని ఎట్లాగో అట్లాగా వదిలించుకోవాలి. అదిన్నీ దూరదేశాల్లో వదిలించుకోవాలి. అమెరికా పరిస్థితి ఎట్లాంటిదో, అట్లాగే అన్నివిధానాలూ అభివృద్ధిచేస్తున్న పెట్టుబడిదారి దేశాల సంగతికూడా. అటువంటి ప్రతిదేశంలోను ఖర్చుగాని మిగుళ్ళు ఉన్నయ్. ఈదేశాలు ఇంతకుముందే పరస్పరం వ్యాపారం చేసుకొన్న

సంగతీ, ఐనా ఇంకా మిగుళ్ళు ఉన్న సంగతీ మరచిపోవాకండి. ఇన్ని దేశాల్లోనూ శ్రామికులు తమభాగానికి వచ్చిన కూలీఅంతా ఖర్చుపెట్టేసినందున ఆ మిగుళ్ళను ఏమాత్రం కొనే తాహతులో లేరు. ఇన్నిదేశాల్లోనూ పెట్టుబడి తన సహజ స్వభావాన్ననుసరించి, తనకు వీలైనంతగా భరాయించింది. ఐనప్పటికీ ఇంకా మిగుళ్ళు ఉండిపోయినై. వాళ్లు వీటిపీడ ఎట్లా వదిలించుకోబోతున్నారు ? "

" అభివృద్ధిచెందని విధానాలుగల దేశాలకు అమ్మేస్తే సరి. " అని. మి. కొవాల్టు సూచించాడు.

" సరిగ్గా అదే. మీమనస్సులో మీరే నాకు సూచనచేసేటంత స్పష్టంగా సరళంగా నావాదన ఉందన్న సంగతి గ్రహించారుకదూ. ఇక ఇప్పుడు రెండోవిషయానికి వద్దాం. అమెరికా తన మిగులును బ్రెజిల్ వంటి బాగా అభివృద్ధిచెందని దేశాల్లో విడుదలచేసిందనుకొందాం. వ్యాపార సామగ్రి భరాయించగల దానికన్నా ఈ మిగులు వ్యాపారాతీతమైందన్నది గుర్తుంచుకోండి. అటువంటప్పుడు అమెరికా బ్రెజిల్‌నుంచి ప్రత్యామ్నాయంగా ఏం తీసుకొంటుంది ? "

" బంగారం, " అన్నాడు మి. కొవాల్టు.

" కానీ ప్రపంచంలో బంగారం కొంతమాత్రమే ఉందిగాని అంతకు మించిలేదు. " అని ఎర్నెస్టు అభ్యంతరాన్ని వెలిబుచ్చాడు.

" సెక్యూరిటీల రూపంలో, బాండురూపంలో ఇంకా తగినతరమైన రూపాల్లో ఉన్న బంగారం " అని మి. కొవాల్టు సవరణతెచ్చాడు.

" ఇప్పుడు మీరు అసలువిషయాన్ని చెప్పారు. అమెరికా తన మిగులుకు ప్రత్యామ్నాయంగా బ్రెజిల్‌నుంచి బాండ్లు, సెక్యూరిటీలు స్వీకరిస్తుంది. దాని అర్థం ఏమిటి ? అంటే అమెరికా బ్రెజిల్ రైలు

రోడ్లనూ, యంత్రాగారాల్ని, గనుల్ని, భూముల్ని గుత్తచేసుకొంటుందన్న మాట. అంటే మళ్ళీ దీని అర్థ ఏమన్నమాట? ''

మి. కోవాల్టు దీర్ఘాలోచన్లోపడి, తలూపాడు.

''నేనుచెప్తా. అంటే బ్రెజిల్ యొక్క విధానాల్ని అభివృద్ధిచేయడమన్న మాట. ఇక తర్వాత విషయంచూద్దాం. పెట్టుబడిదారి విధానం ద్వారా ఎప్పుడైతే బ్రెజిల్ అభివృద్ధి చెందుతుందో, అప్పుడు దానికే ఖర్చుగాకుండా ఉన్న మిగులు ఉంటుంది. అది ఈ మిగుల్ని అమెరికాలో వదిలించుకోగలదా? వదిలించుకోలేదు. ఎందుకంటే అమెరికాలోనే మిగుళ్లు తలమునిగే తాటి ప్రమాణంలో ఉన్నయ్. పోనీ, అమెరికా పూర్వంమాదిరిగానే ఇప్పుడు తన మిగుల్ని బ్రెజిల్లో చెలామణి చేసుకోగల్గుతుందా? లేదు. ఎందుకంటే ఇప్పుడు బ్రెజిల్ కూ మిగుళ్ళు ఉన్నయ్.''

''ఏం జరుగుతుంది? అమెరికా, బ్రెజిల్ కలిసి తమ (Surplus) అత్యధిక శేషాల్ని వాటినెత్తిమీదవేసి రుద్దటానికి మరో వెనకబడ్డ దేశాలకోసం వెతుక్కోవాలి. కానీ అత్యధిక శేషాల్ని వదిలించుకొనే విధానంద్వారా వెనకబడ్డ ఆ దేశాలు మళ్ళీ అభివృద్ధిచెందుతై. వెంటనే వాటికీ అత్యధిక శేషాలు తయారౌతై. అవ్వీ ఈ భారాన్ని ఎవరినెత్తినేసి రుద్దుదామా అని ఇతరదేశాలకోసం వెదుకుతై. మహాశయులారా! ఇక నే జెప్పేదాన్ని బాగా ఆలకించండి. భూగోళం కొంత విస్తీర్ణతమాత్రమే కలిగిఉంది. ప్రపంచంలో కొన్నిదేశాలుమాత్రమే ఉన్నయ్. ప్రపంచంలో ఉన్న చిట్టచివరి చిన్న దేశాలవరకూ అత్యధిక శేషంకల్గిన ప్రతిదేశం, అత్యధికశేషాలుకల్గిన తక్కిన దేశాల్తో ముఖా ముఖిగా నిలబడ్డప్పుడు ఏం జరుగుతుంది? ''

ఆయన ఆగి, శ్రోతల్ని పరకాయించి చూచాడు. వాళ్ళ మొగాల్లో స్పష్టంగా ఆందోళన కనపడుతోంది. అంతేకాదు, వాళ్లల్లో భయం ఆవేశించింది. భావనాత్మకమైనవాటిలోనుంచి దృశ్యాన్నిఏర్పరచి ఎర్నెస్టు

వాళ్ళకళ్ళకు కట్టేటట్లు చేసాడు. వాళ్ళక్కడ కూర్చొని ఆ దృశ్యాన్ని దర్శించారు. ఆ దృశ్యసాక్షాత్కారంతో వాళ్లకు వణకుపుట్టింది.

"మి. కాల్విన్ ! మనం ఓనమాలతో ప్రారంభించాం" అని ఎర్నెస్టు నర్మగర్భితంగా మాట్లాడి, "నేను మీ కిప్పుడు తక్కిన అక్షరమాలను అందించాను. అది చాలా సులభం. దానిలో ఉన్న అందం అదే. మీరు సమాధానం చెప్పబోతున్నారు. ప్రపంచంలో ఉన్న ప్రతిదేశం భరాయించలేని అత్యధిక శేషాల్తో ఉంటే అప్పుడేమిటి? అప్పుడు మీ పెట్టుబడిదారీ విధానం ఎక్కడుంటుంది?"

కానీ మి. కాల్విన్ ఆందోళనతో తన బుర్ర ఊపాడు. ఎర్నెస్టు హేతువాదంలో తప్పు వెదకడంకోసం తాపత్రయపడుతున్నా డతడు.

"మళ్ళీ క్లుప్తంగా మొదట్లో మనం తీసుకున్న ఆధారానికి వస్తా. మనం ఒక ప్రత్యేకమైన పారిశ్రామిక విధానంతో ప్రారంభించాం. అది చెప్పుల ఫ్యాక్టరి. సమష్టి ఉత్పత్తిలో, ఈ ఫ్యాక్టరీలో భాగపంపిణీ ఏవిధంగా జరిగిందో, మొత్తం పారిశ్రామిక విధానంలోనూ అట్లా జరుగుతుం దని మనం గ్రహించాం. శ్రామికులు తమకు వచ్చిన కూలీతో ఉత్పత్తిలో కొంతభాగమే తిరిగి కొనుక్కోగలరనీ, ఉత్పత్తి శేషాన్నంతా పెట్టుబడి భరాయించలేదనీ తెలుసుకున్నాం. శ్రామికులు తమకువచ్చిన కూలీనంతా వినియోగించి తాము భరాయించకలిగినంతా భరాయించారనీ, పెట్టుబడి తాను భరాయించకలిగినదంతా భరాయించినప్పటికీ ఇంకా భరాయించలేని అత్యధిక శేషాలు ఉన్నయ్యనీ అర్థంచేసుకొన్నాం. ఈ అత్యధిక శేషం విదేశాల్లో విడుదల చేయాలన్నది అంగీకరించాం. ఈ అత్యధిక శేషాన్ని మరోదేశంలో విడుదలచేయడమంటే ఆదేశాన్ని సౌకర్యాల్తో అభివృద్ధి చేయడమనీ, కొద్ది కాలంలో ఆదేశంకూడా తాను భరాయించలేని అత్యధిక శేషంలో తల మున్కలై పోతుందనీకూడా వప్పుకున్నాం. మనం ఈ విధానాన్ని

భూగోళంలోని అన్నిదేశాలకూ అనువర్తింపజేసాం. ప్రతిదేశం, ప్రతి సంవత్సరం, ప్రతిదినం తాను భరాయించలేని అత్యధికశేషాన్ని ఉత్పత్తిచేసి, దాన్ని మరే ఇతరదేశంలో విడుదల చేయలేదని గ్రహించాం. ఇప్పుడు మళ్ళీ మిమ్మల్నొక ప్రశ్న వేస్తున్నా. ఈ అత్యధికశేషాల్ని మనం ఏమి చేయబోతున్నాం?

ఇప్పటికీ ఒక్కడూ సమాధానం చెప్పలేదు.

"ఏమయ్యా! మి. కాల్విన్?" అని ప్రశ్నించాడు ఎర్నెస్టు.

"ఇది నా గుండెలకుంపటయింది." అని మి. కాల్విన్ అంగీకరించాడు.

"నే నిటువంటిదాన్ని ఎప్పుడూ కలలోగూడా ఊహించలేదు. ఐనప్పటికీ అచ్చు గుద్దినట్లుగా సుస్పష్టంగా కనపడుతోంది." అన్నాడు మిస్టర్ అస్మస్ సెన్.

కారల్ మార్క్సు అత్యధికశేష సిద్ధాంతాన్ని ఇంత స్పష్టంగా విశదీకరించడం వినడం నాకిదే ప్రథమ పర్యాయం. నేను గూడా ఆశ్చర్యచకితురాలనయ్యేటట్లుగా సరళంగా ఎర్నెస్టు దాన్ని విపులీకరించాడు.

"ఈ అత్యధికశేషాల పీడవదిలించుకోడానికి నే నొకమార్గం చూపిస్తా. దాన్నంతా సముద్రంలో కుమ్మరించండి. ప్రతి సంవత్సరం వందల కోట్లు డాలర్ల విలువచేసే చెప్పుల్ని, గోధుమల్ని, గుడ్డని, వాణిజ్యానికి సంబంధించిన సామాగ్రి మొత్తాన్ని విశాల సముద్రంలో పోయండి. ఏం? దాని మాయరోగం టక్కున కుదిరినట్లేనా?"

"పరిష్కారమార్గం బాగానే సరిపోయింది. కానీ, మీరిట్లా మాట్లాడడం చాలా అసంగతం." అని మి. కాల్విన్ సమాధానం చెప్పాడు.

ఎర్నెస్టు ఆయనమీద మెరపు మెరసినట్లు విరుచుకపడ్డాడు. "యంత్రవిధ్వంసకులైన మీరు మీ ప్రాచీనుల అనాగరిక పంథాను అనుసరించాలని డప్పుకట్టుకొని ప్రచారంచేసేదానికన్నా ఇది అసంగతంగా ఉందా? ఈ

అత్యధికశేషాల్ని విడుదలచేయడానికి మీరు చెప్పే మార్గమేమిటి? ఇంకా ఏ విధమైన అత్యధికశేషాల్ని ఉత్పత్తిచేయకుండా ఈ అత్యధిక శేషసమస్యను దాటేసుకుపోతున్నారు. కానీ అసలు అధికశేషాలు ఉత్పత్తికాకుండా నివారించడానికి మీరు చెప్పేదేమిటి? ఆలోచనా పాలోచనాలేని, చిందర వందరైన, అడ్డదిడ్డమైన, ఖుష్కుదండుగైన, అధికవ్యయమైన ఆదిమ మానవ పద్ధతికి తిరోగమించడంద్వారా, అత్యధికశేషాన్ని ఉత్పత్తిచేయడం అసాధ్య మనేగా మీరనేది!''

మి. కాల్విన్ గుక్కిళ్లు మింగాడు. విషయం శంకరగిరి మాన్యాలు పట్టింది. అతడు మళ్ళీ ఒక గుటక వేసి గొంతు సవరించుకొన్నాడు.

''మీరు చెప్పింది సర్వదా సత్యం. నేను దోషినని అంగీకరిస్తున్నా. అది అర్థం పర్థం లేనిదే. కాని మనమేదో ఒకటి చేయాలి. మధ్యతరగతికి సంబంధించిన మాబోటివాళ్లకిది జీవన్మరణ సమస్య. మేం నాశనం కావడానికి అంగీకరించం. మేం అసంగతులమునైనా అనిపించుకొంటాం. నిజంగా అనాగరికమైన, కేవల నిరర్థకమైన మా ప్రాచీనుల పద్ధతినే ఎన్నుకొంటాం. మేం పరిశ్రమల్ని గుత్తయజమానులులేని పూర్వదశకు తీసుకువెళ్లుతాం. మేం యంత్రాల్ని విధ్వంసం చేస్తాం. మరి దానికి మీరేం చేయబోతున్నారు!" అన్నాడు.

"కానీ మీరు యంత్రాల్ని విచ్ఛిన్నంచేయలేరు. మీరు పరిణామ ప్రవాహాన్ని వెనక్కి మరలించలేరు. మీరు ప్రతిపక్షంగా రెండు శక్తులున్నయ్. అందులో ప్రతిఒక్కటీ మీ మధ్యతరగతికన్నా అధిక శక్తిమంతమైంది. పెద్ద పెట్టుబడిదారులు అంటే, గుత్తయజమానులు మిమ్మల్ని వెనకను గేయనీయరు. వాళ్ళు యంత్రాలు విధ్వంసం కావాలనికోరరు. గుత్తయజమానులకన్నా అధికసంఖ్యాకులూ, అధికశక్తిమంతులూ ఐన కార్మికులున్నారు. కార్మికులు మిమ్మల్ని యంత్ర విధ్వంసం చేయనీయరు. యంత్రాల్తో సహా

ప్రపంచాధిపత్యం గుత్తయజమానుల, కార్మికులమధ్యఉంది. రాబోయే యుద్ధం అదే. ఏ ఒక్కపక్షమూ యంత్ర విధ్వంసన కోరదు. కానీ ప్రతిపక్షమూ యంత్రాల్ని స్వాధీనం చేసుకోవాలని కోరుకుంటుంది. ఈ యుద్ధంలో మధ్యతరగతికి స్థానంలేదు. ఈ రెండు మహోన్నత స్వరూపాల మధ్య, మధ్యతరగతి వామనస్వరూపం. నాశనమౌతున్న ఓ మధ్యతరగతి పిచ్చి అన్నయ్యలారా! మీరు తిరుగలిరాళ్లమధ్య ఇరుక్కుపోయారనీ, ఇప్పటి నుంచే దాని విసురు ప్రారంభమైందన్నదీ చూడడంలేదూ!"

"పెట్టుబడి విధానం యొక్క అవశ్యపతనాన్ని నేను మీకు లెక్కల ద్వారా ప్రదర్శించాను. ప్రతిదేశం తాను భరాయించలేని, అమ్ముడు పోని శేషాల్తో ఉన్నప్పుడు, పెట్టుబడిదారి విధానం తనంతటతానే ఏర్పచ్చుకొన్న లాభాల భయంకర నిర్మాణంద్వారా నిలువునా కూలిపోతుంది. ఇంక ఆనాడు యంత్ర విధ్వంసకమంటూ ఏమీ ఉండదు. ఇక అప్పుడు యంత్రాధిపత్యంకోసం పోరాటం బైలుదేరుతుంది. కార్మికులు జయించారో మీ మార్గం సుగమమౌతుంది. అవిడయాసికివస్తే, అమెరికా, మొత్తం ప్రపంచం ఒక మహత్తరమైన నవ్యయుగంలోకి ప్రవేశిస్తుంది. యంత్రాలవల్ల తొక్కివేయ బడడానికి బదులుగా, ఆ కార్మికులవల్ల జీవితం నిష్కళంకంగా, సౌఖ్య వంతంగా, ఉదాత్తంగా మార్పు చెందుతుంది. నాశనమైపోయిన మీ మధ్యతరగతి, కార్మికులతో విలీనమౌతారు. ఇక అప్పుడు కార్మికవర్గం తప్ప మరేమీ ఉండదు. కాబట్టి, మీరూ మిగిలిన కార్మికవర్గమూ, ఆ అద్భుత యంత్రాలవల్ల ఉత్పత్తి జరిగేదాన్ని సరిసమానంగా పంచుకోవడంలో పాల్గొంటారు. అప్పుడు మనమంతా కలిసి ఇంకా అత్యద్భుతాలైన క్రొత్త యంత్రాల్ని సృష్టిస్తాం. ఆనాడు లాభాలంటూ ఏమీ ఉండకపోవడంవల్ల, ఇక భరాయించలేని అధిక శేషమంటూ ఉండనే ఉండదు."

"కానీ, ఉత్తయజమానులే ఈ యుద్ధంలో విజయంసాధించి, యంత్రాల మీదా, ప్రపంచంమీదా ఆధిపత్యం పొందుతారనుకోండి?" అని మి. కోవాల్టు ప్రశ్నించాడు.

"అప్పుడు, మీరూ, శ్రామికులూ, మనమంతా; మానవ చరిత్ర పుటల్ని మలినంచేసిన నిరంకుశ ప్రభుత్వంమాదిరిగా; అతిభయంకరమూ, క్రూరమూ ఐన నిరంకుశ ప్రభుత్వపు ఉక్కుపాదంకింద ఒక్క పెట్టున అణగారిపోతాం. ఉక్కుపాదమన్నది ఆ క్రూర నిరంకుశ ప్రభుత్వానికి అన్నందాలా తగిన మంచి పేరు."

చాలాసేపు మాట్లాడలేదు. అక్కడున్నవాళ్ళందరూ అలవాటు లేని ధ్యాన సమాధిలోపడి గంభీరంగా కూర్చున్నారు.

"కానీ, ఈ నీ సోషలిజం కేవలం స్వప్నం. అదె వట్టికల." అని మి. కాల్విన్ మళ్ళీ మళ్ళీ అన్నాడు.

"అది కలకాదని మీకో విషయం చూపిస్తా. నేను దాన్ని అల్ప సంఖ్యాక రాజ్యాధిపత్యం అని పిలుస్తా. మీరు దాన్నే ధనికతత్వం అంటారు. మనంమాట్లాడే మాటలు భేదం గాని, ఇద్దరి అర్థమొకటే. వాళ్ళు పెద్ద పెట్టుబడిదారులు లేకపోతే గుత్తయజమానులు. ఈనాడు అధికారం ఎక్కడుందో చూద్దాం. అందుగ్గాను, సంఘాన్ని దాని వర్గాలుగా విభజిద్దాం."

"సమాజంలో మూడు పెద్దవర్గాలున్నయ్. కోటీశ్వరులైన బ్యాంకర్లూ, రైల్వే గుత్తాధికార్లూ, కార్పొరేషను డైరెక్టర్లు, గుత్తయజమానులూ కలిగిన ధనికతత్వం మొదటివర్గం క్రిందికివస్తుంది. రైతులూ, వ్యాపారస్తులు, కొద్ది ఉత్పత్తిదారులూ, ఉద్యోగస్తులూఉన్న మీ మధ్యతరగతి ప్రజలు రెండోవర్గం క్రిందికి వస్తారు. కేవలం కార్మికుల్తో కూడుకొన్న మా ప్రొలిటేరియన్ వర్గం చిట్టచివరి మూడోవర్గంగా వస్తుంది."

"ఈనాడు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ధనికులే తగినంత అధికారంలో ఉన్నారని అంగీకరించక తప్పదు. ఈ మూడు వర్గాలూ ఈ సంపదనెట్లా కలిగి ఉన్నయ్? ఇదిగో అంకెలున్నయ్! ధనికవర్గం 67 లక్షల కోట్ల ధనం కలిగిఉంది. అమెరికాలో ఉద్యోగాల్లో ఉన్న మొత్తం జనసంఖ్యలో, ధనికవర్గంనుంచి నూటికి $\frac{9}{10}$ వ వంతుమాత్రమే ఉన్నారు. (పర్యంతంలో పరమాణువన్నమాట.) ఐనప్పటికీ ధనికవర్గం, మొత్తం సంపదలో నూటికి డెబ్బైపాళ్ళు కలిగిఉంది. మధ్యతరగతికి 24 లక్షలకోట్ల ధనముంది. వీళ్ళలో నూటికి 29 మంది ఉద్యోగాల్లో ఉన్నారు. వాళ్ళకు మొత్తం ధనంలో నూటికి ఇరవైఐదు వంతులుంది. మిగతావాళ్ళు ప్రొలిటేరియన్లు. దానికున్న సంపద 4 లక్షలకోట్లు. ప్రొలిటేరియన్లనుంచి వచ్చినవాళ్ళు అన్ని ఉద్యోగాల్లో నూటికి డెబ్బైమంది ఉన్నారు. మరి ప్రొలిటేరియన్లకున్న సంపద మొత్తంసంపదలో నూటికి నాల్గుపాళ్ళు. బలం ఎందులో ఉంది మహాశయులారా?"

"మీరిచ్చిన అంకెలద్వారానే, మధ్యతరగతికి సంబంధించిన మేమే శ్రామికులకన్నా ఎక్కువ బలవంతులం." అని మి. అస్మన్‌సెన్ మాట్లాడాడు.

"మమ్మల్ని బలహీనులన్నందువల్ల, ధనికుల బలంముందు మీరేమీ ఘనులుకారు." అని ఎర్నెస్టు ఎదురుచెప్పి, "మనోవిషయం మేమంటే, మీకు నేనింకా చెప్పాల్సింది అప్పుడే కాలేదు. సంపదకన్నా మించిన మరోబలం ఉంది. అది ఎందుకు గొప్పదంటే, దాన్నెవరూ తీసుకుపోలేరు కాబట్టి. మాబలం-అంటే మా ప్రొలిటేరియన్ల బలం మాకండరాల్లో ఉంది. బ్యాలెట్లు వేయడానికి మాచేతుల్లో ఉంది-తుపాకి ట్రిగ్గరు నొక్కడానికి మావ్రేళ్ళల్లో ఉంది. ఈ బలాన్ని మరెవ్వరూ అపహరించలేరు. ఇది

మా మౌలిక బలం. ఇది జీవితామృతమైన బలం. ధనంకన్నా బలవత్తరమైన బలం ఇది. ఈ బలాన్ని ధనం అపహరించలేదు.''

"కానీ విడదీయకల్గిన బలంమీది. దాన్ని మీనుంచి కాజేయవచ్చు. ఇప్పుడు ధనికవర్గం దాన్ని మీదగ్గర్నుంచి లాక్కొంటోంది. చివరికి మీ వద్దనుంచి మొత్తం గుంజుకొంటుంది. అప్పుడు మీరు మధ్య తరగతిగా చెలామణి కారు. మీరు మావర్గంలో చేరుతారు. మీరు ప్రొలిటేరియన్లౌ తారు. అప్పుడున్న తమాషా ఏమిటంటే, మాబలానికి మీబలం అదనంగా వచ్చి కలుస్తుంది. మేం మిమ్మల్ని మా సోదరులుగా గౌరవిస్తాం. మానవత్వంకోసం మనం బుజంబుజం కలిపి పోరాడ్తాం.''

"కార్మికులకు నాశనమయ్యే స్థిరాస్తి గడ్డిపోచకూడా లేదు. ఈ కార్మికవర్గానికి ఉన్నధనంఅంతా గుడ్డలూ, ఇంటిసామగ్రి రూపంలో అక్కడా ఇక్కడాఉంది. తాకట్టూ వాకట్టూలేని కొంపాగోడీ నూటికి కోటికి ఏ ఒకటో అరో ఉంది. కానీ, మీకు 24 లక్షల కోట్లధనం నగదుగా ఉంది. ధనికులు దాన్ని కాస్తా మీనుంచి గుటకాయస్వాహా చేస్తారు. మొదటగా ప్రొలిటేరియన్లే దాన్ని మీదగ్గర్నుంచి లాక్కొనే అవకాశం ఉందనుకోండి. మహాశయులారా ! ఇప్పుడు మీస్థితి మీకర్థమైందిగదా ? సింహం పెద్దపులిమధ్యా ఊగులాడే గొర్రెపిల్ల మోస్తరుగా ఉంది మధ్య తరగతి. ఒకళ్ళుకాకపోతే ఒకళ్ళయినా మీపని తేల్చేస్తారు. ధనికులే మొదటిగా మిమల్ని కాజేస్తే, ధనికుల్ని ప్రొలిటేరియన్ల కాజేయడం రోజుల్లోనే జరుగుతుంది. ''

"ప్రస్తుతం మీకున్న సంపదకూడా మీబలానికి నిజమైన పరిమాణం కాదు. ఈ క్షణంలో మీకున్న ధనబలం కేవలం గుర్రిడ్డిగవ్వలాంటిది. అందుకనే మీరంతా 'మా ప్రాచీనుల మార్గానికి తిరోగమిస్తాం' అని చిన్న యుద్ధానికి సంబంధించిన చచ్చుఅరుపులు అరుస్తున్నారు. మీ అసమర్థతేపో

మీకే తెలుసు. మీబలం గుడ్డిగవ్వలాంటిదని కూడా మీకు తెలుసు. మరిప్పుడు నేను ఆ లోటారాన్ని చూపిస్తా."

"రైతులకున్న అధికారం ఏమిటి? నూటికి డెభైమందికి పైగా పాలికాపులుగానో, తాకట్టుపడ్డ వాళ్ళగానో ఉన్నారన్న విషయం యధార్థాన్ని పరికిస్తే తేలుతుంది. గుత్తయజమానులు, ధాన్యాన్ని నిలవచేసే మచ్చులు, రైలురోడ్లు, బరువుసామాన్లు ఎత్తేసాధనాలూ, పడవల మొదలైనవి కల్గిఉండటం మూలకాన పంటలు మార్కెట్టును స్వాధీనంలో ఉంచుకొన్నందున, రైతులందరూ బానిసలన్న విషయం తేలుతుంది. ఇంకా ఏమిటంటే, మొత్తం మార్కెట్టును గుత్తయజమానులు తమచేతుల్లో ఉంచుకొన్నారు. ఈ అన్ని విషయాల్లోనూ రైతులు శక్తిహీనులైపోయారు. ఇక రైతుల రాజకీయ, ప్రభుత్వాధికారాల సంగతిమటుకు, తక్కిన మధ్యతరగతి ప్రజల రాజకీయ ప్రభుత్వాధికారాల విషయం చెప్పేటప్పుడు చెప్తా."

"మి. కాల్విన్‌నూ తక్కిన పాలసరఫరా యజమాన్లనూ పిండేసినట్లుగానే రోజురోజుకూ గుత్తయజమానులు రైతుల్ని పిండేస్తున్నారు. రోజురోజుకూ వ్యాపారస్థులుకూడా ఇట్లాగే పీల్చి పిప్పి చేయబడుతున్నారు. ఆరునెల్లల్లో ఒక్క న్యూయార్కు పట్టణంలోనే నాల్గువందల చుట్టల ఫ్యాక్టరీలను, పొగాకు గుత్తయజమానులు ఎట్లా పీల్చి పిప్పిచేసారో మీకు గుర్తుందా? బొగ్గుగనుల పూర్వపు యజమాన్లు ఈరోజేమైపోయారు? ఈనాడు రైలురోడ్డు గుత్తసంస్థ మొత్తం, గట్టిబొగ్గుగనులనూ, నూనెగనులనూ గుత్తచేసుకుందన్న సంగతి నేను చెప్పకుండానే మీకు తెలుసు. స్టాండర్డ్ఆయిల్ గుత్తసంస్థ ఇరవై సముద్ర మార్గాలమీద యాజమాన్యం కలిగుండ లేదా? అది రాగిని మొత్తం గుత్తంచేసుకో లేదా? దానికితోడు ఖనిజపదార్థాల్ని బాగుచేసి సరఫరాచేసే వ్యాపారం విషయం అసలు చెప్పనవసరమే లేదనుకోండి. స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ అజమాయిషీ క్రిందగాని, యాజ

మాన్యం క్రిందగాని లైట్లు వెలిగింపబడే పట్టణాలు ఈనాడు అమెరికాలో వెయ్యి పైచిలుకుగా ఉన్నయ్. ఇంకా చాలా పట్టణాల్లో, దేశంలో మూల మూలలా విద్యుచ్ఛక్తి సరఫరా చేసేది అదే. వేలకొలదిగా ఉన్న చిన్న పెట్టుబడిదారులంతా ఈ కంపెనీ ముందు పురుగునాకిపోయారు. మీ కావిషయం తెలుసు. మీరు నాశనమై పోతున్నదిగూడా అదేవిధం."

"కొద్ది ఉత్పత్తిదారుడు, రైతువంటివాడు. మరి ఈనాడు కొద్ది ఉత్పత్తిదారులూ, రైతులూ అన్నివిధాలా, ఫ్యూడల్ పరిస్థితికి దిగజారి పోతున్నారు. ఆమాటకువస్తే, ప్రస్తుతం ఉద్యోగస్తులూ, కళాకారులూ నామమాత్రావశిష్టులై ఉన్నారు. రాజకీయవాదులు కేవలం కూలివాళ్ళ మోస్తరైనారు. తక్కిన మధ్యతరగతి రైతుల్నికలిపి రాత్రింబవళ్ళు క్రొత్త రాజకీయపార్టీలు ఎందుకు నిర్మించడానికి కష్టపడుతున్నావ్ ? మి. కాల్విన్ ! ఎందుకంటే, పాత రాజకీయపార్టీలకు మీ గుహానివాసి తత్త్వంతో ఏలాంటి సంబంధంలేదు. వాళ్ళకు మీ అనాగరిక భావాల్తో ఎందుకు సంబంధం లేదంటే, నేను చెప్పినట్లుగా వాళ్లంతా ధనికతత్వాన్ని అట్టే పెట్టడానికి ప్రయత్నించే పరిచారకులు."

"ఉద్యోగస్తులూ, కళాకారులూ కీలుబొమ్మలని నేను చెప్పా. అంతకన్నా వాళ్ళేమిటి ? ప్రొఫెసర్లూ, మతబోధకులూ, పత్రికా సంపాదకులూ, ఒకరేమిటి అందరూ ధనికతత్వాన్ని సేవిస్తూ తమవృత్తుల్ని కాపాడుకొంటున్నారు. ధనికతత్వానికి ప్రమాదకరం గాకుండా, దానికి బలం చేకూర్చేటట్లుగా వాళ్లు ప్రచారంచేస్తూ సేవిస్తున్నారు. ధనికతత్వానికి ప్రమాదం కలిగించేటట్లుగా వాళ్ళేనాడైనా ప్రచారం సాగించారో, ఆనాటితో వాళ్ళ ఉద్యోగాలు ఊడి చక్కా కూర్చుంటయ్. వర్షం కురిసినరోజున వాళ్లకు కానీడబ్బు రాకుండా ఉన్నదో ఆనాడు బైటపడ్డ చేపల్లాగా గిజగిజ తన్నుకొని ప్రొలిటేరియన్ల స్థితికి దిగజారిపోతారు, అంతటితో పూర్తిగా

దెబ్బతినడమో లేకపోతే శ్రామికవర్గఆందోళనకారకులుగా తయారు కావడమో జరుగుతుంది. పత్రికలూ, ఉపన్యాసవేదికలూ, విశ్వవిద్యాలయాలూ ప్రజాసామాన్య భావాల్ని మరిచిపోవన్నది మరచిపోవాకండి! అవ్వే జాతి ఆలోచనను నిర్ణయించేవి. ఇక కళాకారుల విషయం తీసుకుంటే, వాళ్ళు ధనికవర్గ అభిరుచుల కనుగుణంగా రచనలు చేసే పారతంత్ర్యులు."

"కానీ, ధనమే సరియైన బలం కాదనుకోండి! బలానికి అది కేవలం సాధనమే. బలం అంటే ప్రభుత్వం. ఈనాడు ప్రభుత్వాన్ని అజమాయిషీ చేసేదెవరు? వివిధ ఉద్యోగాలు చేస్తున్న 2 కోట్లు ప్రొలిటేరియన్లా? ఈ భావనకు మీరంతా నవ్వుతారుకూడా. 80 లక్షలమంది ఉద్యోగాలుచేస్తున్న మధ్యతరగతి ప్రజలా? కాదు. ప్రొలిటేరియన్లెంత చేస్తున్నారో వాళ్ళు అంతే. ఇక మరి ప్రభుత్వాన్ని నడుపుతూన్న దెవరు? ఉద్యోగాల్లో రెండు లక్షల యాభైవేల మంది ఉన్న ధనికవర్గం. దాని కీలుబొమ్మలుగా పనిచేస్తున్నప్పటికీ ఈ రెండు లక్షల యాభై వేల మందీ ప్రభుత్వాన్ని నడపడంలేదు. ధనికవర్గంయొక్క మేధస్సు ప్రభుత్వాన్ని నడుపుతోంది. ఈ మేధస్సులో అనేకరకాల చిన్నచిన్న, శక్తిమంతాలైన ప్రజల మతాలు ఉన్నయ్. ఈ మతాలన్నీ పూర్తిగా ఏకాభిప్రాయంతో పనిచేస్తున్నవన్న సంగతి మరవవద్దు."

"వాటిల్లోఒకటైన రైలురోడ్డు మతానుగూర్చి చెప్పనీయండి. ప్రజల్ని న్యాయస్థానాల్లో ఓడించడానికి అది 40 వేలమంది లాయర్లను నియమించుకొంది. న్యాయాధిపతులకూ, బ్యాంకర్లకూ, పత్రికా సంపాదకులకూ, మంత్రులకూ, విశ్వవిద్యాలయ వ్యక్తులకూ, శాసనసభ్యులకూ, కాంగ్రెసుకూ, అది వేలాదిగా ఉచిత ప్రయాణపత్రాల్ని ఇస్తోంది. దేశం ముఖ్యపట్టణంలోనూ, రాష్ట్ర ముఖ్యపట్టణాల్లోనూ దేవేంద్ర భవనాల్లాంటి

ప్రాసాదాల్ని అది భరాయిస్తోంది. దేశంలోని అన్ని పట్టణాల్లో, లెక్కలే నంత మంది చిన్న వకీళ్ళను, ఛోటాఛోటా రాజకీయవాదుల్ని భరిస్తోంది. వాళ్ళు చిన్న కేసులకూ, చిన్న చిన్న సభలకూ హాజరౌతారు. జ్యూరీలను బుట్టలో వేసుకొంటారు న్యాయాధిపతులకు లంచాలు మేపుతారు. అన్ని విధాలా దాని శ్రేయస్సుకు పాటుపడ్తారు.''

''మహామహులారా! ధనికవర్గాన్ని నడుపుతూ ఉన్న ఏడుముఠాల్లో ఒక్కదాన్ని గూర్చి రేఖామాత్రంగానే చెప్పా. మీ 24 లక్షలకోట్ల డబ్బూ 25 దమ్మిడీల విలువచేసే ప్రభుత్వాధికారాన్నిగూడా మీకివ్వడం లేదు. మీది వట్టి గుడ్డిగవ్వ. ఆ గుడ్డిగవ్వగూడా త్వరలో మిమ్మల్ని విడచి పోతుంది. ధనికవర్గం ఈనాడు సర్వాధికారాలూ హస్తగతం చేసు కొంది. ఈ రోజది శాసనాల్ని చేస్తోంది. ఎందుకంటే, శాసనసభా, కాంగ్రెసూ, న్యాయస్థానాలూ, రాష్ట్ర శాసనసభలూ దాని పరంలో ఉన్నయ్. అంతమాత్రమేకాదు. శాసనం వెనక శాసనాన్ని అమలు పరచడానికి శక్తి కావాలి. ఈనాడు ధనికవర్గం శాసనాల్ని సృష్టిస్తోంది. ఆశాసనాన్ని అమలుపర్చడానికి దానికో సంజ్ఞ ఉంది. పోలీసునూ, సైన్యాన్ని, నావికాదళాన్ని, చివరకు మీరూ, నేనూ, మనమందరం ఉన్న ప్రజా సైన్యాన్ని ఆ సంజ్ఞద్వారా పిలుస్తోంది.''

దీని తర్వాత కొంచెం చర్చసాగింది. త్వరలోనే విందు పూర్తయింది. అందరూ చల్లబడ్డారు. లొంగిపోయారు. పిల్లిగొంతుకల్తో సెలవు తీసు కొన్నారు. అప్పటికాల పరిస్థితుల్ని గూర్చిన దృశ్యాన్ని చూచినందువల్ల వాళ్ళు భీతావహులైపోయినట్లు తోచింది.

''పరిస్థితి చాలా తీవ్రంగాఉన్నమాట వాస్తవమే. కానీ దాన్ని మీరు చిత్రించినవిధానంలో నాకుకొంచెం త గాదాఉంది. మధ్యతరగతి ప్రజలు నాశ

నమైపోతారన్న విషయంలోమాత్రం మీతో ఏకీభవించను. మేం నిలబడ్తాం. మేంగుత్తయజమాన్లను నెట్టేస్తాం.'' అని మి. కాల్విన్, ఎర్నెస్టుతోఅన్నాడు.

''అదోరకంగా యంత్రాల్ని ధ్వసంచేసే విధానమైనప్పటికీ, అది అర్థంలేనిదైనప్పటికీ, మీ ప్రాచీనుల పంథాకు తిరోగమిస్తారుకూడా'' అని ఎర్నెస్టు ఆయన వాక్యాన్ని పూర్తి చేసాడు.

''కానీ మరి ఈనాడు జీవితమే అర్థరహితంగా కనపడుతోంది. ధనిక వర్గ యంత్రాగారాల సంగతేమిటి. ఎట్లాగైనా మా యంత్ర విధ్వంసనా విధానం కనీసం ఆచరణయోగ్యమైంది, సాధ్యమైంది. మీ కలమాత్రం ఆచరణయోగ్యమూ, సాధ్యమూ కాదు. మీ సోషలిష్టు కలఉందే... అది కల మాత్రమే. మేము మిమ్మల్ని అనుసరించలేం.'' అని కాల్విన్ గంభీరంగా మాట్లాడాడు.

''మీకు కొంతైనా సాంఘికశాస్త్ర పరిణామవాద పరిచయం కలిగుంటే బాగుంటుందని అనుకొంటున్నా. మీకామాత్రం తెలిస్తే మాకీ ప్రయాసంతా తప్పించినవాళ్ళౌతారు.'' అని ఎర్నెస్టు వాళ్ళతో కరచాలనంచేస్తూ పరిహాసపూర్వకంగా అన్నాడు.

---

## ౧౦

వార్తాపారస్తుల విందులో మేఘగర్జనలాంటి కరతాళధ్వనులు చెలరేగిన తర్వాత, ఒకదానివెంట ఒకటిగా భయంకర పరిస్థితులు సంభవించినై. నేను—నామమాత్రమైన నేను—విశ్వ విద్యాలయం ఉన్న ఈ పట్టణంలో ఇంతవరకూ రాజెవరి బిడ్డరా అన్నట్లుగా కాలక్షేపంచేశా. కానీ ఇప్పుడు, నా వ్యక్తిగత పరిస్థితుల్తోసహా నేను పెద్ద సుడిగుండంలోపడి

కొట్టుకోవడం ప్రారంభించా. ఎర్నెస్టుమీద నాయన్న అనురాగం చేత విప్లవవాదినిగా మారానో, లేక నా సమాజాన్ని గూర్చి ఆయన ప్రసాదించిన అంతర్దృష్టి మూలంగా మారానో ఏమో నాకు తెలియదు. కానీ నేను మటుకు విప్లవవాదినిగా పరివర్తనచెందా. మూడు నెలలక్రితం గూడా నాకు గోచరించని పెద్ద సుడిగుండంలో ఈ నాడు ఇరుక్కుపోయా.

సమాజంలోవచ్చిన అత్యంతవిషమపరిస్థితులతోబాటు నా విషయంలో గూడా భయంకరపరిస్థితులేర్పడినై. మా నాన్న విశ్వవిద్యాలయం నుంచి విరమించుకోవడం మొట్టమొదటిసారిగా జరిగిన సంఘటన. ఆయన చట్ట రీత్యా విడుదల కాలేదనుకోండి! ఆయన రాజీనామాకు వత్తిడిమాత్రం తెచ్చారు. అంతే. ఈ సంఘటనవల్ల పెద్ద ముంచుకువచ్చిందేమీ లేదను కోండి! ఇది జరిగినందుకు వాస్తవానికి నాన్న ఎంతగానో సంతోషించాడు. తన ఉద్యోగవిరమణ, తాను వ్రాసిన 'ఆర్థికరంగం—విద్య' అన్న గ్రంథ ప్రకటనకు అవకాశం కల్పించిందని ప్రత్యేకంగా ఎంతగానో సంతోషించాడు. ఈ సంఘటన తన వాదాన్ని స్థిరపరచిందని పైగా మాతో కలహించాడు. పెట్టుబడిదారివర్గం విద్యావిధానాన్ని హస్తగతం చేసుకుందని రుజువు చేయడానికి ఇంతకన్నా ఏమి సాక్ష్యంకావాలి ?

కానీ, ఈ రుజువు ఎక్కడికీ ప్రాకలేదు. ఆయన రాజీనామా పట్ట బలవంతంగా జరిగిందన్న సంగతి ఎవరికీ తెలియదు. ఆయనచేత బలవంతాన రాజీనామా ఇప్పించడం జరిగిందని సకారణంగా ప్రకటన జరిగిఉంటే, ప్రపంచమంతా ఆగ్రహపూరితమైపోయేది. ఆయన అటువంటి సమర్థుడైన విజ్ఞాన శాస్త్రవేత్త. వార్తా పత్రికలన్నీ ఆయనమీద ప్రశంసావాక్యాలు కురిపించినై. ఎంతగానో గౌరవించినై. శాస్త్రపరిశోధనకోసం మొత్తం కాలాన్ని వినియోగించుకోడానికని విశ్వవిద్యాలయకుడ్యాల గర్భనుంచి బైటికి వచ్చేసినందుకు ఆయన్ని ఘనంగా శ్లాఘించినై.

నాన్న మొదటిసారి నవ్వాడు. తర్వాత కోపంవచ్చింది. అది కొద్ది మోతాదులో వచ్చినకోపం. తర్వాత ఆయన పుస్తకం మాపుచేయబడింది. ఈ మాపుచేయడం చాలా రహస్యంగా జరిగింది. మొదట్లో ఆయన అర్థంచేసుకోలేనంత రహస్యంగా జరిగింది. ఆ గ్రంథ ప్రచురణ దేశంలో వెంటనే కొంత కల్లోలాన్ని కలిగించింది. పెట్టుబడిదారి పత్రికలు నాన్నను మెత్తమెత్తని చివాట్లు పెట్టినై. ఇంత గొప్ప విజ్ఞానశాస్త్రవేత్త తన రంగాన్ని వదిలి తనకు ముక్కూమొగంకూడా తెలియని సాంఘిక ప్రపంచంమీదికి దాడిచేయడం విచారకరమైన విషయం, ఈ సందర్భంలో మటుకు దమ్మిడీకిగూడా కొరగాకుండా పోయాడన్న ధోరణిలో ఆ పత్రికల నిండా విధానం గోచరించింది. ఇట్లా ఒక్క వారంరోజుల వరకూ సాగింది. దీనికి మా నాన్న తనలోతాను నవ్వుకోని, పెట్టుబడిదారివర్గానికి తన పుస్తకం గాయంమీద కారంజల్లినట్లయిందని చెప్పాడు. ఉన్నట్లుండి ఒక్కసారిగా వార్తాపత్రికలూ, విమర్శనాత్మకమైన పత్రికలూ ఈ పుస్తకం విషయంలో మూగనోముపట్టి కూర్చున్నయ్. అట్లాగే అకస్మాత్తుగా మార్కెట్లోనుంచి పుస్తకంగూడా అంతర్ధానమైపోయింది. ఏ పుస్తక విక్రేత దగ్గరా ఒక్కప్రతిగూడా లభ్యపడడంలేదు. ప్రచురణకర్తలకు నాన్న ఉత్తరం వ్రాశాడు. ప్రమాదవశాత్తూ ప్లేట్లుపాడైపోయినై అని వాళ్ళదగ్గర్నుంచి సమాధానంవచ్చింది. దాని తర్వాత అసంతృప్తికరమైన ఉత్తరప్రత్యుత్తరాలు సాగినై. ముసుగులో గ్రుద్దులాటదేనికని, ఆ గ్రంథాన్ని మళ్ళీ అచ్చువేయించే ఆలోచన తమకులేదని, ఆ గ్రంథంమీద తమకున్న సర్వహక్కులూ వదలుకోడానికి సర్వసిద్ధంగా ఉన్నామనీ, చిట్టచివరికి తేల్చి చెప్పారు.

"ఇంక దేశం మొత్తంమీద మీ గ్రంథాన్ని తాకనుగూడా తాకే ప్రచురణకర్తే దొరకడు. నేనే మీ స్థానంలో ఉంటే, దాని అంతుతేలే

దాకా తరిమి వదిలిపెట్టేవాణ్ణి. మీకు ఉక్కుపాదం రుచి కొద్దిగానే తెలిసింది.'' అన్నాడు నాన్నతో ఎర్నెస్టు. మరి, నాన్న శాస్త్రజ్ఞుడే కాకపోతే మరేవీకాదు. త్వరపడి నిర్ణయాలు చేయడం ఆయనకు సుతరాం గిట్టదు. ఆ మూలాగ్రంగా ప్రత్యంశాన్నీ పరిశీలించకపోతే అది పరిశోధ నానుభవం కానేకాదు. అందుకని ఆయన చాలా ఓపికతో మొత్తం ప్రచురణాలయాలన్నిటినీ చుట్టతిప్పాడు. అవన్నీ లెక్కలేనన్ని క్షమాపణలు చెప్పుకొన్నవే గాని, ఒక్కటీ ఆ గ్రంథంసంగతి పట్టించుకోనేలేదు.

తన పుస్తకం నిజంగా మాపుచేయబడ్డదని నాన్న ఒప్పుకొన్న తర్వాత, ఆ విషయాన్ని పత్రికల్లో ప్రచురించడానికి విశ్వప్రయత్నం చేశాడు. కానీ ఆయన ప్రకటనలన్నీ బుట్టదాఖలైనై. చాలామంది పత్రికా విలేఖర్లు వచ్చిన ఒక సోషలిస్టు రాజకీయ సమావేశంలో మా నాన్నకు మంచి అవకాశం లభించింది. ఆ సభలో, తన పుస్తకం ఎట్లా మాపుచేయబడిందో మొత్తం చరిత్రను పూసగుచ్చినట్లు వివరించాడు. మర్నాడు వార్తాపత్రికలు చదివి నవ్వుకొన్నాడు. కోపంతో బాగా రెచ్చిపోయాడు. ఆ పత్రికలు పుస్తకాన్ని గూర్చిన విషయం లేశంకూడా తడవలేదు. పైగా అవి ఆయన్ని గూర్చి చాలా అందంగా విపరీత ప్రకటనలు చేసినై. అసలు సందర్భాన్నుంచి ఆయన మాటల్నీ, వాక్యాల్నీ మార్చేసినై. తొణుకూ బెణుకూ లేకుండా వినయంగా చెప్పిన ఆయన సారాంశాన్ని, అరాచక ఆక్రందనగా చిత్రించినై. ఆ చిత్రణ మనోజ్ఞమైన కళాఖండంగా ఉంది. ప్రత్యేకంగా నాకొక సంఘటన జ్ఞాపకముంది. మా నాన్న తన ఉపన్యాసంలో 'సాంఘిక విప్లవం' అన్న సమాసాన్ని వాడాడు. పత్రికా విలేఖరి కావాలని ఆ సమాసంలోని 'సాంఘిక' శబ్దాన్ని వదిలేశాడు. ఈ రిపోర్టు అసోసియేటెడ్ ప్రెస్ ద్వారా మొత్తందేశానికి పంపించబడింది. దేశంలో విపరీతమైన భయాందోళనారావం చెలరేగింది. నాన్నను శూన్యవాదిగా, అరా

చక వాదిగా లెక్కగట్టారు. అన్ని పత్రికలూ కాపీచేసిన ఒక వ్యంగ్య చిత్రంలో - పొడుగాటి జుట్టూ, నిప్పులుకురిసే కళ్ళూ కలిగి, చేతుల్లో టార్చిలైట్లూ, కత్తులూ, డైనమెట్ బాంబులూ ఉన్న జనసమూహానికి ముందు నిలబడి అరుణపతాకాన్ని ఎగరేస్తున్నట్లుగా నాన్నను చిత్రించారు.

ఆయన అరాచకత్వానికి, పత్రికల్లో విపరీతంగా తిట్లతో నిండిన పెద్దపెద్ద సంపాదకీయాల్లో తూర్పారబట్టారు. ఆయనకు చిత్తచాంచల్యం కలిగిందని వ్రాశారు. పెట్టుబడిదారి పత్రికలు ఈవిధంగా ప్రవర్తించడం కొత్తేమీ కాదని ఎర్నెస్టు చెప్పాడు. కార్మికవర్గంతో ఏమాత్రం సంబంధ బాంధవ్యాలు పెట్టుకోకుండా మధ్యతరగతి ప్రజల్ని భయపెట్టడానికి గాను, చెప్పిన విషయమంతా నానాభ్రష్టు పట్టించి మార్చి వ్రాయడంకోసం అన్ని సోషలిస్టు సభలకీ పత్రికా విలేఖర్లను పంపించడం వాళ్ళ ఆచారమే అని చెప్పాడు. నాన్నను ఇంకా తగాదామానుకోని, ఆత్మ రక్షణోపాయం చూచుకోమని, ఎర్నెస్టు మరీమరీ హెచ్చరిక చేశాడు.

ఎట్లాగైతేనేం సోషలిస్టు పత్రిక ఈవిషయాన్ని తీసుకోని పోరాటం సాగించినై. అందువల్ల కాస్త అక్షరజ్ఞానం కల్గిన శ్రామిక వర్గానికి గ్రంధం మాపుచేయబడిందని తెలిసింది. కాని ఈ యధార్ధవిషయం ఒక్క శ్రామిక వర్గానికి మాత్రమే తెలియడంతో ఆగిపోయింది. తర్వాత, 'సహేతుకతకు వినతి' అన్న పెద్ద సోషలిస్టు ప్రచురణాలయం, ఆ గ్రంధాన్ని ప్రకటించ డానికి నాన్నతో ఒప్పందం చేసుకొంది. నాన్న ఆనందపూర్ణుడైనాడు. కానీ ఎర్నెస్టు ఆందోళన చెందాడు.

"మనం అగమ్యగోచర శిఖరాగ్రంమీద ఉన్నామని చెప్తున్నా. మనచుట్టు రహస్యంగా పెద్దపెద్ద సంఘటనలు జరుగుతున్నయ్. మనం వాటిని గ్రహించవచ్చు. ఆ సంఘటనలేమిటో మనకు తెలియదుగాని అవి జరుగుతున్నయ్. సమాజ నిర్మాణం మొత్తం వాటితో కంపించిపోతుంది.

నన్నడగవద్దు. నామటుకు నాకే తెలియదు. కానీ ఈ సమాజ గంద్ర గోళంవల్ల ఏదోఒకటి రూపం ధరిస్తుంది. అది ఇప్పుడు రూపం ధరిస్తోంది. ఈ పుస్తకం మాపుచేయబడడం ఒక రభసగా తయారైంది. ఇదివరలో ఎన్ని పుస్తకాలు మాపుచేయబడినై? ఆ సంగతి మనకు ఊహామాత్రంగా నైనా తెలియదు. మనం చీకట్లో ఉన్నాం. మనకు తెలుసుకోవడానికి మార్గంలేదు. ఇక సోషలిస్టు పత్రికలూ, సోషలిస్టు ప్రచురణాలయాలు మాపుచేయబడతై. నిరీక్షించండి! ఆ సమయం ముంచుకువస్తోందని భయ పడుతున్నా. మన గొంతులు పిసికేయబోతున్నారు." అని ఎర్నెస్టు మరీ మరీ చెప్పాడు.

మిగతా సోషలిస్టులందరికన్నా ఎర్నెస్టు చాలా సన్నిహితంగా పరిస్థితుల పరిణామాన్ని పరిశీలిస్తున్నాడు. రెండు రోజుల్లోనే మొదటిదెబ్బ తగిలింది. 'సహేతుకతకు వినతి' అన్నది వారపత్రిక. కార్మికవర్గంలో అది కచ్చితంగా 750 వేలు అమ్ముడుపోతుంది. అదీగాక అడపాదడపా ప్రత్యేక సంచికలు వచ్చినప్పుడు 20 లక్షలు మొదలుకొని 50 లక్షల కాపీలం దాక చెల్లుతై. ఈ పెద్ద సంచికలకు బాగా డబ్బు చెల్లిస్తారు. వీటిని తనం తటతానే చొరవతీసుకొని ఉత్సాహంతో అమ్మే చిన్న శ్రామిక సైన్యం ఉంది. ఈ ప్రత్యేక సంచికలమీద మొదటిదెబ్బ గురిచూశారు. అదే పెద్దదెబ్బ. ఈ ప్రత్యేక సంచికలు, మామూలుగా ప్రచురించబడే పత్రికలు కావని పోష్టాఫీసు మధ్యవర్తిత్వపు తీర్పుచెప్పి, అది కారణంగా పోష్టల్ రవాణాకు అంగీకరించమని నిరాకరించింది.

ఒకవారం గడచిన తర్వాత, ఈ పత్రిక రాజద్రోహకరమైందని పోష్టాఫీసుశాఖ నిర్ధారణచేసి, మొత్తాన్ని పోస్టల్ రవాణాకు తీసుకోకుండా బహిష్కరించింది. సోషలిస్టు ప్రచారానికి ఇది ఒక భయంకరమైన దెబ్బ. పత్రిక, ఏమైతే అదవుతుందన్న నిశ్చయానికివచ్చి తెగబడింది. ఎక్స

ప్రెస్ కంపెనీలద్వారా ఆ పత్రికను చందాదారులకు అందజేద్దామని ఆలోచించిందిగాని, దానికి అవి సమ్మతించలేదు. దీనితో ఆ పత్రిక జీవితం అంతమైంది. ఐనా అది అంతటితో ఊరుకోలేదు. పుస్తక ప్రచురణలను కొనసాగించడానికి సిద్ధమైంది. నాన్న పుస్తకం 20 వేల కాపీలు బైండింగు అవుతున్నయ్. ఇంకా ఎక్కువ కాపీలు అచ్చవుతున్నయ్. ఆ సమయంలో, హెచ్చరిక గిచ్చరికా కూడా లేకుండా, ఒక రాత్రికి రాత్రి పెద్ద గుంపొకటి అమెరికన్ పతాకాన్ని ధరించి, దేశభక్తిగీతాలు పాడుకుంటూ బైలుదేరి ఆ సంస్థకు నిప్పంటించింది. ఇంకేం దాంతో మొత్తం సర్వనాశనమైకూర్చుంది.

కాన్సాస్‌లోని, 'గిరార్డ్' అలజడీగిలజడీలేని ప్రశాంతమైన పట్టణం. అక్కడ శ్రామిక ఆందోళనలంటూ ఇంతవరకెన్నడూ జరగలేదు. ఆ 'వినతి' సంస్థ యూనియన్ జీతాలు చెల్లిస్తోంది. నిజానికి ఆ సంస్థ, వందలాది పురుషులకూ, స్త్రీలకూ ఉద్యోగాలిస్తూ, ఆ పట్టణానికే వెన్నెముకగా ఉంది. ఆ నాడు అంత అఘాయిత్యానికి పాల్పడ్డగుంపులో గిరార్డ్ పట్టణానికి సంబంధించినవాళ్లొక్కరూ లేరు. ఇది ఉన్నట్లుండి ఉసిళ్ళపుట్ట మాదిరిగా భూమిలోంచి అమాంతంగా పుట్టుకువచ్చి తాను చేయాల్సిన సర్వం చేసి, మళ్ళీ పత్తాలేకుండా భూమిలోకే అదృశ్యమైపోయింది. ఈ సందర్భంలో పరమకిరాతకులదండు దిగుమతైందని ఎర్నెస్టు గ్రహించాడు.

"అమెరికాలో విద్రోహాకరముఠాల్ని తయారుచేస్తున్నారు. ఇది ప్రారంభదశ. ఇంకా ముందుంది బ్రహ్మప్రళయం. ఉక్కుపాదం ఇంకా చేవెక్కుతోంది" అన్నాడు ఎర్నెస్టు.

ఈ విధంగా నాన్న పుస్తకం అణగద్రొక్కేయబడింది. రోజులు గడుస్తున్నకొద్దీ విద్రోహాకరముఠా పెరిగిపోతోంది. వారం వారానికీ సోషలిస్టు పత్రికల్ని పోస్టల్ రవాణా చేయకుండా నిరాకరించడాలు జరిగిపోతు

న్నయ్. అనేక సందర్భాల్లో విద్రోహకరమతాలు సోషలిస్టు పత్రికల్ని నాశనంచేయడం జరుగుతోంది. పాలకవర్గంయొక్క అభ్యుదయనిరోధక సిద్ధాంతాలకు అనుకూలంగా ప్రచారంసాగిస్తూ, నాశనంచేయబడ్డ సోషలిస్టు పత్రికల్ని వ్యతిరేకంగా చిత్రించి వాటిని దుమ్మెత్తిపోస్తూ, విద్రోహకర మతాల్ని నిజమైన దేశభక్తులుగా, సమాజోద్ధారకులుగా శ్లాఘిస్తూ ఉన్న పత్రికలు ఉన్నవనుకోండి! నిష్కల్మషులైన మతాచార్యులు సైతం విద్రోహకర మతాల్ని ప్రశంసిస్తూ, వాళ్ళ హింసావిధానాలకు పూనుకోవలసిన ఆవశ్యకత కలిగినందుకుమాత్రం విచారిస్తున్నామని అనేటంతగా ఆ పత్రికల ప్రచారం సాగిపోతోంది.

మహావేగంగా చరిత్ర పురోగమిస్తోంది. ఎన్నికల రోజులు సమీపిస్తున్నయ్. కాంగ్రెసును నడపడంకోసం సోషలిస్టుపార్టీ ఎర్నెస్టును నియమించింది. ఆయన ఎన్నికల్లో ఎన్నుకోబడే సదవకాశం బాగా ఏర్పడుతోంది. శాన్‌ఫ్రాన్సిస్కోలో ట్రాం వాళ్ల సమ్మె విచ్ఛిన్నమైపోయింది. తదనంతరం గుఱ్ఱబ్బండ్లవాళ్ళ సమ్మె దెబ్బతింది. ఈ రెండు అపజయాలు సునిర్మిత శ్రామికసంస్థకు పెద్ద ఆఘాతం కలిగించినై. మొత్తం జల నిర్వాకసంస్థా (Water Front Federation) దానితోబాటు నిర్మాణ వృత్తుల్లో ఉన్న తదితరమైనసంస్థలూ గుఱ్ఱబ్బండ్లసంఘానికి బాగా తోడిచ్చినై. కానీ అన్నీ ఘోరపరాజయాన్ని పొందినై. అది రక్త ప్రవాహసమ్మె. పోలీసులు తమ లాఠీల్తో కొన్ని వేల శిరస్సుల్ని బద్దలుకొట్టారు. 'మార్సెల్‌డన్' ప్రత్యేకరవాణా కంపెనీ పంచల్లోనుంచి మెషిన్‌గన్ స్వేచ్ఛావిహారం సాగించి ప్రజల కళేబరాల్ని కన్నుమూసి కన్నుతెరచేలోపల కుప్పలు కుప్పలుగా పేర్చికూర్చుంది.

ఈ సంఘటన జరిగిన తర్వాత ప్రజలంతా కోపోద్రిక్తులై పగబట్టిన తాచులైపోయారు. వాళ్లు నెత్తురుకు నెత్తురు చెల్లాలన్నారు. దెబ్బకు

దెబ్బ తీయడంకోసం ఉరూగ్రితలూగారు. తామై కోరుకొన్న రంగంలో దెబ్బతిన్నవాళ్లు రాజకీయ కృషిద్వారా ప్రతీకారానికి పరిపక్వదశలో వచ్చారు. వాళ్ళింకా తమ శ్రామికసంస్థను నిర్వహిస్తూనే ఉన్నారు. ముంచుకువచ్చిన రాజకీయపోరాటానికి ఈ సంఘటన మాంచి బలాన్నిచ్చింది. ఎన్నికల్లో ఎర్నెస్టు ఎన్నుకోబడే అవకాశం క్రమక్రమేపీ బలవత్తరమాతోంది. రోజు రోజుకూ యూనియన్లన్నీ సోషలిస్టులకే ఎక్కువ తోడ్పా ఇస్తున్నయ్. ఆఖరికి కోడిపిల్లల్ని అమ్మేవాళ్లూ, అపరకర్మలు చేయించేవాళ్లూ కూడా ఈ పంధాకు వచ్చేసారని తెలిసేటప్పటికి ఎర్నెస్టుకూడా నవ్వాడు. శ్రామికులు మూర్ఖపు పట్టుదలకు దిగారు. పిచ్చి ఉత్సాహంతో సోషలిస్టుల సభలకు అసంఖ్యాకంగా జనం హాజరౌతూంటే, పాతపార్టీ రాజకీయవాదులకు దుఃఖం పట్ట శక్యంగాకుండా ఉంది. పాత రాజకీయముఠా ఉపన్యాసకుల సభల్లో కలికానికి ఒక్కడైనా కనపడ్తే ఏ ఒట్టుపెడ్తే ఆఒట్టు. ఐనా అప్పుడప్పుడూ వాళ్ళ అంతుఏదో తేల్చుకొందామని ప్రజలు వచ్చినప్పుడుమాత్రం సభలు నిండుగా ఉంటయ్. ప్రజల తాకిడికి తట్టుకోలేక చాలా పర్యాయాలు రిజర్వుపోలీసుల్ని పిలిపించుకోవడం జరుగుతోంది.

చరిత్ర త్వరత్వరగా పరుగెడ్తోంది. జరుగుతున్న, జరగబోతున్న పరిస్థితుల్తో వాతావరణం సంచలిస్తోంది. విదేశాల్లో విడుదలచేయడానికి కష్టమైన శేషం మరింతగా కష్టతరం కావడంచేత, దేశం మొత్తం కష్టపు దినాల్లో మునకలువేస్తోంది. పరిశ్రమలన్నీ కొద్దికాలం పనిచేస్తున్నయ్. శేషం విడుదలకాకపోవడంవల్ల చాలా పెద్దపెద్ద యంత్రాలన్నీ గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నయ్. కూలీలు ఎడాపెడా తగ్గిపోతున్నాయ్.

పెద్ద యంత్రకారుల సమ్మెకూడా విఫలమైపోయింది. - లోహ పరిశ్రమలో పనిచేసే 5 లక్షల యంత్రకారుల్తో సహా ఉన్న రెండులక్షల మంది యంత్రకారుల సమ్మె పూర్తిగా విచ్ఛిన్నమైపోయింది. అమెరికాలో

ఇటువంటి ఘోరంగా ఎన్నడూ ఏ సమ్మె విఫలం కాలేదు. యాజమాన్య సంస్థలు రంగంలోకి దూకించిన సమ్మెవిధ్వంసక ముఠాలు ఆయుధాలు ధరించి నిలబడి ముఖాముఖిగా చిన్నచిన్న పోరాటాలు సాగిస్తున్నయ్. అనేక ప్రదేశాల్లో విచ్చలవిడిగా విద్రోహకర ముఠాలు చెలరేగి ఆస్తిపాస్తులకు అపరిమిత నష్టాన్ని కలిగించినై. మొత్తం గంద్రగోళాన్నంతా అదరింపు బెదిరింపుల్తో అణచివేసి ప్రజల్లో భీతావహం కలిగించడానికని అమెరికాలోని లక్ష సైన్యాన్ని కూడా అదనంగా పిలిపించారు. కార్మికవర్గ నాయకుల్ని చాలమందిని ఉరితీశారు. ఇంకా చాలామందిని జైళ్ళల్లో కుక్కారు. సమ్మెలో ప్రముఖస్థానాలు వహించిన వేలకు వేలమంది ఉన్నత నాయక వర్గాన్ని గొర్రెమందల్లాగా ఒకచోట గుంపుచేసి, సిపాయీలు చాలా అసహ్యకరంగా వాళ్ళపట్ల ప్రవర్తించారు.

నిండు చంద్రునితో పండువెన్నెలలానందించిన కాలానికి అమావాస్య అనుభవించే విధికలిగింది. మార్కెట్లన్నీ శేషాల్తో వెక్కసమైపోయినై. అన్ని మార్కెట్లూ పడుకొంటున్నయ్. ధరలు పడిపోతున్నయ్. అన్ని ధరలకన్నా శ్రామికుల ధరలు మరీ త్వరలో పడిపోవడం ప్రారంభించినై. పారిశ్రామిక పోరాటాల్తో దేశం నిలువునా కంపించిపోయింది. కార్మికులు ఇక్కడా అక్కడా అనేమిటి; ప్రతిచోటా సమ్మెలు చేస్తున్నారు. ఎక్కడ సమ్మెచేయడంలేదో అక్కడ కార్మికుల్ని పెట్టుబడిదారులు బైటికి గెంటేస్తున్నారు. పత్రికలనిండా హింసాగాథలు రక్తగాథలు కనపడ్తున్నయ్. దానిద్వారా విద్రోహకర ముఠాలు తమ పాత్రను తాము నిర్వహిస్తున్నయ్. దొమ్మి, దోపిడీ, గృహదహనం, కావాలని సర్వనాశనంచేయడం, హత్యలు మొదలైన భీభత్సకార్యాలు వాళ్ళపని. దాన్ని వాళ్ళు చాలా జయప్రదంగానే నిర్వహించారు. విద్రోహకర ముఠాల చర్యలవల్ల మొత్తం సైన్యమంతా రంగంలో ప్రవేశించింది. పట్టణాలూ, మహానగరాలూ సాయుధ

సిబ్బందితో నిండిపోయినై. కార్మికుల్ని పిచ్చికుక్కల్ని కాల్చేసినట్లు కాల్చేస్తున్నారు. అసంఖ్యాక నిరుద్యోగ సమూహంలోనుంచి సమ్మె విచ్ఛిన్నకారులు చేర్చుకోబడుతున్నారు. కార్మిక సంస్థలు, సమ్మె విచ్ఛిన్నకారుల్ని పరాజితుల్ని చేసినప్పుడు, సాయుధ దళాలు ప్రత్యక్షమై సంస్థల్ని అణగద్రొక్కేస్తున్నయ్. ఇకప్పుడు సిపాయిదండు సాక్షాత్కారం. ఐనప్పటికీ మార్షల్ లాను ఆశ్రయించాల్సిన అగత్యత ఏర్పడలేదు. సర్వసామాన్యమైన సిపాయిదళం రంగంలో సర్వత్రా ప్రవేశించింది. ఈ భయంకర పరిస్థితిలో ప్రభుత్వం సామాన్యసైన్యాన్ని ఇంకోలక్షరుఅదనంగా పెంచింది.

కార్మికులిట్లా అన్ని విధాలా చెంపపెట్టూ గోడపెట్టూ ఇంతవరకెన్నడూ తినలేదు. బాధపడ్తున్న ఉద్యోగుల సంస్థలు ప్రారంభించిన పోరాటంతో పారిశ్రామికాధినేతలూ, అల్పసంఖ్యాక ప్రభుత్వం మొదటిసారిగా తమ బలాన్నంతా ప్రయోగించినై. ఈ సంస్థలన్నీ పూర్తిగా మధ్య తరగతికి సంబంధించినవి. మార్కెట్లు పతనమై గడ్డుకాలం రావడం చేత, పారిశ్రామికాధినేతల సహాయంద్వారా, వాళ్ళు నిర్మాణాత్మకమైన కార్మికులపైన చావుదెబ్బ తీశారు. అది సర్వశక్తిమంతమైన సఖ్యత. కానీ ఆ సఖ్యత సింహానికీ, గొర్రెపిల్లకీ మధ్యఉన్న సఖ్యతవంటిదని మధ్యతరగతి తెలుసుకోడానికి ఆట్టేకాలం పట్టలేదు.

కార్మికులంతా రక్తదాహంతో కొరకొరలాడ్తున్నారు. కానీ అణచివేయబడ్డారు. ఐనా వాళ్ల పరాజయంతో గడ్డుకాలపు సమస్య తీరిపోలేదు. అల్పసంఖ్యాక ప్రభుత్వానికి ప్రముఖబలంగా ఉన్న బ్యాంకులు అప్పులివ్వడం సాగించినై. వాల్‌స్ట్రీటు ముఠా, నిలవ మార్కెట్టును సర్వనాశనం చేసింది. దీని మూలకాన దేశంలో ఉన్న ధరలన్నీ ఒక్కసారిగా కుప్పకూలినై. ఈ నాశనంనుంచి, సుస్థిరమైన, నిశ్చితమైన, నిరంకుశమైన అల్ప సంఖ్యాక ప్రభుత్వం తలెత్తింది. ఆ ప్రభుత్వపు ప్రశాంతతా, స్థైర్యం మరీ భయంకరంగా

ఉంది. అది కేవలం తన విస్తృతాధికారాన్ని ఉపయోగించడమే కాకుండా, తన ఎత్తుగడలకు ఉపయోగకారిగా అమెరికా శాసనాగారాన్నే ఉపయోగించుకొంది.

పారిశ్రామికాధినేతలు మధ్యతరగతిమీదికి విరుచుకుపడ్డారు. పారిశ్రామికాధినేతలకు కుడిభుజంగా నిలిచి కార్మికుల్ని విచ్ఛిన్నంచేయడానికి సర్వవిధాలా సాయంచేసిన ఉద్యోగులసంఘం, ఈనాడు తమ పూర్వపు స్నేహితులచేత చీల్చి చెండాడబడుతోంది. ఛోటా వ్యాపారస్తులు, ఉత్పత్తిదారుల్తో కూడిన మధ్యతరగతి విచ్ఛిన్నమై పోతూంటే, గుత్త యజమానులు సుస్థిరమౌతున్నారు. గుత్తయజమానులు పటిష్ఠులుకావడమేకాదు, కార్యశూరులుకూడా ఐనారు. వాళ్లు జంఝామారుతాన్ని సృష్టించారు. ఇంతకు ముందుకన్నా కూడా అది చాలా బలిష్టంగావీస్తోంది. ఎందుకంటే, ఆ సుడిగాలిలో లాభా లెట్లాచేసుకోవాలో వాళ్ళకే తెలుసు. ఎటువంటి లాభాలు! అనంత లాభాలు! వాళ్లు సృష్టించిన ప్రచండమారుతమే కాబట్టి, దాని ధాకకు వాళ్లు తట్టుకోని నిలబడగలంత బలంగా ఉన్నారు. వాళ్ల చుట్టూ మిగిలిఉన్న శిధిలావశేషాల్ని ఉప్పున ఎగరగొట్టేశారు. ధరలు ఊహించలేనంత పతనావస్థ చెందినై. క్రొత్త క్రొత్త రంగాల్లోకూడా ప్రవేశించి, మధ్యతరగతి ప్రజల్ని దోచుకొంటూ, గుత్త యజమాన్లు తమకు ఇంతకు ముందున్న సంపదకు ఇంకా అదనంగాచేర్చుకొంటున్నారు. ఈవిధంగా 1912 వ సంవత్సరపు వేసవికాలం, మధ్యతరగతి ప్రజల సంపూర్ణ మరణావస్థను దర్శించింది. కన్నుమూసి తెరిచేలోపల మధ్యతరగతికి సంభవించిన ఈ చరమదశను ఎర్నెస్టువంటివాడుకూడా సంభ్రమాశ్చర్యచకితుడైనాడు. అయన అశుభసూచకంగా తల పరికించాడు. రాబోయ్యే ఎన్నికలుతలపోసిం నిరాశాదృక్కులు ప్రసరించాడు.

"ఇది లాభంలేదు. మనం దెబ్బతిన్నాం. ఉక్కుపాదం ప్రత్యక్షమైంది. బ్యాలెట్ పెట్టెద్వారా ప్రశాంత విజయాన్ని కాంక్షించా. పొరపడ్డా. విక్సన్ చెప్పిందే నిజం. మనకున్న స్వేచ్ఛావకాశాలేకాల్ని కూడా దోచుకొంటారు. ఉక్కుపాదం మన మొగాలమీదగా త్రొక్కుకుంటూ పోతుంది. ఇక శ్రామిక రక్తవిప్లవం తప్ప మిగేలేదేమీలేదు. మనమే జయిస్తామనుకోండి! కానీ దాన్ని తలచుకొంటే నా వళ్లు జలదిరిస్తోంది." అన్నాడు ఎర్నెస్టు.

అది మొదలుగా ఎర్నెస్టు విప్లవంమీదనే దృఢవిశ్వాసంతో ఉన్నాడు. ఈ విషయంలో ఆయన తన పార్టీకన్నా ఒకడుగు ముందుగానే ఉన్నాడు. ఆయన సోషలిస్టు సహచరులు ఆయనతో ఏకీభవించలేదు. ఎన్నికల ద్వారానే విజయం సాధించవచ్చునని వాళ్ళిప్పటికీ నొక్కి చెప్తున్నారు. వాళ్లంతా సంభ్రమించి పోయారనికాదు. ఆ విప్లవానికి వాళ్లంతా తగిన ధైర్యంతో లేరు. చాలా ప్రశాంతంగా ఉన్నారు. వాళ్లు కేవలం విప్లవాన్ని గూర్చి అపనమ్మకంలో ఉన్నారు. అంతే. రాబోయ్యే అల్ప సంఖ్యాక ప్రభుత్వాన్నిగూర్చి భయపడేటట్లుగా ఎర్నెస్టు వాళ్లను ఘట్టిగా ప్రయత్నించలేకపోయాడు. ఆయన వాళ్లల్లో పంచలనం కలిగించాడు. కానీ వాళ్లు తమబలంలో అమిత విశ్వాసంతో ఉన్నారు. వాళ్ళ సాంఘిక పరిణామ సిద్ధాంతంలో అల్పసంఖ్యాక ప్రభుత్వానికి ఆస్కారమేలేదు. కాబట్టి, అల్ప సంఖ్యాక ప్రభుత్వం అంటూ ఉండడానికే వీల్లేదు.

"మేం నిన్ను కాంగ్రెసుకు పంపిస్తాం, దాంతో అంతా తేల్తుంది." అని మా రహస్య సమావేశాల్లో ఒక దాంట్లో వాళ్ళు ఆయనతో అన్నారు.

"వాళ్ళు నన్ను కాంగ్రెస్సునుంచి బైటకుపంపించి, గోడకు నిలవేసి నా తలకాయను ఉప్పున ఊదేసినప్పుడు—అప్పుడేం చేస్తారు?" అని ఎర్నెస్టు ప్రశాంతంగా ప్రత్యుత్తర మిచ్చాడు.

"అప్పుడు మేం మా బలంతో విజృంభిస్తాం." అని ఒక దజను గొంతుక లొక్కసారిగా సమాధానం చెప్పినై.

"అప్పుడు మీరు మీ రుధిరపంకంలో స్నానం చేస్తారు. మధ్యతరగతి ఈ పాటే పాడడం నే నింతకుముందు విన్నా. మరిప్పుడు దాని బలంతో అదెక్కడుంది?" అని ఎర్నెస్టు ఘాటుగా సమాధానం చెప్పాడు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 1024 B 183 |
| పుస్తకం పేరు | ఉత్తర పాదం |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 176 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NOlo |
| పరిస్థితి | GOOD |